SRI VENKATESVARA ORIENTAL SERIES No 13

*Editor :—* Prof: P. V. RAMANUJASWAMI, M. A,

# ఆంధ్ర కువలయానందము

శ్రీ వేంకటేశ్వరప్రాచ్యకళాశాలా ప్రధానాంధ్రాధ్యక్షులగు
ఉభయభాషాప్రవీణ

**కంభంపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి**

విరచితము

ద్వితీయ ముద్రణము



తిరుపతి

తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రాశాల

**1952**

[వెల రూ. **3—12—0**

# INTRODUCTION

I was requested by my friend, Mr. Kambhampati Subrahmanya Sastri, to write a few words by way of Introduction to his *Telugu Kuvalayānanda* which is issued in the Sri Venkateswara Oriental Series under the auspices of the Institute. I have accepted the offer for two reasons. First because this will afford me an opportunity to say a few words about the methods of enriching the Vernaculars of our country. Secondly because, although Mr. Subrhamanya Sastri is now connected with the Sri Venkateswara First Grade College, he was for some time connected with the Oriental College over whose destinies I have the fortune to preside as the Ex-officio Principal.

Mr. K. Subrahmanya Sastri hails from the Godavari District and after a distinguished service of 12 years as the Telugu Pandit in the Devasthanam Hindu High School at Tirupati, he joined the Oriental College as Asst. Professor Telugu and rose to the post of Professor in a few years. Pecuniary considerations tempted him to leave the Oriental College and join the First Grade College as the Lecturer in Telugu. He began his Sanskrit studies while quite young and acquired proficiency in Nyaya Sastra under two eminent Pandits, Mr. Mantha Chandrasekhara Sastri of Peruru and Mr. Sripada Lakshminarasimha Sastri of Pithapuram. Subsequently he obtained the Ubhayabhasha Pravina title of the Andhra University in Sanskrit and Telugu. For the latter qualification he had to study the standard works in Telugu besides elements of Sanskrit Grammar. He is

therefore thoroughly qualified by his attainments to translate a standard work in Sanskrit on Rhetoric

*Kuvalayānanda* by Appayya Dikshita is one of the Sanskrit works on Rhetoric which is invariably studied by students desirous of acquiring a thorough knowledge of Sanskrit literature. It treats of Figures of speech in Sanskrit and the author, Appayya Dikshita, discusses about the diffarent aspects of the figures in a masterly manner. His style is simple and his treatment of the subject very lucid. Mr. Subrahmanya Sastri has done a valuable service to the Telugu language by translating this useful work into Telugu. He has not only translated the work but has added notes on several additional points connected with the contents of the work.

Apart from its intrinsic poetical worth, Telugu literature, so far as its content goes, is mainly modelled on Sanskrit literature. Nannaya deserves credit for being the first poet in Telugu but his *Bhārata* is but a rendering of the Sanskrit *Mahābhārata*. Allasāni Peddanna is deservedly styled the 'Father of Telugu Poetry' but his *Manucharita* is an adaptation of an episode in the Purāṇas. When Telugu literature began to appear, there was the fully blown Sanskrit literature ready at hand to supply the content and the early Telugu poets thought it not worth while to develop new *genre* when the existing Sanskrit literature offered them many and when they were diffident of producing better ones. Moreover Sanskrit literature by that time developed fully in all directions and supplied models for every conceivable species. It is only in recent years that Telugu poets turned their eyes away from Sanskrit literature and succeeded in producing novel *genre* though on the model of western literature.

The ancient Telugu poets confined their attention to general literature and produced several Purāṇas and Prabandhas in Telugu. The scientific literature was left alone and any one who wanted to acquire a knowledge of the sciences apart from literature proper had to go to the perennial source and learn them through the Sanskrit language. This sort of dependence is not conducive to the life of the language. Realising this and with a view to put an end to dependence on the part of their language, Telugu scholars in recent years turned their attention to the scientific literature in Sanskrit and commenced to bring it into Telugu. In the field of literary criticism, with which we are directly concerned now, several works have been thus translated into Telugu. The *Daśarūpaka* was translated by Mr. Malladi Suryanarayana Sastri, *Sāhitya-darpaṇa* by Sri Vedam Venkataraya Sastri, *Dhvanyāloka* by Sri Pantula Lakshminaraya Sastri, *Rasagaṅgādhara* by Sri Jammalamadugu Madhavarama Sarma, *Kāvyalaṅkara-sūtravṛtti* by Sri Vedala Tiruvengadachari and *Prātapa-rudrīya* by Sri Chalamacharla Rangacharlu.

So far as I know, the *Kuvalayānanda* has not yet been translated into Telugu before, although a summary of it was published by Sri Balusu Venkataramanayya. As soon as I came to Tirupati as the Director of this Institute, I noticed the potentialities of Mr. K. Subrahmanya Sastri and suggested to him that he should undertake to translate this work into Telugu. I am very grateful to the Pandit for having acted up to my suggestion and accomplished the translation in such a masterly manner and I am very happy to issue it now as one of the numbers of the Sri Venkatesvara Oriental Series.

Scientific works in Sanskrit, however well they might have been written, entail on us the additional burden

of construing a dead language to that of comprehending the principles of the science for Sanskrit must be considered to be a dead language in spite of many advocates of the contrary view. Again a language can also be enriched by enriching its literature and it must be the sacred duty of every son of the language to enrich his mother. So Mr. Subrahmanya Sastri deserves the thanks of all Telugu speaking population for enriching their language by this work of his. I hope many scholars will follow the example of Mr. Subrahmanya Sastri and enrich their mother language in this manner. The question of vernacularization of higher studies is now seriously engaging the attention of the authorities and we all sadly feel that it is beset with the difficulty of want of suitable text-books in the various sciences and this can be solved only by other scholars producing standard works in Telugu in the different sciences like Mr. Subrahmanya Sastri.

S. V. ORIENTAL INSTITUTE, TIRUPATI. 13-12-47.

P. V. RAMANUJASWAMI
DIRECTOR

# ఆంగ్లోపోద్ఘాతమున కాంధ్రము

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయ యాజమాన్యమున శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య గ్రంథమాలయం దొక పుష్పముగా నవతరించిన ఆంధ్ర కువలయానందమున కుపోద్ఘాతము వ్రాయవలసినదిగా మన్మిత్రులు శ్రీ కంబముపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు నన్ను కోరియుండిరి. వారి కోరికను నేను రెండు కారణములచే నంగీకరించితిని. మన దేశభాషలను బెంపొందింపవలసిన తీరు తెన్నులను దెలియజేయు నవకాశ మిందు మూలముగా లభించుట తొలి కారణము. శ్రీ శాస్త్రిగారు ప్రస్తుతము శ్రీ వేంకటేశ్వరకళాశాల యం దాంధ్రోపన్యాసకులుగ నున్నను నింతకు ముందు వారు నా యాధ్యక్ష్యమున నడచు ప్రాచ్య విద్యాలయ మం దాంధ్రాచార్యులుగఁ గొంతకాల ముండుట మలి కారణము.

శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు గోదావరిమండలమున కోనసీమ యందు జన్మించిరి. కాని వారు శ్రీ తిరుపతి దేవస్థాన హైందవోన్నత పాఠశాలలో పంద్రెండేడులపాటు మాటిమన్ననలతో కూడిన తియ్యని యొజ్జరికము నాంధ్రమందు నెఱపిరి. పిమ్మట ప్రాచ్యవిద్యాలయ మం దాంధ్రాధ్యాపకులుగా నుండి కొలది సంవత్సరములలోనే శ్రీ వేంకటేశ్వ రాంగ్ల కలాశాలయం దాంధ్రాధ్యాపక పదవి నలంకరించిరి. విద్యా వ్యాసంగమున వీరు గురుకుల క్లిష్టులై, చిఱుతప్రాయముననే విఖ్యాత న్యాయశాస్త్రవేత్తలు పేరూరు నివాసులు నగు శ్రీ మంథా చంద్రశేఖర శాస్త్రివర్యుల తోడను పీఠికాపురసంస్థాన విద్వాంసులు బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీనరసింహ శాస్త్రివర్యుల తోడను న్యాయశాస్త్రాధ్యయనము గావించిరి. తదనంతరము ఆంధ్ర విశ్వవిద్యాలయము వారి 'ఉభయభాషాప్రవీణ'

బిరుదమును సంస్కృతాంధ్రములందు బడసిరి. ఆ బిరుదము నొందుటకు వీరు తెలుగునందలి ప్రామాణిక గ్రంథములను జదివి సంస్కృత వ్యాకరణ సాంప్రదాయముల నవగత మొనర్చుకొనిరి. కాన వీరి వైదగ్ధ్యము సంస్కృతమునందలి దేదేని ప్రామాణికమైన యలంకారగ్రంథను నాంధ్రీకరింప జాలియున్నది.

శ్రీ అప్పయదీక్షితుల వారలంకారశాస్త్రముః రచించిన కువల యానందము సంస్కృత సాహిత్యమున చక్కని పరిజ్ఞానము నొందగోరు విద్యార్థులచే ననివార్యముగ బఠింప దగియున్నది. శ్రీ దీక్షితుల వారీ గ్రంథమునం దలంకారములకు సంబంధించిన వివిధవిషయములను నిష్కృష్ట మైన పద్ధతిం జర్చించిరి. వీరి శైలి సరళమై ప్రతిపాదనాపద్ధతి ప్రసాద గుణశోభితమై యున్నది. శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారీ గ్రంథమును నాంధ్రీకరించి తెలుగు సాహిత్యమున కెనలేని సేవ చేసిరి. వీరు దీని ననువదించుట మాత్రమే కాక సంగతమగు గ్రంథాంతర విషయములను పెక్కింటి నిందు సందర్భానుసారముగ జర్చించియున్నారు.

కవితలోని విశిష్టతలను వీడినచో, తెలుగు సాహిత్య వస్తువు ప్రధానముగా సంస్కృతసాహిత్యము నాధారముగా గొని నిర్మితమైనది. ఆంధ్రభాషలో నాదికవి యగుటం జేసి నన్నయ సన్మానార్హుడే కాని యాతని భారతము సంస్కృతానువాదమే కదా! ఆంధ్రకవితా పితామహుడైన అల్లసాని పెద్దనయు మనుచరిత్రమునకు కథావస్తువును బురాణమునుండియే సేకరించెను. ఆంధ్రసాహిత్యావతరణ తరుణమునకు సంస్కృత సాహిత్యము పరిపుష్టమై సంపూర్ణ వికాసము నొంది తెలుగు కవులకు వలసినంత సామగ్రి నొసగవలంతియై యుండెను. ప్రాచీనాంధ్ర కవులును దీని నెకింగియే నూతనపద్ధతుల నన్వేషింపక సంస్కృతములోని విషయములనే గ్రహించిరి. నాటికే సంస్కృత సాహిత్యము సర్వతో ముఖవికాసము నొంది సంభావ్యములగు కవితాపద్ధతుల నన్నిటిని నందింప

సమర్థమొయుండెను. కేవల మిటీవలనే తెలుగుకవులు సంస్కృతసాహిత్య పరాఙ్ముఖులై పాశ్చాత్య సాహిత్యానుకరణ మగు నవలావాఙ్మయము నవతరింపజేయ మొదలిడిరి.

ప్రాచీనాంధ్రకవులు తమదృష్టిని సంస్కృతసాహిత్యము నాధార ముగా గొని పురాణ ప్రబంధములను మాత్రమే వెలయించిరి. శాస్త్ర వాఙ్మయమును గ్రహింపలేదు. శాస్త్ర జిజ్ఞాసువులు సంస్కృతభాషా మూలముననే విషయములను గ్రహింపవలసినవారైరి. ఈ పద్ధతి దేశ భాషా వికాసమును గూర్చ జాలదను విషయమును గ్రహించియే ఆంధ్ర పండితు లిటీవల సంస్కృత శాస్త్ర సాహిత్యమును గూడ నాంధ్రీకరింప నారంభించిరి. వారి ప్రయత్న ఫలితముగనే సాహిత్యవిమర్శ గ్రంథముల భాషాంతరీకరణములు పెక్కులు వెలసినవి. శ్రీ మల్లాది సూర్య నారాయణ శాస్త్రిగారి దశరూపకము, వేదము వెంకటరాయశాస్త్రిగారి సాహిత్యదర్పణము, పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారి ధ్వన్యా లోకము, జమ్మలమడక మాధవరామ శర్మగారి రసగంగాధరము, శ్రీ వేదాల తిరువేంగళాచార్యుల వారి కావ్యాలంకార సూత్రవృత్తి, చలమచర్ల రంగాచార్యులవారి ప్రతాపరుద్ర యశోభూషణము, వానిలో ప్రసిద్ధములైనవి.

నా యెఱింగినంతవరకు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు కువలయానందసారమును ప్రకటించినను కువలయానందమునకు సమగ్రా నువాద మింతవరకు వెలువడలేదు. శ్రీ తిరుపతి ప్రాచ్య పరిశోధ నాలయమునకు కులపతిగా వచ్చిన వెంటనే నేను శ్రీ శాస్త్రిగారి పాండితిని గుర్తించి యీ గ్రంథము నాంధ్రీకరింపవలసినదిగా సూచించి యుంటిని. నా సూచనమును పాటించి యీ గ్రంథము నింత ప్రామాణి కముగ తీర్చి దిద్దిన శ్రీ శాస్త్రిగారి యెడ నెంతయు గృతజ్ఞుడను.

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య గ్రంథమాలయం దొక కుసుమముగా దీనిని వెలువరించుట కెంతో సంతసించుచున్నాను.

సంస్కృతము నందలి శాస్త్రగ్రంథము లెంత చక్కగ వ్రాయబడినను ఆ సంస్కృతము నిశ్శంకముగ మృతభాషయగుటచే శాస్త్ర సంప్రదాయములు మనకు దురవగాహము లైనవి. మఱియు, సాహిత్యము పెంపొందిననేగాని భాషాసౌష్ఠవము చేకూరదు కావున తన మాతృభాషను బెంపొందించుట ప్రతిమానవునకు పవిత్రకార్యమై యున్నది. కాబట్టి యీ గ్రంథముచే భాషకు పెంపుసొంపులు నించిన శ్రీసుబ్రహ్మణ్య శాస్త్రిగారు యావ దాంధ్రుల ధన్యవాదములకు పాత్రులు. ఈవిధముగానే తెలుగు నాటి పండితు లందఱు శ్రీ శాస్త్రిగారి ననుసరించి తెలుగు భాషను బెంపొందింతురని యాశించుచున్నాను. మాతృభాషా మూలముగ నున్నత విద్యలను గఱప నుత్సహించు ప్రభుత్వమునకు సరియైన గ్రంథములు లేమి తీవ్రసమస్యగా పరిణమించినది. శ్రీ శాస్త్రిగారి వలె వివిధ శాస్త్ర గ్రంథములను పండితు లనువదించినపు డీసమస్య పరిష్కృతమగును.

ఓం

# మనవి

విశ్వశ్రేయము కావ్యము. కావ్యములు కాంతాసమ్మితములు. కాంత లలంకారప్రియలు. అలంకారములు చమత్కార జనకములు. చమత్కార ముక్తివిశేషలభ్యము. ఉక్తివిశేషము ప్రతిభావ్యుత్పత్తి ప్రాప్యము. ప్రతిభావ్యుత్పత్తులలో ప్రతిభ గరీయసి. అట్లయ్యు నది వ్యుత్పత్తిసహకారము లేనిదే విలసిల్లఁజాలదు. కావున విద్యాభిలాషి వ్యుత్పత్తి నార్జించుకొనవలెను. వ్యుత్పత్తి గురుశిక్షవలన గ్రంథపఠనాదులవలనను గలుగును. శాస్త్రజ్ఞాన మలవడనిదే వ్యుత్పత్తికలుగు టరిది. కావున వ్యుత్పత్తికాములకు శాస్త్రపఠనాభ్యాస మావశ్యకము. అందు చేతనేకదా కృష్ణదేవరాయలంతటి ప్రభువు " స్వామీ నన్ను నితఃపురాపఠితశాస్త్రగ్రంథ జాత్యంధు " అనిపించినాడు.

స్వతంత్రభారతమున నెల్లరకు స్వాతంత్ర్యాభిలాష, దేశభాషాభిమానము, రేకెత్తినకాలమిది. ఈసమయమున జాతిమతవివక్ష లేకుండ విజ్ఞానమభివృద్ధినొందవలెను. అందుకై మతగ్రంథములు శాస్త్రగ్రంథములు దేశభాషలలో వెలువడవలసియున్నవి. ఈయుద్యమమున నిదివరకే పెద్దలెందఱో మార్గదర్శకులైనారు. ఆంధ్రదశరూపక, సాహిత్యదర్పణాదులు వెలసినవి. విన్నకోట పెద్దనార్యప్రణీతమగు కావ్యాలంకార చూడామణ్యాది శాస్త్రగ్రంథములం దలంకారము లసమగ్రమగుటచేతను, కొన్నిట సమగ్రములయ్యు నవి వచనరచనలో లేమిం జేసియు, శాస్త్రగ్రంథములు వచనరచనలోనున్న నే సుబోధములగునను తలంపునను, శ్రీ అప్పయ్యదీక్షితులవారి కువలయానందమును నేనామూలాగ్రమాంధ్రీకరించితి. ఈ యాంధ్రీకరణమెల్లరకు సుబోధము

కావలెనను తలంపుతో నలుగురును వాడుకొనుపదములనే యెక్కువగ వాడినందుకు, సరళాదేశాదులు నర్ధబిందువులు మున్నగు వ్యాకరణాంశముల నెక్కువగ పాటింపమికి, విజ్ఞులు నన్ను క్షమింతురుగాక. శాస్త్రీయ విషయముల నాంధ్రీకరించుటలో నెల్లరకు దెలియునట్లు బాగుగ వివరింపలేమికిగూడ విషయవిశేషముల నెరింగినవారు నన్నాదరించి యీ యాంధ్ర కువలయానందము నాదరాభిమానములతో పరికింతురుగాతమని వినయముతో మనవిచేసుకొనుచున్నాను.

ఈ యాంధ్రకువల యానందరచనకు కారకులు విద్వత్కులీనులు, మహావిద్వాంసులు శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యవిద్యాలయ నియంతలునగు శ్రీమాన్ పరవస్తు రామానుజస్వామి M.A., గారు. రచనకు మాత్రమే కాదు ప్రకటనకుగూడ వీరే మూలము. వారికి నానమశ్శతములు. ఇంతియ కాక వారికెన్నిపనులున్నను, నాయందనుగ్రహముతో నాకోరిక ప్రకార మీగ్రంథమునకు పీఠికవ్రాసిన శ్రీవారి యుదారహృదయమునకు నే నెంతయు గృతజ్ఞుడను.

ఈ గ్రంథరచనలో నెడనెడతోడుపడిన పెద్దలకందఱకును నా వందనములు. దీనికి చక్కని శుద్ధప్రతి వ్రాసి యిచ్చిన చిరంజీవి విద్వాన్ యస్. విజయరాఘవునికిని, ప్రూఫులు దిద్దుటలో నాకు తోడుపడిన అంతేవాసి యువకులిద్దఱికి నా యాశీస్సులు. ఎన్నిమాఱులు ప్రూఫులు తీయవలసివచ్చినను విసుగుచెందక గ్రంథముద్రణ మొనరించిన శ్రీ దేవస్థాన ముద్రణాలయము వారికి, నా కృతజ్ఞతను దెలుపుకొనుచున్నాను.

ఇట్లు విన్నవించు విబుధజనవిధేయుడు

కంభంపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి

సాహితీ సమితి సభ్యుడు

సర్వజిత్సంక్రాంతి.

ఓం

# ద్వితీయ ముద్రణావతరణిక

అలంకార శాస్త్రములో అప్పయదీక్షితుల వారి కువలయానంద మద్వితీయ గ్రంథము. ఇది చంద్రాలోకమున కన్వర్థమగు వ్యాఖ్యానము. చంద్రాలోకము నందలి యలంకారములను వివరించుపట్టున దీక్షితుల వారు పాటించిన శాస్త్రమర్యాదను సంస్కృతభాషాజాతీయతను నందలి తీరు తియ్యముల నాంధ్రానువాద మొనరించు సందర్భమున బ్రదర్శింప బూనుట నావంటి యల్పవిజ్ఞానికి సముద్రాని కేతా మెత్తుటే. అందును కువలయానందాంధ్రానువాదమే నా కాద్యకృతి యగుటచే నీ కృత్యాద్యవస్థలో పాఠకలోకమునకు సుబోధమగు పద్ధతిలో ననువదించుట అంత సులభసాధ్యము కాలేదు. నా ద్వితీయ తృతీయ కృతులగు 'కావ్యాలంకార చూడామణిభావప్రకాశిక (వ్యాఖ్య), తర్కప్రకరణసారము' కూడ నింతకంటె సులభ గ్రాహ్యములేమో యని నా తలంపు. ఆ రెండును శ్రీ వేంకటేశుని కృపవలన నచిరకాలములోనే ప్రకటితము లగునని నా యాశ.

శాస్త్రములో సామాన్యముగ కార్యకారణములం జూపునప్పుడు కార్యమును ముందు చెప్పి పిదప హేతువు నుపన్యసించుట పరిపాటి. దాని నీ తెనుగున పాటించిన నేపాటియు పాటవము నీయక యసంపూర్ణతను దెలుపుచుండుటచే నీ ముద్రణమున నాంధ్రభాష కనువగు పద్ధతికి మార్చి భాషనుగూడ వీలైనంత సులభముగ నొనర్చియుంటిని. ఎంత చేసినను విషయగౌరవ మొకటి యున్నది! అద్దాని కెప్పుడు గురుశుశ్రూష యవసరమే కదా!

ఈ ద్వితీయ ముద్రణావసరమున నా కోరిక ప్రకారము తొలి పీఠిక కాంధ్రానువాద మొనరించి యిచ్చిన శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యవిద్యాలయ

నియంతలు శ్రీమాన్ పరవస్తు వేంకట రామానుజస్వామి యమ్.ఏ. గారికి, నాకు సందియములు కలిగినపుడెల్ల వానిం దీర్చి సహాయ మొనర్చిన శ్రీమాన్ ‘పండితరాజ’ డి. టి. తాతాచార్యులు యమ్. ఓ. యల్. గారికిని నా నమశ్శతములు. ఈ పునర్ముద్రణము నం దన్ని విధములం జేదోడు వాదోడుగ నుండి తోడ్పడిన నా తనూజయు శ్రీ వేంకటేశ్వర మహిళాకలాశాలాంధ్రోపన్యాసకురాలును విద్వాన్ చిరంజీవి సౌభాగ్యవతి పరిమి అరవిందాదేవికి నా ఆశీస్సులు. పునర్ముద్రణమున కవకాశము కలిగించిన పాఠకలోకమునకు నా నమోవాకములు.

ఇట్లు విన్నవించు బుధజనవిధేయుడు

కంభంపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి.

సాహిత్యసమితి సభ్యుడు

నందన సంక్రాంతి.

ఓం

# విషయసూచిక

ఓం

# గురువందనము

పేరు ప్రతిష్ఠలతో నొప్పారు పేరూరు గ్రామమునందు చిన్ననాటి నుండి శిష్యశిక్ష నొనరించి చిన్నయ్యశాస్త్రి యను పేరొంది సాహిత్య గ్రంథములను ప్రకరణాద్యవయవాంతన్యాయ గ్రంథములను నా కుపదేశించిన మహాసత్వమూర్తి శ్రీ మంథా చంద్రశేఖరశాస్త్రి గురుదేవునకు,

శ్రీ పీఠికాపురసంస్థాన ప్రధానపండితులు న్యాయవేదాంత పారంగతులు శ్రీరామభక్తులు అవయవ వ్యుత్పత్తివాద శక్తివాద ప్రామాణ్యవాదోపదేష్టలు శ్రీ శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రి గురుపాదులకు,

ఇరుసుమండ యను నామాంతరమున విలసిల్లు ఋషిమండలమున ఋషిప్రవరులు నానొప్పు శాళీపండితులు నాకు పాణినీయము నుపదేశించిన పరమ తపస్వి శ్రీ మంగిపూడి వేంకటశాస్త్రి దేశికోత్తములకును

నా హృదయపూర్వకవందన సమర్పణము.

ఓం

శ్రీగురుభ్యోనమః

# ఆంధ్ర కువలయానందము.



అమరీకబరీభారభ్రమరీముఖరీకృతమ్ ।
దూరీకరోతు దురితం గౌరీచరణపంకజమ్ ॥

పరస్పరతపస్సంపత్ఫలాయితపరస్పరౌ ।
ప్రపంచమాతాపితరౌ ప్రాంచౌ జాయాపతీ స్తుమః ॥

ఉద్ఘాట్య యోగకలయా హృదయాబ్జకోశం
ధన్యైశ్చిరాదపి యథారుచి గృహ్యమాణః ।
యః ప్రస్ఫురత్యవిరతం పరిపూర్ణరూపః
శ్రేయస్స మే దిశతు శాశ్వతికం ముకుందః ॥

బాలుర కలంకారములందు వ్యుత్పత్తి సిద్ధించుటకై యలంకారముల యొక్క లక్ష్యలక్షణ సంగ్రహము లలితముగఁ జేయఁబడుచున్నది. ఏ యలంకారములకుఁ జంద్రాలోకమున లక్ష్య లక్షణ శ్లోకములున్నవో యా యలంకారముల వివరించు పట్టునఁ బ్రాయికముగ నవే గ్రహింపఁ బడినవి. అందు లేనివాని కభినవలక్ష్య లక్షణములు చెప్పఁబడినవి.

## 1. ఉపమాలంకారము.

ఎచట రెండు వస్తువులకు సాదృశ్యసంపద విలసిల్లునో
యచట నుపమాలంకారముండును.

ఉ॥ కృష్ణ! నీ కీర్తి హంసివలె నాకాశగంగలో నోలలాడు
చున్నది.

ఏ కావ్యమున నుపమానోపమేయములకు సహృదయ హృద యాహ్లాదజనకమై సుందరమగు సాదృశ్యము వ్యంగ్యమర్యాదతోఁగాక

స్పష్టముగాఁ బ్రకాశించునో యచట నుపమాలంకారము. హంసి, కీర్తి, స్వర్గంగావగాహన..., వలె శబ్దము, అను నీ యుపమానోపమేయ సామాన్యధర్మ సాదృశ్యవాచకములు నాలుగు నుండుటవలన నిది పూర్ణోపమ యనఁబడును.

> ఈశ్వరుఁడు విధు విషములనుబోలెఁ బండితుఁడు గుణ దోషములను గ్రహించి తొలిదానిని శిరసుతో శ్లాఘించును. రెండవదానిని గంఠమున దాచి యుంచుకొనును.

ఇచటనుపమానమగు నీశునందు విధు విషములను గ్రహించుట= స్వీకరించుట. ఆ రెంటిలోఁ దొలిదగు విధువి శిరసుతో శ్లాఘించుట= తలపై నుంచుకొనుట, రెండవదగు విషమును గంఠమున దాచి యుంచు కొనుట=బిగపట్టుట. ఉపమేయమగు బుధునందు గుణదోషములను గ్రహించుట=తెలిసికొనుట. వానిలోఁ దొలిదగు గుణమును శిరసుతో శ్లాఘించుట=తలయూపుచుఁ మెచ్చుకొనుట. రెండవదగు దోషమును గంఠమున దాచియుంచుకొనుట=నోటితో వెల్లడింపకుండుట అను భేదముంబట్టి చూడగా నుపమానోపమేయములందు సాధారణధర్మ మొక్కటిగా లేదు.

అట్లయ్యు విధువిషములకు గుణదోషములకును బింబప్రతిబింబ భావముచే నభేదము కలుగుటవలన, స్వీకరించుట తెలిసికొనుట మొదలగు వానిని 'గ్రహించు' అను నొకేపదముతోఁ జెప్పి, యొకటిగాఁదలచుటవలనను, సాధారణధర్మైక్యము పొసఁగినది. పూర్వోదాహరణము కంటె నిం దిది భేదము.

నిజముగ వేఱయ్యు రెండును పోలికచే నొకటిగాఁ దోచు నుపమానోపమేయ ధర్మములను వేఱుపదములతోఁ జెప్పుట బింబప్రతిబింబ

భావమని యాలంకారిక సంకేతము. (ఇచట ధర్మపదము ధర్మికిని నుపలక్షకము)

> ఉపమానోపమేయ సామాన్యధర్మ వాచకశబ్దములలో
> నొకటిగాని రెండుగాని మూడుగాని గ్రహింపకుండుట
> వలన లుప్తోపమ యెనిమిది విధముల నేర్పడును.
> ఉ॥ తటిద్గౌరి, ఇందుతుల్యాస్య, నాకన్నులకుఁ గన్పారిత,
> కాంతిచే స్మరవధూయితయు నగుతన్వి నాకు రహస్య
> మునఁ గనఁబడెను. ఆమెతోఁ గలయికయా మెరతిలా
> భము అనునది తెలుపకయె సంభవించుటవలన, కాక
> తాళీయమయ్యెను. (మిత్రమ! ఏమి చెప్పుదు.)

ఉపమేయాది చతుష్టయములో నొకదానినిగాని రెంటినిగాని మూఁటినిగాని తెలుపు శబ్దములు లేనిచో లుప్తోపమయని చెప్పఁబడును. ఆ లుప్తోపమ యెనిమిదవిధములు. ఎట్లంటె, 1. వాచకలుప్త. 2. ధర్మలుప్త. 3. ధర్మవాచకలుప్త. 4. వాచకోపమేయలుప్త. 5. ఉపమానలుప్త. 6. వాచకోపమానలుప్త. 7. ధర్మోపమానలుప్త. 8. ధర్మోపమాన వాచకలుప్తయునని. అందుపమాన లోపరహితములు నాలుగు భేదములు తటిద్గౌరీత్యాదిచేఁ జూఁపబడినవి. ఉపమానలోప సహిత భేదములు నాలుగు రెండవవాక్యమునఁ జెప్పఁబడినవి.

వానిలోఁ దటిద్గౌరి యనుచో వాచకలోపము 'తటిత్తువలె గౌరి' యను నర్థమందు ఉపమానములు సామాన్య వచనములతో సమసించును, అను సమాసవిధాయక శాస్త్రముచే నేర్పడినది. 'ఇందుతుల్యాస్య' యనుచో నున్న ధర్మలోపము, కాంతిచే నిందు తుల్యాస్యయనియు చెప్పతగ్గయుగులచ నైచ్ఛికము కాక శాస్త్రకృతము కాదు.

కర్పూరిత యనుచో ధర్మవాచకముల లోపము 'కర్పూరమివాచరితా' యను నర్థమునఁ జెప్పఁబడిన కర్పూరమువలె నానందరూపమగు నాచారార్థమునిచ్చు క్విప్ ప్రత్యయము 'ఇవ' శబ్దముతోఁ గూడ లోపించుట వలన నేర్పడినది. నయనముల కానందస్వరూపమగుటచేఁ గర్పూరిత యని చెప్పుటయు సంభవించుటవలన నిచట ధర్మలోపమైచ్ఛికము.

కాంతిచే స్మరవధూయిత యనుచోటనున్న వాచకోపమేయ లోపము, కాంతిచే నను విశేషణ సామర్థ్యము వలనఁ దన్ను రతితుల్యగా నాచరించిన (స్వాత్మానం స్మరవధూమివాచరితా) యను నర్థము గమ్యమానమగుటచే నుపమేయమగు స్వాత్మ నుపమావాచకముతోఁ బాటు చెప్ప పోవుట వలన నేర్పడినది. స్వాత్మ (తాను) కామవధువుగా నాచరించి (నడచుకొని) నదని యుపమేయగ్రహణము కూడ సంభవించుట వలన నాయుపమేయలోపమైచ్ఛికము.

కాకతాళీయము అనుచోటఁ గాక తాళపదములు సమాస విషయమునఁ గాకతాళ సమవేతక్రియా (కాకాగమన, తాళపతన) పరములు. కావున కాకాగమనమువలె తాళపతనమువలె (కాకాగమనమివ తాళపతనమివ) 'కాకతాళము' అని ఇవార్థమున 'సమాసాచ్చ తద్విషయాత్' అను సూత్రజ్ఞాపకమువలన సమాసము. రెండు చోటుల నుపమేయము తానొకచోటికేగుట, అచటనే తన్వి యొంటరిగనుండుటయు. కాకతాళపదములకు ఇవశబ్దముతో సమాసముచేఁ దనయొక్కయు తన్వియొక్కయు సమాగమము కాకతాళ సమాగమ సదృశమని తేలినది. పిమ్మట కాకతాళమువలె కాకతాళీయము, (కాకతాళమివ కాకతాళీయమ్) అనుచో రెండవ ఇవశబ్దముయొక్కయర్థమున 'ఇవే ప్రతికృతౌ' అనునధికారములోనున్న 'సమాసాచ్చ తద్విషయాత్' అను సూత్రముచే ఛప్రత్యయమువచ్చి కాకతాళీయము

అనియయ్యెను. పతన్దళితమగు తాళఫలము కాకిచే నుపభుక్తమైనట్లు, ఒంటరిగాఁ గనఁబడుటచేఁ గంపిత హృదయయగు తన్వి తనచే ననుభవింపఁబడెనని కాకతాళీయపదమున కర్థము తేలినది. అందువలన నిచటఁ గాకాగమన తాళపతన సమాగమరూపమగు నుపమానమును, కాక కృత తాళఫలోపభోగ రూపోపమానమునుఁ జెప్పకపోవుటవలనఁ బ్రత్యయార్థోపమయందు దుపమానలోపమును, సమాసార్థోపమయందు వాచకోపమానలోపమును నేర్పడెను. ఈ రెండు లోపములు ఛప్రత్యయవిధాయక శాస్త్రమువలనఁ గలిగినవి. తలంపకయే సంభవించుట యను సాధారణధర్మమును గ్రహింపనిచోఁ బ్రత్యయార్థోపమయందు ధర్మోపమానలోపము, సమాసార్థోపమయందు ధర్మోపమాన వాచకలోపము నని సూక్ష్మదృష్టితో గ్రహింపనగును. ఉదాహరణాంతరములు గ్రంథ విస్తర భీతిచే నీయలేదు.

## 2. అనన్వయము.

ఉపమానత్వోపమేయత్వము లొక వస్తువునందేయున్నట్లు చెప్పిన నన్వయ మగును.

ఉ॥ చంద్రుఁడు చంద్రునివలెఁ గాంతిమంతుఁడు.

**ఒక** వస్తువునకే యుపమానత్వోపమేయత్వ వర్ణనమనన్వయము; వర్ణింపఁబడునదైనను దనకుఁ దనతో పోలిక కుదురదను వ్యుత్పత్తినిఁ బట్టి. పోలిక కుదురకున్నను జెప్పుట, వేఱొక సమానవస్తువులేదనుటచే సాటిలేమిని దెలుపుటకే. చంద్రుఁడు చంద్రునివలెఁ గాంతిమంతుఁడని చెప్పినప్పుడు కాంతిలో జంద్రునకు సాటి వేఱొకటి లేదనెడు సదృశాంతరఖండనము లభించును. కాఁగాఁ దనకుఁ దనతోనైనను సాదృశ్యము సంభవింపక పోవుటవలన సాటిలేక పోవుటలోఁ బర్యవసన్నమైనది. మఱియు,

త్వన్నయన సమకాంతియగు నిందీవరము నీట మునిగినది. నీముఖచ్ఛాయ ననుకరించు చంద్రుఁడు మబ్బుచే గప్పఁబడెను. నీ గమనము ననుసరించు రాయంచలును బోయెను. నీ సాటి వస్తువులతోడి నా వినోదము కూడ దేవుఁ డోర్చుటలేదు. ( ఉపమానమునకుపమేయత్వ కల్పనము. )

(౨) ఉపమానమున కుపమేయత్వలాభముచే వర్ణ్యమున కనాదరము కలిగిన ద్వితీయ ప్రతీపమగును.

ఉ॥ వదనమా ! గర్వింపకు. కాంతిచే నీ సాటివాఁడు చంద్రుఁడున్నాడు.

వర్ణ్యము గొప్ప గుణములు కలదగుటచే వేఱొకచో తన సాదృశ్యము నోర్వనిదై యుండ దానికుపమేయము నొకదానిం గల్పించి తిరస్కరించుట ద్వితీయప్రతీపము. ఇది మొదటిదానింటె నధిక చమత్కార జనకము. ( ఉపమేయ తిరస్కారము ) మరియు,

తన్వీ ! నీ కనుదోయి కారణముగఁ దగని గర్వమును దాల్చెదవేల ? ఎక్కడఁ జూచినను గొలఁకులలో నల్ల కలువ లిట్టివి కలవుకదా !

(౩) వర్ణ్యమున కుపమేయ లాభముచే నుపమానమునకుఁ దిరస్కారముకూడఁ బ్రతీపమే.

ఉ॥ మిత్త్రీ ! క్రౌర్యగర్వము నీ కేల ? నీవంటివారు స్త్రీ లున్నారు కదా !

మిక్కిలి గొప్పగుణము కల దగుటచే నెచ్చటను బోలికను సహింపని యుపమానమునకు వర్ణ్యము నుపమేయముగఁ గల్పించి యా యుపమానమును దిరస్కారము చేయు టనునది పూర్వ ప్రతీపమునకు విపరీతమైన ప్రతీపము మూఁడవది. మరియు,

కాలకూటమా ! దారుణ వస్తువులలో గొప్పదాననని గర్వింపకు మమ్మా ! ఈలోకమున ఖలవచనములు నీవంటి వెన్నేని యున్నవికదా (ఉపమాన తిరస్కారము.)

(4) వర్ణ్యముతో నుపమానమునకు సామ్యము సిద్ధింప దనుటయుఁ బ్రతీపమే యగును.

ఉ॥ పద్మము త్వన్ముఖాభ మనుట వ్యర్థాపవాదము.

వర్ణ్యముతో నుపమానమునకు సామ్యము సిద్ధింపదనుట పూర్వప్రతీపములకంటె నధిక చమత్కారజనకము చతుర్థప్రతీపము. ఉదాహరణమున వ్యర్థాపవాద మనుటచే సామ్యాసిద్ధి ప్రకటితము. మరియు,

తన్వీ ! పామరులు నీ మోముతోఁ జంద్రునిఁ బోల్తురు. (నీ మోము నెఱింగిన) భూలోకముననే యీ నింద వినుము. (సామ్యాసిద్ధి కథనము.)

(5) ఉపమాన మెందుకనుటకూడఁ బ్రతీప మనఁబడును.

ఉ॥ దాని మోముఁ జూచినఁ గమలమెందుకు ? చంద్రుఁ డెందుకు ?

ఉపమేయమే యుపమాన ప్రయోజనము నొసగుచున్నది, కనుక యుపమాన మెందుకనుట ఉపమాన తిరస్కారమును సాధించును. కావున నిది ప్రతీప మైదవది. మఱియు,

నలుని కీర్తి ప్రతాపములుండఁ జంద్ర సూర్యు లెందుకని బ్రహ్మకుఁ దోచినపుడెల్ల నతఁడు చంద్ర సూర్యులను బరివేషకై తవమున గుండలించుచున్నాఁడు. (ఉపమానమెందుకనుట.)

[3] కొందఱు (దండ్యాదులు) అనన్వయోపమేయోపమ ప్రతీపములు ఉపమాదిభేదములగుటచే నుపమలో నంతర్భావమునుఁ దలంచిరి. మఱి కొందఱు (వామనాదులు) పంచమ ప్రతీపప్రకార ముపమానాక్షేప రూపము కావున నాక్షేపమందురు.

## 5. రూపకాలంకారము.

విషయియొక్క యభేద తాద్రూప్యములచే విషయమును రంజింపఁచేయుట రూపకము. అది యెక్కువగను దక్కువగను సమముగను జెప్పుటచేతఁ ద్రివిధము.

ఉ॥ 1. ఈతఁడు పురములను దహించిన యీశుఁడే.

2. ఈతఁడు మూఁడవకన్ను లేని యీశ్వరుఁడు.

---

3. వస్తుతస్తు ప్రతీపమున నాద్యత్రయమందె సామ్యమున్నది. కాని చతుర్థ పంచమ భేదములం దది లేనేలేదు. కావున నంత్యద్వయ మెన్నడు నుపమాంతర్భూతము కానేరదు. ఆద్యత్రయమందు సాధర్మ్యమున్నను నది చమత్కారముం గూర్చి ప్రధాన ప్రయోజకము కాదు. సాధర్మ్యమూలకమగు తిరస్కారమే చమత్కార ప్రయోజకముగా వివక్షింపఁబడినదికాని సాధర్మ్యమే వాచ్యమై చమత్కార ప్రయోజకముగా వివక్షింపఁబడలేదు. కావున నీయాద్యత్రయముకూడ నుపమాంతర్భూత మనుట సంగతముకాదు. అట్లే యనన్వయోపమేయోపమలందును జమత్కారమును గూర్చి సాదృశ్యము సాక్షాత్ప్రయోజకముకాదు. ఇఁక నేమంటె రెండవ సాటివస్తువు లేదనుట నుపాయమగుటచేతనే సాదృశ్యము చమత్కార ప్రయోజకము. కావున నివియు నుపమాంతర్భూతములనుట సరిపడదు. అటుగాక సాదృశ్యవర్ణనమాత్రముననే యుపమాంతర్భావమును జెప్పుచో 'ధైర్యగాంభీర్యాది గుణములచే నీవాసముద్రునితో సమానుఁడవు, శరీరముచేతనే భేదము' అను నిట్టి వ్యతిరేకాలంకారముకూడ నుపమాంతర్భూతము కావలసివచ్చును. అక్కడ సాధర్మ్యముతోఁ గూడిన విశేషధర్మమే చమత్కారమునఁ బ్రధానము కాని సాధర్మ్యము మాత్రము కాదన్నచో నీ సమాధానము ప్రతీపాదులందును తుల్యమేయని సహృదయు లెఱుంగుదురుగాక. వామనమతమునను నిట్టి యస్వారస్యమునే లేకుండునది. ఆక్షేపము ప్రతిషేధ నిమిత్తమగుటచే నుపమాన తిరస్కారరూపమునఁ జమత్కారప్రయోజకమగును. ఇట్టి యస్వారస్యమా మతములం దుండుటచేతనే గ్రంథకర్త కొంద ఱందు రనెను.

3. ఇతఁడు సమద్ర్యనొంది భూమినిఁ బాలింప వచ్చిన శంకరుఁడు.

4. ఈమె ముఖచంద్రునిచే నేత్రానందము కల్గుచుండఁ జంద్రుఁ డెందులకు ?

5. ఈ సాధ్వి సుధాబ్ధినుండి పుట్టని మఱియొక లక్ష్మి.

6. ఈ ముఖచంద్రుఁడు కళంకియగు చంద్రునికంటె నతిశయించుచున్నాఁడు.

విషయి యుపమానమగు పద్మాదికము. విషయ ముపమేయము వర్ణనీయము నగు ముఖాదికము. ఉపమానపు రూపుతో నుపమేయమును రంజింపఁజేయుట రూపకము. అన్యరూపముచేత రూప(రంజన)ము కలదిగాఁ జేయఁబడుటచే రూపకమయ్యెను. ఆ రంజన మొకచోఁ బ్రసిద్ధోపమానాభేదమునఁ బర్యవసన్నమగును. మఱొక్కచోట భేదమగపడుచునే యుపమాన ధర్మారోపమాత్రమునఁ ( ఉపమాన ప్రయోజన మొనరించుటలో ) బర్యవసాన మొందును. అందువలన రూపక మభేదరూపకము, తాద్రూప్య రూపకము నని రెండు విధములు. ( తాద్రూప్యమన ? ఉపమాన ప్రయోజనమునొనరించుట. ) ఆ ద్వివిధ రూపకము ప్రత్యేకము ప్రసిద్ధోపమానముకంటె నెక్కువగ వర్ణించుటచేత — తక్కువగ వర్ణించుటచేత — సమముగ చెప్పుటచేతను త్రివిధము. ఇట్లు రూపకమాఱువిధములు. ఇతఁడు ఇత్యాదిగాఁ జూపఁబడిన మూఁడుదాహరణములు నభేదరూపకములు. ఈమె ముఖచంద్రుని ఇత్యాదిగాఁ జెప్పఁబడినవి తాద్రూప్యరూపకములు. ఆధిక్య — న్యూనత్వ — సమత్వము లుద్దిష్ట క్రమమునకు విపరీతముగ నుదాహరింపఁబడినవి. పురదగ్ధయను విశేషణముచే వర్ణనీయుఁడగు రాజునందు శివాభేదమును బ్రకటించుటవలన శివుని పూర్వావస్థకంటెఁ బ్రకృతమగు రాజభావావస్థయందు న్యూనత్వాధిక్యముల వర్ణింపక పోవుటవలన మొదట

యుదాహరణ మనుభయాభేదరూపకము. రెండవ యుదాహరణమున మూఁడవ కన్ను లేనియని చెప్పుటచేఁ బూర్వావస్థకంటె న్యూనత చూపుటవలన నిది న్యూనాభేదరూపకము. న్యూనత్వవర్ణనముకూడ నభేదమును దృఢపరచునదగుటచే నధిక చమత్కారము కలది. విషమ దృష్టి వీడి జగద్రక్షకత్వమును జెప్పుటచే శివునికిఁ బూర్వావస్థకంటెఁ బ్రకృతమగు రాజభావావస్థయం దుత్కర్షను బ్రకాశింపఁ జేయుటవలన మూఁడవది యధికాభేదరూపకము. ఇట్లు మీఁది తాద్రూప్య రూపకో దాహరణములందును గ్రమముగా సమన్యూనాధిక భావము లూహింపఁ దగును. ఈ క్రమము ననుసరించియే లక్ష్యాంతరము లీఁబడును.

[4] శారద చంద్రికచే విశదపులినమగు సరయూనదీ సైకత మున నిద్దఱు సిద్ధయువకుల కిట్లు చాలసేపు వాక్కలహ మయ్యెను. అందొకఁడు కైటభునిఁ బ్రథమ నిహతునిఁ గాను మఱొకఁడు కంసుఁడు ముందు చంపబడినట్లును జెప్పెను. ఆ నీవు నిజము చెప్పుము. అందు నీచే నెవఁడు ముందుఁ జంపబడెను ?

ఇచట ఆ నీవనుటచే నెవఁడు కంసకైటభులను జంపిన గరుడ ధ్వజుఁడో యాతని యభేదమును బ్రకృతుఁడగు రాజునకుఁ బ్రతిపాదించి యాతనిఁగూర్చి కంసకైటభ వధలలో నేది ముందను ప్రశ్నవ్యాజముచే రాజునందు భగవత్తాదాత్మ్యము బలపరచుటవలనఁ, బూర్వావస్థకంటె నెచ్చుతగ్గులను వెల్లడింపక పోవుటచేత ననుభయాభేద రూపకము.

---

4. చంద్రజ్యోత్స్నావిశదపులినే సైకతేఽస్మిన్సరయ్వా
వాదద్యూతం చిరతరమభూత్సిద్ధయూనోః కయోశ్చిత్ ।
ఏకో వక్తి ప్రథమనిహతం కైటభం కంసమన్య
స్స త్వం తత్త్వం కథయ భవతా కోహత స్తత్ర పూర్వమ్ ॥

బ్రహ్మ కాంతాకనకములందు భ్రాంతిని రెండు విధములు
గావించెను. ఆ రెంటియందాసలేనివాఁడు సాక్షా
న్మానవాకృతిఁ దాల్చిన మహేశ్వరుండే.

ఇట సాక్షాత్తను విశేషణముచే విరక్తునికిఁ బ్రసిద్ధ శివతాదాత్మ్యముఁ జూపి మానవాకృతియని దివ్యమూర్తికి లోపమును దెలుపుటవలన న్యూనాభేద రూపకము.

ఓ రాజా! నీవు రాగా నీసముద్రము వణకుచున్నదేమి?
నీవు సేతుమంథన కర్తవని భయపడుచున్నదేమో!
ఇప్పుడు నీకు ద్వీపాంతరమునను లోఁబడనివాఁడు లేఁడే?
నిన్ను లక్ష్మి సేవించుచునే యున్నదే!

ఇచట సేతుమంథన కర్తయని సేతువునకు నమృత మథనమునకుఁ గర్తయగు పురుషోత్తమునితో వర్ణనీయుఁడగు రాజున కభేదముం జెప్పెను. అటయ్యు నీ రాజు సేతుబంధమునకా? యమృతమథనమునకా? యని సముద్రుఁడు భయపడ నక్కరలేదు. ద్వీపాంతరములు కూడ నీకు లోఁబడి యుండుటచేతఁ బూర్వమువలె ద్వీపాంతరమున జయింపవలసినది లేకపోవుటచేతను, లక్ష్మి కైవసమగుటచేతను, బంధన మంథన ప్రసక్తులు లేకపోవుటవలనఁ బూర్వావస్థకంటె నుత్కర్షను వెల్లడించుటచే నధికాభేదరూపకము.

---

5. త్వయ్యాగతే కిమితి వేపత ఏష సింధుః
త్వం సేతుమంథకృదతః కిము సో బిభేతి ।
ద్వీపాంతరేఽపి న హి తేఽ స్త్యవశం వదోఽద్య
త్వాం రాజపుంగవ నిషేవత ఏవ లక్ష్మీః ॥

[6] ప్రేయసీ! నీముఖచంద్రుఁడాలోకమాత్రమునఁ బద్మకాంతినిఁ బరిహరింపఁడా? కనులకానందమును గలిగింపఁడా? మకరకేతను నురిపింపఁడా? అతఁడుండ నీక నీయపరశీతాంశు వుదయించు టమృతదర్పమున నైనచో నదియు నీ బింబాధరమున నున్నదే!

ఇచట నపరశీతాంశువనుటచే ముఖచంద్రునికిఁ బ్రసిద్ధ చంద్రుని కంటె భేదమును బ్రకటించి దానికిఁ బ్రసిద్ధ చంద్రుని కార్యమొనరించుటను మాత్రమే దెల్పుచు నెచ్చుతగ్గులను జూపకుండుటవలన ననుభయ తాద్రూప్యరూపకము.

వ్యాసుఁడు నాలుగు మోములులేని బ్రహ్మ రెండు బాహులు కల యపరవిష్ణువు. ఫాలనేత్రములేని శివుఁడు.

ఇచట నపరవిష్ణువను విశేషణమువలన మూఁటియందును తాద్రూప్యమాత్రవివక్ష ప్రకటింపఁబడినది. చతుర్వదనత్వాది వైకల్యము చెప్పఁబడినది కనుక న్యూనతాద్రూప్యరూపకము. ఇది విశేషోక్తి కుదాహరణమని వామనమతము. ఒక గుణమునకు హాని చెప్పినప్పుడు మిగిలిన గుణమువలన వచ్చు సామ్యము ప్రబలమగుట విశేషోక్తి యని వామనుఁడు చెప్పెను.

---

6. కిం పద్మస్య రుచిం న హంతి నయనానందం విధత్తే న కిం
వృద్ధిం వా ఝషకేతనస్య కురుతే నాలోకమాత్రేణ కిమ్
వక్త్రేందౌ తవ సత్యయం యదపరశ్శీతాంశురుజ్జృంభతే
దర్పస్స్యాదమృతేన చేదిహ తదప్యస్త్యేవ బింబాధరే ॥

ఆలోకమాత్రమున, ఈపదము మొదటిమూడు క్రియలతో నన్వయించు...
ఆలోకమాత్రమున = ప్రకాశము చేత, కనబడుట చేత
పద్మకాంతిని = పద్మశోభను, పద్మములందు కలిగి
మకరకేతనుఁ = సముద్రుని, మన్మథుని

ఓజడుండా! ప్రాణములు పోఁగా దమయంతి మనస్సు
నాయందు లీనమగునని తలంచుచుంటివా? అట్లు తలం
పకు. స్మరవిబుధుఁడు ప్రాణప్రయాణకాలములో మనసు
చంద్రునందు ప్రవేశించునను శ్రుత్యర్థములో విషయము
నలముఖచంద్రుఁడేనని నాకుఁ జెప్పెను. నిజము!

ఇచట దమయంతీకృతచంద్రోపాలంభమునఁ బ్రసిద్ధచంద్రుఁడు నిర్యాణ కాలమున మనస్సు చంద్రునందు ప్రవేశించునను శ్రుతితాత్పర్యములో విషయము కాఁడు, నలముఖచంద్రుఁడే శ్రుతి తాత్పర్య విషయము అని యీ చంద్రునికంటె నితని కాధిక్యము తెలుపుటవలన నధిక తాద్రూప్య రూపకము.

సావయవరూపకము నిరవయవరూపకము మున్నగు భేదములు చిత్రమీమాంసయందుఁ జూడఁదగును.

### 6. పరిణామము.

ఉపమాన ముపమేయ – స్వరూపముతోఁ గార్యకారి
**యగుచోఁ బరిణామమగును –**

ఉ॥ మదిరేక్షణ విరిసిన కనుదమ్మితోఁ జూచుచున్నది.

ఎచట నారోపింపఁబడుఁ నుపమాన మేదేని కార్యమున కుపయోగించునదిగాఁ గూర్పబడినదై స్వయముగ నది ఆ కార్యోపయోగి కాలేక పోవుటచే నుపమేయరూపముగ మాఱఁ గోరునో యచటఁ బరిణామాలంకారము. ఇందుదాహరణము మదిరేక్షణ ఇత్యాది. ఇచట మయూరవ్యంసకాది (మయూరము - వ్యంసకము) సమాసముచేత

7. కిమసుభిర్గ్లపితైర్జడ మన్యసే
మయి నిమజ్జతు భీమసుతామనః।
మమ కిల శ్రుతిమాహ తదర్థికాం
నలముఖేందుపరాం విబుధస్స్మరః॥

నుత్తరపదార్థము ప్రధానమగుటంబట్టి యబ్జమే వీక్షణోపయోగిగఁ గూర్పబడుచున్నదికాని దృక్కు కాదు. దృక్కు అబ్జమువంటిది (దృగబ్జమివ) అను నుపమిత సమాసము నాశ్రయించినచోఁ బూర్వపదార్థము ప్రధాననగునుగదా యన వీలులేదు. ఏలన, సామాన్యధర్మమును జెప్పనప్పుడే వ్యాఘ్రాదులతో నుపమితసమాసము సంభవించునను అనుశాసనముండుటంబట్టి విరివి చెందుటయును సామాన్య ధర్మమును జెప్పనప్పుడే యుపమిత సమాసము వచ్చును గాని, యా సామాన్య ధర్మమును జెప్పినప్పుడుపమితసమాసము రాదు. అబ్జము స్వస్వరూపముతో వీక్షణోపయోగి కాలేకపోవుటవలన నది ప్రకృతమగు దృక్స్వరూపముగ మాఱుటచేఁ బరిణామాలంకారము.

వ్యస్తమున లక్ష్యము.

[8] తనతో మూఁడవవాఁడగు నీరాముఁడు శివశిరోమాలికయగు గంగనుదాటి, యా నావికునకు లక్ష్మణస్నేహమను రేవురేటు నుపకారరూపముగ నిచ్చెను. పిదప ముచ్చటతోఁ గనులు విరియించుకొని చూచుచు, వలుదగుబ్బల బెస్తగుబ్బెత లెట్టకేనిఁ జిత్రకూటమునకు కొంచెముసేపు వెంటరాఁ బయనించెను.

ఇచట నారోపింపఁబడిన పడవరేటు లక్ష్మణ స్నేహరూపమగుటచే గుహోపకారరూప కార్యమున కుపయోగించినది కాని, గుహుఁడు రామానుగ్రహ మాత్రాభిలాషియేకాని ధనాభిలాషి కాకపోవుటచే తనకుఁ దాన ప్రకృతోపయోగి కాలేదు. ఈ పరిణామాలంకారమున నుపమేయాభేదముపమానమందుండును. రూపకమునన్నో ఉపమానాభేద ముపమేయమందుండును.

---

8. తీర్త్వా భూతేశమౌళి స్రజమమరధునీమాత్తసాఽసౌ తృతీయ
స్తస్మై సౌమిత్రిమైత్రీమయముపకృతవానాతరం నావికాయ
వ్యామగ్రాహ్యస్తనీభిశ్శబరయువతిభిః కౌతుకోదంచదక్షం
కృచ్ఛ్రాదన్వీయమానః క్షణమచలమథో చిత్రకూటం ప్రతస్థే ॥

## 7. ఉల్లేఖాలంకారము.

ఒక వస్తువు ననేకు లనేకవిధములఁ జెప్పు టుల్లేఖము.

ఉ॥ అతఁడు స్త్రీలకు మదనుఁడుగను, యాచకులకుఁ గల్ప తరువుగను, శత్రువులకు యముఁడుగను గోచరించెను.

ఎచట ననేకవిధ ధర్మములతోఁ గూడిన యొకేవస్తు వా యా ధర్మ సంబంధ మను నిమిత్తభేదమువలన ననేకులగు గ్రహీతలచే ననేక విధము లుగ జెప్పఁబడునో యచట నుల్లేఖాలంకారము. అనేక విధముల నుల్లేఖించుటలో రుచ్యర్థిత్వ భయాదికము తగురీతిగాఁ బ్రయోజక మగును. రుచి యన నభిరతి, అర్థిత్వమనఁ గోరిక. 'అతఁడు' ఇత్యాది యుదాహరణము. ఇచట సౌందర్య వితరణ పరాక్రమశాలి యగు రా జొకఁడే స్త్రీలచేతను, నర్థులచేతను, ప్రత్యర్థులచేతను అనురా గాభిలాష భయములఁచేఁ గాముఁడుగఁ గల్పతరువుగఁ గాలుఁడుగఁ జూడఁబడెను. మఱి,

> వృద్ధాంగనలచే గజరక్షకుఁడని యువతి సమూహముచే
> లక్ష్మీపతియని బాలికలచే సహజ సుందర వేషుఁడని
> కుతూహలముతో శౌరి చూడఁబడెను.

ఇచట నెతఁ డట్లు భీతము భక్తియుక్తము నగు గజమును తొందరగా రక్షించెనో యతఁడే యా పురుషోత్తముఁడని సంసారభీతిచే నభయార్థిను లగు వృద్ధాంగనలచే నీ కృష్ణుఁడు మధురలోఁ బ్రవేశించుచుఁ జూడఁ బడెను. ఎతఁ డట్లు చంచల యని ప్రసిద్ధయగు లక్ష్మికిఁ గామోపచార మందలి నేర్పుచే నిత్యవల్లభుఁడో యాతఁడే యీ దివ్యయువకుఁడని యువతిసంఘముచేత నుత్కంఠతోఁ జూడఁబడెను. బాహ్యరూప వేషాలంకార దర్శనలాలస లగు బాలికలచే నప్పటి వేషాలంకారములచే సుందరుఁడుగఁ జూడబడెనని యనేక విధముల జెప్పుట. పూర్వోదాహ

తోల్లేఖము కామకత్వాద్యారోప రూపక సంకీర్ణము. ఇది శుద్ధము. ఈ రెంటి కిదియే భేదము.

(¹) ఒక వస్తువు నొకఁడే విషయభేదముచే ననేక విధముల

జెప్పినను నుల్లేఖమే యగును.

ఉ॥ ఇతఁడు వాగ్విషయమున గురువు. కీర్తివిషయమున

నర్జునుఁడు. వింట భీష్ముఁడు నగుచున్నాఁడు.

గ్రహించువారిలో భేదములేకున్నను విషయము వేఱగుటచే ననేక విధముల నుల్లేఖించుటయు నుల్లేఖమగును. వాగ్విషయమునఁ జాల సమర్థుఁడు ఇత్యాదివలె బృహస్పతి యను నర్థాంతరమునుఁ గూడఁ జేర్చుటవలన నీ యుదాహరణము శ్లేష సంకీర్ణము. శుద్ధోదాహరణము.

కుచములం దున్నతి నడుమున నన్నము కనులందు

పొడవు నితంబమున విశాలము నధరమున నెఱుపు

చిత్తమున దయాశాలియు నగు శివుని యర్ధాంగి నా

చిత్తమున నిలుచుగాక.

## 8, 9, 10 స్మృతి భ్రాంతి సందేహాలంకారములు

స్మృతి భ్రాంతి సందేహములచే, స్మృతి, భ్రాంతి, సందేహము, అను నలంకారములు మూఁడును నగును.

1. ఉ॥ పద్మమును జూచినపుడు నాకుఁ గాంతాముఖము తలం

పునకు వచ్చును. 2. ఈ మధుపము నీ మోమును

9-(1). దీక్షితులవారు కువలయానందమున నుల్లేఖమును రెంటి విధములు గనే వివరించి తన చిత్రమీమాంసయందు రెండవ భేదమును వివరించుచు 'గృహీతృభేదాభావేఽపి విషయాశ్రయభేదతః' అని విషయభేదముతోఁగూడ నాశ్రయభేదమును జేర్చెను. జగన్నాథుడు తన రసగంగాధరమున నీ రెంటివేకాక సమానాధికరణ, సంబంధు లను మఱి రెంటినిఁ గూడఁ జేర్చి యుదాహరించెను. మొత్తముమీఁద నీ యుల్లేఖమున మొదటిభేద మందఱకొక్కటిగ నున్నను రెండవభేదము విషయ, ఆశ్రయ, సమానాధికరణ, సంబంధి, ప్రభేదములచే నాలుగు విధముల విస్తరిల్లెను.

జూచి పద్మ మనుకొనుచున్నది. 3. కాని నాకుఁ
బద్మమా ? చంద్రుఁడా ? యని నిర్ణయము తేలలేదు.

సాదృశ్యముచేఁ గూర్పఁబడిన స్మృతి భ్రాంతి సందేహములచే స్మృతి మంతము భ్రాంతిమంతము సందేహము నని స్మృత్యాది పదఘటితమై యలంకార త్రయ మగును. అదియుఁ గ్రమముగ నుదాహరింపబడినది. లక్ష్యాంతరము,

9-(1) దివ్యులకుఁగూడ నచ్చెరువు గొల్పుదాని వికసితారవిం ద
మును జేతఁ దాల్చి నీటినుండి వెలువడి వచ్చు నొక
సుందరి నిందిరనుంబోలె నెదుటఁ దిలకించి శౌరి
సముద్రమథనమును గూడ స్మరించెను.

మొదటి స్మృతిమదలంకారోదాహరణమున సదృశమునకే స్మృతి. ఇందు సదృశ లక్ష్మీస్మరణపూర్వకముగఁ దత్సంబంధియగు సముద్రమథనముయొక్కయు స్మరణము; అని మొదటికంటె భేదము. (మాఘమున జలక్రీడావర్ణనమునందలి దీ పద్యము).

తుమ్మెద మోదుగ పూవను భ్రాంతిచేఁ జిలుకముక్కున
వాలుచున్నది. చిలుకయు నేరేడుపండను భ్రమతో
నా తుమ్మెదను బట్టఁ జూచుచున్నది.

ఇచట బూర్వోదాహరణముకంటె నన్యోన్య విషయ భ్రాంతినిఁ గూర్చుట విశేషము.

దుర్జనులు జీవనగ్రహణమున నమ్రులగుదురు. దానిని
గ్రహించి యున్నతులగుదురు. ఏ రేతమున కన్నలా ?
తమ్ములా ?

9 - (1) దివ్యాఙ్గనామపి కృతవిస్మయాం పురస్తా
దంభస్తః స్ఫురదరవిందచారు హస్తామ్।
ఉద్వీక్ష్య శ్రియమివ కాంచిదుత్తరంతీ
మస్మార్షీజ్జలనిధి మంథనస్య శౌరిః

పూర్వోదాహృత సందేహము ప్రసిద్ధ కోటికము. ఇది కల్పిత కోటికము. (సంశయములో విషయమునకు కోటియనిపేరు.)

## 11. అపహ్నవాలంకారము.

అవర్ణ్యపు ధర్మము నారోపించుటకై వర్ణ్యపు ధర్మమును గప్పిపుచ్చు టపహ్నవము.

ఉ॥ ఈ వస్తువు శుధాంశువు కాదు మఱేమంటే ? వియన్నదీపుండరీకము.

వర్ణనీయమగు వస్తువునందు తత్సదృశవస్తువుయొక్క ధర్మము నారోపింపఁగోరి యా వర్ణనీయ వస్తువుయొక్క ధర్మమును దాచిపెట్టుటకాని, కవి మతివికాసముచే నుత్ప్రేక్షితమగు ధర్మాంతరమును గప్పిపుచ్చుట కాని శుద్ధాపహ్నుతి యగును. ఎట్లన ! చంద్రునియందు వియన్నదీపుండరీకత్వము నారోపించుటకై చంద్రధర్మమగు చంద్రత్వమును గప్పిపుచ్చుట. మఱియు,

చంద్రునియందలి నలుపును గొందఱు కలంకముగాను, మఱికొందఱు సముద్రపంకముగాను నితరులు సారంగముగాను వేఱుమంది భూచ్ఛాయముగాను దలంచిరి. మేము, రాత్రి చంద్రుఁడు తిన్న కటిక చీకటిఁగాఁ జెప్పుచున్నాము.

ఇచట నుత్ప్రేక్షా సిద్ధ ధర్మములను నితర మతములుగాఁ జెప్పుటచే నపహ్నవ మర్థసిద్ధము.

### హేత్వపహ్నుతి

శుద్ధాపహ్నుతియే యుక్తితోఁ గూడినచో హేత్వపహ్నుతియగును.

ఉ॥ ఈతఁడు భయంకరుఁడగుటచేఁ జంద్రుఁడుకాఁడు. రాత్రియం దుండుటచే సూర్యుఁడు కాఁడు. సముద్రమునఁ బుట్టిన బడబాగ్ని యగును.

ఇచటఁ జంద్రునందె భయంకరత్వ నైశత్వ (రాత్రియందుండుట) యుక్తులచేఁ జంద్రత్వ సూర్యత్వములఁ గప్పిపుచ్చుట బడబానలత్వ మారోపించుటకే. మఱియు,

> కవ్వాపుఁ గొండరాళ్ళయొక్క దెబ్బమచ్చ చంద్రునం దున్నది. అది ఛాయ, మృగము, శశము, అనుట పామరోక్తి, వాని కచట నేవిధముగను బ్రసక్తియే లేదు.

ఇచటఁ జంద్రునిలోఁ మంథన సమయమునఁ దగిలిన మందరపర్వతపు రాళ్ళ దెబ్బయొక్క మచ్చ కేకాని ఛాయాదులకుఁ బ్రసక్తియే లేకపోవుట వలన ఛాయాత్వాద్యపహ్నవము పామరవచనమని చెప్పుటచేఁ బ్రక టింపఁబడినది.

## పర్యస్తాపహ్నుతి.

> ఆ ధర్మమును దాచుట, ఇంకొకచోట నా ధర్మము నారోపించుటకే యైనచోనది [10] పర్యస్తాపహ్నవ మగును.
>
> ఉ॥ ఇతఁడు సుధాంశువు కాఁడు. మఱేమంటె ప్రేయసీ ముఖమే సుధాంశువు.

---

10. పర్యస్తాపహ్నుతి యను శుద్ధాపహ్నుతికి విపరీతమగుట. ఆ పర్యస్తత్వ మేమన శుద్ధాపహ్నుతి యం దారోపనిషేధములకు సామానాధికరణ్యము (ఒకటనె రెండు నుండుట). పర్యస్తాపహ్నుతి యం దారోప నిషేధములకు అసామానాధి కరణ్యము (రెండొకట నుండవు). శుద్ధాపహ్నుతిలో సుధాంశువునందె సుధాంశుత్వ నిషేధము, పుండరీకత్వారోపము నుండును పర్యస్తాపహ్నుతి [illegible] దన్ననో! సుధాంశువునందు సుధాంశుత్వ నిషేధము ప్రేయసీ ముఖమున సుధాంశుత్వారోపము నగుటచే నొకట రెండు లేవు. ప్రాచీన లక్షణ విరుద్ధమయ్యు నీ భేద మలంకార రత్నాకరాద్యులు సారముగఁ జెప్పఁబడినది.

ఏ కావ్యమున నొక వస్తువునందు దాని ధర్మము లేదని చెప్పుట మఱొక వస్తువునం దా ధర్మము నారోపించుటకగునో యచటం బర్యస్తాపహ్నవాలంకారము. ఎట్లనఁ జంద్రునందు చంద్రత్వము లేదనుట దానినిఁ గాంతాముఖమునం దారోపించుటకే. మఱియు,

> కాలకూటము విషముకాదు. లక్ష్మి విషము. జను లీ విషయమును విపరీతముగఁ దలఁచుచున్నారు. శివుఁడు కాలకూటమును ద్రాగి సుఖముగ మెలకువతో నున్నాఁడు. కేశవుఁడు లక్ష్మినంటి నిద్రచే మోహము నొందుచున్నాడు.

పూర్వోదాహరణమున హేతూక్తి లేదు. ఇచట నది యుండుట విశేషము. అందువలనఁ బూర్వాపహ్నవము వలెనే యిందును శుద్ధ పర్యస్తాపహ్నుతి హేతు పర్యస్తాపహ్నుతి యని రెండు విధము లుండుట నెఱుంగవలెను.

## భ్రాంతాపహ్నుతి.

> ఇతరుని ప్రశ్నమునందలి భ్రాంతిని బోఁగొట్టుట భ్రాంతాపహ్నుతి.
>
> ఉ॥ నాకు వణుకుతోఁగూడఁ దాపము కలుగుచున్నది. జ్వరమువలననా ? సఖి ! కాదు, మదనునివలన.

ఇచట తాపము కలుగుచున్నదని స్మరవృత్తాంతము చెప్పుచుండ నది జ్వరమువలననా ? యని ప్రశ్నింపఁ గాదు మదనునివలన నని నిజము చెప్పి భ్రాంతి నివారణ చేసెను. మఱియు,

> నాగరికుఁడా ! సమధికోన్నతమగు నీ మహిమమున కిరువైపులఁ దోక యున్న దేమి ? కాదు మహిమముకాదు. అది కరికలభము. ఇది దీని తొండముకాని తోక కాదు.

ఇది సంభవద్భ్రాంతిపూర్వక యగు భ్రాంతాపహ్నుతియం దుదాహరణము.

కల్పిత భ్రాంతిపూర్వయగు భ్రాంతాపహ్నుతియం దుదాహరణ మెట్లం టే.

11 కుసుమశర ! హరుఁడను భ్రాంతితో నన్నేల బాధింతువు ?
ఇది వేణిగాఁ జేయఁబడిన కేశపాశముకాని జట కాదు.
ఇది కంఠమునఁదలి కస్తూరికాని కాలకూటము గాదు.
ఇది కుసుమముగాని శిరమునందున్న చంద్రరేఖ కాదు.
ఇది ప్రియ వియోగమునఁ గలిగిన పాండిమకాని శరీరము
నందలి భస్మము కాదు.

పూర్వమువలెఁ బ్రశ్న లేక పోవుటంబట్టి యిచట కల్పిత భ్రాంతి జట కాదు ' ఇత్యాది నిషేధమాత్రముచే నూహింపఁదగినది. దండి దీనిని తత్త్వాఖ్యానోపమ యని యుపమాభేదమునుగాఁ దలఁచెను.

ఇది పద్మముకాదు ముఖమే. ఇవి తుమ్మెదలుకావు కన్నులే. అని స్పష్టమగు సాదృశ్య ముండుటవలనఁ దత్త్వాఖ్యానోపమ యిష్టము అని చెప్పెను.

## ఛేకాపహ్నుతి

ఇతరుని ప్రశ్నకు నిజము దాచి సమాధాన మిచ్చినచో,
ఛేకాపహ్నుతి యగును.

ఉ॥ గోలపెట్టుచు నా పాదమునఁ బడెను. కాంతుఁడా ?
కాదు నూపురము.

11. జటా నేయం వేణీకృతకచకలాపో న గరళమ్
గళే కస్తూరీయం శిరసి శశిరేఖా న కుసుమమ్
ఇయం భూతి ర్నాంగే ప్రియావిరహజన్మా ధవళిమా
పురారాతి భ్రాంత్యా కుసుమశర కిం మాం ప్రహరసి ॥

దండి తలఁచినమాటలోని యస్వారస్య మేమన, ఉపమాబోధకమగు పదము లున్న నుపమ లేకున్నను మనము నంగీకరించినచో యీ భేదముకూడ నుపమ కావలసివచ్చుననుట స్పష్టము.

ఒకనిఁగూర్చి చెప్పు మఱొకని రహస్యోక్తి నితరులు విని ప్రశ్నింపఁగాఁ దనమాటకు వేఱుభావము చెప్పి నిజమును దాచినచో ఛేకాపహ్నుతి యగును. ఎట్లన, నాయిక నర్మసఖితో ' గోలపెట్టుచు నా పాదమునఁ బడెనని ' తన నాయకుని వృత్తాంతము చెప్పుచుండ దాని విని కాంతుఁడా ? యని శంకించిన యితర కాంతతో కాదు, నూపురము, అని చెప్పి కప్పిపుచ్చుట. మఱియు,

> సీత్కారమును బోధించును. అధరమును గాయ
> పఱచును. గగుర్పాటుఁ గలిగించును. నాగరికుఁడు
> కూడనా ? కాదు కాదు, చెలి ! చలిగాలి.

ఇది యర్థయోజనచే సత్యగోపనమున కుదాహరణము. యోజనచే సత్యగోపన మెట్లన,

> " ఎల్లప్పుడు పద్మ లోచనములు తలపున నాడుచున్నవి.
> నా భావము నీల కుంతలములందు నిలిచియున్నది. నేను
> అనంత విలాసముల కమ్ముడుపోయి నీకుఁ గింకరుఁడ
> నైతి. అను స్వప్నవాక్యముల విని రాధ రోషముతోఁ
> గృష్ణుని బెదిరింపగా నా మాటలను రాధాపరముగఁ
> జెప్పు క్రీడావిటుఁడు మిమ్ము రక్షించుగాత.

---

12. పద్మే త్వన్నయనే స్మరామి సతతం భావో భవత్కుంతలే
నీలే ముహ్యతి కిం కరోమి మహితైః క్రీతోఽస్మి తే విభ్రమైః
ఇత్యుత్స్వప్నవచో నిశమ్య సరుషా నిర్భర్త్సితో రాధయా
కృష్ణస్తత్పరమేవ తద్వ్యపదిశన్ క్రీడావిటః పాతు వః ॥

పద్మలోచనములు = పద్మ ! నీ కన్నులు, పద్మములవంటి కన్నులు. నీల కుంతలములందు = నీలా ! నీ కుంతలములందు, నల్లని కుంతలములందు. అనంతవిలాసములకు = ఓ అనంత ! నీ విలాసములకు, అపరిమితమగు నీ విలాసములకు నని శ్రీ నీలా భూ పరముగను, రాధాపరముగను నన్వయము.

ఇదంతెయు వివక్షింపబడని విషయమును గూర్చుటలో నుదాహరణము. విషయ మొక్కటియైనను నవస్థాభేదముచే యోజనముండుదాహరణము.

> వంచక రొకతె భర్తనుజూచి చెలి యనుకొని యుపపతి వృత్తాంతము చెప్పుచు భర్తగా నెఱింగి సఖి! పిమ్మట మెలకువ వచ్చెనని పూర్తి చేసెను.

## కైతవాపహ్నుతి.

> వ్యాజాది పదములచే ధర్మమునుదాచుట స్పష్టమైనచోఁ కైతవాపహ్నుతి యగును.
>
> ఉ॥ కాంతాకటాక్షము లను కైతవమున మదనబాణ ములు బయలుదేరుచున్నవి.

ఇచట నసత్యత్వమును జెప్పు కైతవపదముచే నివి వెడవింటివాని తూపులుకాని కలికిచూపులు కావను జ్ఞాపకము తోఁచుచున్నది. మఱియు,

> [13] నీటివార్తయైన లేని వనమధ్యములందు తరువులు మధ్యాహ్నపు మండుటెండ కెంది చెట్టుతొఱ్ఱలనుండి పుట్టిన కారుచిచ్చుమంట లను సాకుతో నాలుక చాచు కొని నీటినిఁ గోరుచున్నవి.

---

13. రిక్తేషు వారికథయాపి వనోదరేషు
మధ్యాహ్నజృంభిత మహాతపతాప తప్తాః ।
స్కంధాంతరోత్థిత దవాగ్ని శిఖాచ్ఛలేన
జిహ్వాం ప్రసార్య తరవో జల మర్థయంతే ॥

## 12. ఉత్ప్రేక్షాలంకారము.

ఊహ యుత్ప్రేక్ష. అది వస్తుహేతు ఫలరూపమునఁ ద్రివిధము. అందు మొదటిది ఉక్తవిషయ, యనుక్తవిషయ యని రెండు విధములు. తక్కిన రెండును సిద్ధవిషయ యసిద్ధవిషయ యని రెండేసి విధములు.

చీకటిని జక్రవాకముల విరహానలపు పొగ పోగుగఁ దలంతును. చీకటి అంగముల నలదుచున్నది కాఁబో లును! ఆకసము కాటుకను గురియుచున్నదేమో! యనున ట్లుండెను. 3. ప్రేయసి! నీ మృదుపదములు నేల మోపుటవలన సుమా యెఱ్ఱవాఱినవి.

4. చంద్రుఁడు త్వన్ముఖకాంతి నొందు నభిలాషచే పద్మములతో విరోధించుచున్నాఁడు, నిజము. 5. కుచ ధారణమునకై నీనడుము సువర్ణదామములతో బిగింపఁ బడినదా! యేమి? 6. పద్మము త్వత్పదసాయుజ్యము నొందుటకుఁ గాఁబోలు జలవాస తపమొనరించుచున్నది.

ఉపమానపు ధర్మసంబంధ రూపమగు నిమిత్తముచే నుపమేయమందు ఉపమానాభేదము నూహించుట ఉత్ప్రేక్షయగును. అది వస్తుహేతు ఫల రూపముల గోచరించుటచేఁ ద్రివిధము. వీనిలో నొక వస్తువునకు మఱొక వస్తువుతో నభేదము నూహించుట యను మొదటి వస్తూ త్ప్రేక్షయే స్వరూపోత్ప్రేక్ష యనఁబడును. కారణము కానిదానినిఁ గారణముగ నుత్ప్రేక్షించుట హేతూత్ప్రేక్ష, ఫలము కానిదానిని ఫలముగ నుత్ప్రేక్షించుట ఫలోత్ప్రేక్షయు నగును. వీనిలో మొదటిదగు స్వరూపోత్ప్రేక్ష ఉక్తవిషయ అనుక్తవిషయ యని ద్వివిధము. తక్కిన హేతుఫలోత్ప్రేక్షలు సిద్ధవిషయ అసిద్ధవిషయ యని ప్రత్యేకము రెండేసి విధములు. ఇట్లా యుత్ప్రేక్షలకు 'తమము' ఇత్యాదులు క్రమముగ నుదాహరణములు. సంధ్యాసమయమున నంతటను వ్యాపించు చీకటికి

నలుపు కనబడనీకుండుట, మున్నగు ధర్మములసంబంధ మను ప్రతీయమాన నిమిత్తముచే నప్పు డన్ని దేశములం దున్నవి, ప్రియవియుక్తలు నగు శోకాంగనల హృదయములందుఁ బ్రజ్వలించు విరహాగ్ని నుండి పుట్టిన ధూమస్తోమముతో నభేదము నూహించుట స్వరూపోత్ప్రేక్ష. తమోరూపవిషయమును జెప్పుటచే నుక్తవిషయ.

తమోవ్యాప్తికి, నాకాశము మొదలు భూమివరకు నుండు సకల వస్తువులను మలినము చేయుట యను నిమిత్తముచే తమ మొనరించు లేపనముతో నభేదము నుత్ప్రేక్షించుట, నభ మొనరించు కాటుక వానతో నభేదము నూహించుటయు నను రెండుత్ప్రేక్షలందును విషయ మగు తమోవ్యాప్తిని జెప్పకపోవుటచే నీ రెండును ననుక్తవిషయ స్వరూపోత్ప్రేక్షలు.

[14] ఓయి! ఇచట వ్యాపనమను నిమిత్తముచే తమమునకు లేపన కర్తతో నభేదము నుత్ప్రేక్షించుట, భూమిపర్యంతము గాఢ నీలిమ

---

14. తమమునకు వ్యాపననిమిత్తముచే లేపనకర్త్రభేదము నుత్ప్రేక్షించుట, నభమునకు గాఢ నీలిమవ్యాపన మను నిమిత్తముచే నంజనవర్షణకర్త్రభేదము నుత్ప్రేక్షించుట అను రెండుత్ప్రేక్షలు నుక్తవిషయములే యగునని పూర్వపక్షము చేసి సమాధానము చెప్పెను. ఆ పూర్వపక్షమున నిమిత్తము లెట్లు కుదురును? ఆ నిమిత్తముల కుపమాన ధర్మములసంబంధ ముండవలదా? ఉపమాన ధర్మమున కేకదా! నిమిత్తత చెప్పఁబడెను. అట్లుండె నేమో పరిశీలింతము.

వ్యాపనమన:- అనేక దేశసంయోగము కదా! అది తమమునందుండిన నుపమానమగు లేపనకర్తయం దుండదు, లేపనకర్త యొక్కచోటనే యుండును గావున. ఇట్లే గాఢనీలిమ వ్యాపనముగూడ నభమునందున్నను ఉపమానమగు నంజనవర్షణకర్తయం దుండదు. గోడకు వెల్లవేయు పురుషుడు తన దేహమునకు వెల్లవేసికొనునా? చల్లుచు నీరు పోయువాడు తన దేహమును దడుపుకొనునా? అందువలన ఉపమాన ధర్మసంబంధరూపనిమిత్తము ఉపమాన మగు లేపనకర్తయందు వర్షణకర్తయందును లేకపోవుటచే (లక్షణమే లేకపోవుటచే) పూర్వపక్షమే సంగతముకాదని తోచుచున్నది.

వ్యాపనమను నిమిత్తముచే నాశనమున కంజనవర్షణకర్తతో నభేదమ్ము నుత్ప్రేక్షించుటయు నను రెండుత్ప్రేక్షలును పూయుచున్నది కురియుచున్నది యను నాఖ్యాతములు కర్తృవాచకములై నను ఆఖ్యాతము క్రియాప్రధానము (భావప్రధాన మాఖ్యాతమ్) అను వైయాకరణ స్మరణము వలన ధాత్వర్థ క్రియయే ముఖ్య విశేష్యమగుటచే నా క్రియకు విశేషణముగా నన్వితమగు కర్తను మఱియొక విశేష్యమునకు విశేషణము (ఉత్ప్రేక్షా విషయము) గా నన్వయించుట సంభవింపకుండుటం బట్టి, ఉక్త విషయములే యగు ననవీలులేదు. అందుచేతనే (ఆఖ్యాతార్థమగు కర్త క్రియకు విశేషణమగుటచే మఱొక్కచోట దాని కన్వయము లేకపోవుటవలననే) దీని కుపమయం దుపమానముగ నన్వయముకూడ దండిచే నిరాకరింపఁబడెను. కర్త యుపమానమైనచో నది క్రియకు విశేషణమగుచు స్వక్రియలో సాధనముగ నన్వితమై యన్య విశేష్యము నపేక్షింప సమర్థముకాదు. (కర్తా య ద్యుపమానంస్యాత్ న్యగ్భూతోఽసౌ క్రియాపదే, స్వక్రియా సాధనవ్యగ్రో నాలమన్య ద్వ్యపేక్షితుమ్) అని. [15] కొంతమంది విషయములగు తమోనభములందు అతమోనభములు కర్తలుగాఁగల లేపనవర్షణము లనుధర్మముల నుత్ప్రేక్షించుట అందురు. వారి మతమున వస్తూత్ప్రేక్ష ధర్మ్యుత్ప్రేక్ష ధర్మోత్ప్రేక్ష యని రెండు విధములుగ నెఱుఁగవలెను.

చరణములందలి సహజమగు నెఱుపురంగునకు నిజముగ కాలు నేల మోపుట కారణము కాకపోయినను దానిని గారణముగ నూహించుట హేతూత్ప్రేక్ష. విషయమగు విక్షేపణముండుటచే సిద్ధవిషయ,

15 కొంతమంది మతమునుటచే నప్యారస్య మేమనగా తమోనభములను, కర్తలుగను విషయములుగను రెండుమాఱు లన్వయించుట కష్టము. అట్లే ధర్మ్యుత్ప్రేక్ష, సాగర్మక ప్రయోక్తము ధర్మోత్ప్రేక్ష ధర్మసంబంధ ప్రయోక్తము నగుటచే లక్షణమున కనుగతి లేకపోవును.

స్వాభావిక మగు చంద్ర పద్మ విరోధమునకు నాయికాముఖకాంతి నొందఁ గోరిక కారణముగాకున్నను దాని కది హేతువుగ నూహించుట హేతూత్ప్రేక్ష. నిజముగఁ జంద్రునకట్టి కోరిక లేకపోవుటచే నసిద్ధ విషయ.

మధ్యము స్వయముగనే కుచములను ధరించునుగాని కనకదామ బంధముగ నారోపింపఁబడిన వళిత్రయబలమునఁగాదు. మధ్య మును రించిన కుచధారణము నువర్ణదామ బంధనఫలముగ నుత్ప్రేక్షించుటచే నిది సిద్ధ విషయఫలోత్ప్రేక్ష. జలవాసతపముగ తలపఁబడిన పద్మపు జలవాసమునకుఁ గామినీచరణ సాయుజ్యప్రాప్తి ఫలముకాదు. గగన కుసుమసదృశమగు కామినీచరణ సాయుజ్యప్రాప్తి తపః ఫలముగ నుత్ప్రేక్షించుటచే నసిద్ధవిషయఫలోత్ప్రేక్ష. ఈ క్రమముననే యుదాహరణాంతరము లీఁబడును.

[16] వికసింపక పోవుటచే విదియ చందురునిఁ బోలె వంకరలగు
నతిలోహితములు నగు మోదుగుమొగ్గలు వసంతునితోఁ
గూడిన వనదేవతల క్రొత్తనఖక్షతములువోలె శోభిల్లెను

ఇచట మోదుగు మొగ్గలకు వంకర యెఱుపు సంబంధమగు నిమిత్తముచేఁ గ్రొత్త నఖక్షతములతో భేదము నుత్ప్రేక్షించుటవలన నుక్త విషయస్వరూపోత్ప్రేక్ష. చీకటిని...పొగపోగుగఁ దలఁతు నను పూర్వోదాహరణమున నిమిత్తమగు ధర్మసంబంధమూహ్యము, ఇచట వాచ్యము. ఇదియే భేదము

ఉరుయు! పోలె (ఇవ) శబ్దము సాదృశ్యపరముగ నెక్కువ ప్రసిద్ధ మగుటచేత; చీకటి తుంగముల నలఁదుచున్నదను నుదాహరణమున

16. బాలేందు వక్రాణ్యవికాస భావాత్
బభుః పలాశాన్యతి లోహితా
సద్యో వసంతేన సమాగతానామ్
నఖక్షతానీవ వనస్థలీనామ్ ॥

సాదృశ్యార్హ మగు లేపన కర్త క్రియకు విశేషణమైనట్లి చట నఖక్షతము లుపమాబాధకముగ నితరములకు విశేషణములు కాక పోవుటంబట్టి; యిది యుపమే యగునుగదా! యన్నచోఁ జెప్పెదనువినుము.

ఉపమ యెచ్చటనైనను బ్రసిద్ధముగనున్న నఖక్షతములతోఁ గూడ జెప్ప శక్యమగుటచేత, వసంతనాయకునితోఁ గూడిన వనదేవతా సంబంధ విశేషణము నపేక్షింపని దగుటవలన, నిచ్చట నా విశేషణో పాదానము మోదుగమొగ్గలకు నఖక్షతములతో నభేదము నుత్ప్రేక్షించుటయందు వలె శబ్దమును నిలుపుచున్నది. అట్లుత్ప్రేక్షించి నపుడే యా విశేషణము సార్థకమగునుగదా! సంభావనలోఁ గూడ వలె శబ్ద మున్నది. 'దూరమున నుండ దేవదత్తునివలె నున్నాఁడు' అని.

సముద్రుఁడు తరంగాగ్రములతో ఫేనమనుచందనమును
నూరుచున్నాఁడేమో! చంద్రుండు కరములతో దానిందీసి
దిక్కాంతలకుఁ బూయుచున్నాఁడు కాఁబోలు.

ఇక్కడ తరంగాగ్రములతో ఫేనచందన ప్రేరణము నూరుటగా నుత్ప్రేక్షింపఁబడుచున్నది. సముద్రమునుండి పుట్టిన చంద్రుని కిరణములు మొదట సముద్రమున వ్యాపించి పిదప దిక్కులందు వ్యాపించును. ఆ దిగ్వ్యాపనము సముద్రతటమందున్న ఫేన చందనపు పూతగ నుత్ప్రేక్షింపఁబడుచున్నది. రెండుత్ప్రేక్షలందుఁ గ్రమముగ సముద్రపు టొడ్డున ఫేనచందనము పోగుపడుట, దిక్కులను దెలుపు చేయుటయు నిమిత్తములు తనక విషయములగు ఫేనచందన ప్రేరణ, కిరణవ్యాపనములను జెప్పకపోవుటచే ననుక్త విషయస్వరూపోత్ప్రేక్షలు. ఉపాత్తములగు సముద్రచంద్రులందే తత్కర్తృకములగు నూరుట పూయుటలనుధర్మముల నుత్ప్రేక్షించుట, అను నలంకార సర్వస్వ కారాదుల మతమునఁ బూర్వోదాహరణమున ధర్మియందు ధర్మ్యంతరాభేదమును

నుత్ప్రేక్షించుట, ఇచట ధర్మియందు ధర్మసంబంధము నుత్ప్రేక్షించుట యని భేదమును గ్రహింపవలెను.

> రాత్రి సూర్యుఁడు పగలు చంద్రుఁడు లేఁడని కాఁబోలు
> నారాజు భూమియం దెల్లప్పుడు నుండు నట్లు ప్రతాప
> కీర్తులను నిర్మించెను.

రాత్రి సూర్యునిలేమి పవలు చంద్రునిలేమి యుండినను ప్రతాప కీర్తుల సృష్టి కది కారణము కాదు. అట్లయ్యు ప్రతాపకీర్తుల సృష్టికి వారిలేమి కారణముగ నూహించుట, సిద్ధవిషయహేతూత్ప్రేక్ష.

> [17] సూర్యుఁడు తనగో (కిరణ) సహస్రముతోఁ గలసిన
> నేత్రము లనుపేరి జనుల గోవు (కన్ను) లం గూడఁగొని
> పోయెనుగాఁబోలు, అందుచేతనే యీ గ్రుడ్డితనమేమో
> సుమా ! చీకట్లచేతఁగాదు.

ఇచట సూర్యకృతముగు స్వీయకిరణములతోడి జనలోచనములఁ గొనిపోక లేనిదేయయ్యు రాత్రియందలి గ్రుడ్డితనమున కది కారణముగ నుత్ప్రేక్షింపఁబడుటచే నసిద్ధవిషయ హేతూత్ప్రేక్ష.

> చంద్రు డబ్ధిజలము నెక్కువ చేయుటకుఁ జంద్రకాంతము

---

17. వివస్వతా నాయిషతేవమిత్రాః
స్వగోసహస్రేణ సమం జనానామ్
గావో౽పి నేత్రాపరనామధేయా
స్తేనేద మాంధ్యం ఖలు నాంధకారైః ॥

గోసహస్రము = కిరణసహస్రము, వేయి ఆవులు.
జనులగోవులు = ప్రజల యావులు, ప్రజల కన్నులు.

ఇచట రెండు ఉత్ప్రేక్షలున్నను మొదటి వస్తూత్ప్రేక్ష యంగముగుటవలన రెండవ దగు హేతూత్ప్రేక్ష ప్రధానమని యెఱుంగవలెను. విషయముగ నుత్ప్రేక్షించిన దానినే హేతువుగ నుత్ప్రేక్షించుట మొదటి దానికంటె భేదము.

నుండి యెంత నీరు స్రవింపఁ జేయుచున్నాడనుకోను !
ప్రియవియోగముచే దుఃఖించు శోకాంగనల కన్నుల
నుండియెంతజలమును స్రవింపఁజేయు చున్నాఁడని
తలంపను !

ఇటఁ జంద్రకృతమగు సముద్ర ముప్పొంగుట సిద్ధమైనదే, యప్పుడు చంద్రకృతమగు, చంద్రకాంతములు కరుగుటకు, శోకాంగనాబాష్పములు స్రవించుటకు ఫలముగ నుత్ప్రేక్షింపఁబడుటచే నిది సిద్ధ విషయ ఫలోత్ప్రేక్ష.

రవి, రథమునకుఁ గట్టిన పాతగుఱ్ఱములను మార్చుటకుఁ
గాఁబోలు నుత్తమాశ్వముల కుత్పత్తిస్థాన మగు నుత్తర
దిక్కునకు బయలుదేరెను.

ఇచట లేనిదే యగు గుఱ్ఱములమార్పు నుత్తరాయణమునకు ఫలముగ నుత్ప్రేక్షించుటచే నిది యసిద్ధ విషయ ఫలోత్ప్రేక్ష.

తలంతును, ఊహింతును. ధ్రువము, నిజము ఇత్యాది శబ్దములచే నుత్ప్రేక్ష సూచింపఁబడును. తానె శబ్దము నట్టిదే. అని ఉత్ప్రేక్షా చిహ్నములుగఁ బరిగణింపఁబడు శబ్దముల ప్రయోగముండినచో నీ యుత్ప్రేక్షలే వాచ్యము లగును. వాచక శబ్దములు లేనిచో గమ్యోత్ప్రేక్షలగును. ఎట్లన ? నీకీర్తి తిరిగి తిరిగి యలసి యాకాశగంగలోఁ బ్రవేశించెను.

## 13. అతిశయోక్తి.

అధ్యవసానమువలన నుపమేయమును గప్పి చెప్పుట
రూపకాతిశయోక్తి యగును.

ఉ॥ చూడుము ! నల్లకలువలజంటనుండి వాఁడి తూపులు
వెడలు చున్నవి.

ఉపమేయము నుపమానవాచకశబ్దముతోనే గ్రహించుట విషయనిగ రణము. విషయమును గప్పిపుచ్చుచు నుపమేయము నుపమానరూప ముగ నధ్యవసానము చేయుట ఆహార్యనిశ్చయము. ఆ యాహార్య నిశ్చయము (ఉపమేయ ముపమానము కాదని తెలిసియున్నట్లు చెప్పుట) న్నచో రూపకాతిశయోక్తి. ఎట్లన, నల్లకలువ, వాడితూపు శబ్దములచే కనుగవను, జూపులను గ్రహించుచు నల్లకలువ వాడితూపులు గ భావించుట. మఱియు,

[18] గగనమున నొకానొక వాపి కలదు. దానిమీద బంగారు మెట్లతో నింద్రనీలమణులం గూర్చిన సన్నని మార్గ మున్నది. తదుపరి పుణ్యాత్ములు పొందఁదగిన రెండు కొండలు చందనఛన్నములై యున్నవి. సుధాంశు సాన్నిధ్యమువలన నచటివారి కమృతము సులభము.

ఇచట గగనాది శబ్దములచే నడుము మున్నగునవి కప్పఁబడినవి. ఇట నతిశయోక్తి రూపకవిశేషము రూపకమునఁ జూపఁబడిన భేదము లన్నియు నిచ్చటను సంభవించునని సాదృశ్యముతో జూపుటకే.

అందుచే నిక్కడఁగూడ నభేదాతిశయోక్తి తాద్రూప్యాతిశయోక్తి యని రెండువిధములును, అందును నాధిక్య న్యూనత్వాది విభాగము కూడ నర్వము నమకూర్చుకొనఁదగును

18. వాపీ కాపి స్ఫురతి గగనే తత్పరం సూక్ష్మపద్యా
సోపానాళీమధిగతవతీ కాంచనీ మైంద్రనీలీ
అగ్రే శైలౌ సుకృతిసుగమౌ చందనచ్ఛన్నదేశౌ
తత్రత్యానాం సులభ మమృతం సన్నిధానాత్సుధాంశోః ॥

మిత్రమా! ప్రాకారమువైపు చూచి కొంచె మాలో
చింపుము. ఆకాశము లేని చోట నవ రీనిష్కళంక
చంద్రుఁడు? అమృతాహారమును గోరు నారామ
చకోరములచే ననుసరింపఁబడి, పండువెన్నెల తీగలతో
సదృశ మగు వెన్నెలను వెదఁజల్లుచున్నాఁడు. [17]

ఇచట నవ రీ నిష్కళంకచంద్రుఁ డనుటచేఁ బ్రసిద్ధచంద్రునికంటె భేదము నతనికంటె నుత్కర్షయు సూచింపఁబడెను. ఇట్లితరస్థలము లందును నూహింపఁదగును.

## 2. సాపహ్నవాతిశయోక్తి

ఆ రూపకాతిశయోక్తియే అపహ్నవముతోఁ గూడినచో
సాపహ్నవాతిశయోక్తి యగును.

ఉ॥ ఓ రాజ! నీ పలుకులం దమృతముండగా భ్రాంతులు
దానిని జంద్రునందుఁ గనుచున్నారు.

ఇచట నీ మాటల మాధుర్యమే యమృత మను నతిశయోక్తి చంద్రు నందున్న దమృతము కాదను నపహ్నవముతోఁ గూడినది. మఱియు,

---

17. విద్ధసాలభంజికలో మృగాంకావళిం జూచు రాజు విదూషకునితోఁ జెప్పిన వాక్యమిది.

సుధాబద్ధగ్రాసై రుపవనచకోరై రనుసృతాం
కిరన్ జ్యోత్స్నా మచ్ఛాం లవలిఫలపాకప్రణయినీమ్ ।
ఉపప్రాకారాగ్రం ప్రహిణు నయనే తర్కయ మనా
గనాకాశే కోఽయం గళితహరిణ శ్శీతకిరణః ॥

౨౦ ముక్తావిద్రుమముల మధ్య మధురసమున్నది. పుష్పము కేవలము బరువుచేటు. ఆ ముక్తావిద్రుమముల కాధారమమృతాంశుమండలము కాని సముద్రము కాదు. అదియు శంఖముమీఁద నుదయించునుగాని తూరుపుకొండమీఁదఁగాదు. ఆ సుందరినిఁ జూడనివా రీవస్తువులను విపరీతముగఁ గల్పింతురు కాని చూచినవా రట్లు చేయరు.

ఇచట నధర రసమె మధుర రస మను నతిశయోక్తి పుష్పరసము మధురసము కాదను నపహ్నవముతోఁ గూడినది.

అలంకార సర్వస్వకారుఁడు స్వరూపోత్ప్రేక్షయందును సాపహ్నవత్వము నుదాహరించెను.

౨౧ పౌరవిలాసినులు చేపలరాపిడికి భయపడి శిప్రానదినుండి యొడ్డుకు పరుగెత్తగా నా నది నురుగుపోఁ గను సాకుతో నవ్వినా ! యను నట్లుల్లసిల్లెను.

నురుగుపోగును గప్పిపుచ్చినచోటనే నవ్వు నుత్ప్రేక్షించుటచే శుద్ధాపహ్నుతితోఁ గూడియుండుట యిచట నుత్ప్రేక్షలో విశేషము.

---

20. ముక్తావిద్రుమ మంతరా మధురసః పుష్పం పరం ధూర్వహం
ప్రాలేయద్యుతిమండలే ఖలు తయో రాసికా నార్ణవే ।
త చ్చోదంచతి శంఖమూర్ధ్ని న పునః పూర్వాచలాభ్యంతరే
తా నీమాని వికల్పయంతి త ఇమే యేషాం న సా దృక్పథే

ముక్తావిద్రుమాది శబ్దములచే దంతాదులు నిగీర్ణములై యధ్యవసానము చేయఁబడినవి కావున నతిశయోక్తి. పుష్పము బరువుచేటే, సముద్ర మాధారము కాదు, తూర్పుకొండ నుదయించ దను నిషేధములవలన నపహ్నవమని లక్షణసంగతి.

21. గత్వాను తీరం తిమిఘట్టనేన ససంభ్రమం పౌరవిలాసినీషు
యత్రోల్లసత్ఫేనతతిచ్ఛలేన ముక్తాట్టహాసేవ విభాతి శిప్రా ॥

ఈ యతిశయోక్తి యన్ననో! ఇందుమండలాదులందు గప్పఁబడు నమృతము మొదలగువానిని రాజపలుకులం దుండునట్లు చెప్పుటచేఁ బర్యస్తాపహ్నుతితోఁ గూడియుండుట సిద్ధము. ఈ పర్యస్తాపహ్నుతితో గూడియుండు టుత్ప్రేక్షయందును సంభవించును.

అందుస్వరూపోత్ప్రేక్ష కుదాహరణము.

> [22] రాగాతిశయముచే నీ యధరమునే బింబ మనుకొంటిని. ఇందుచే బింబమున కధరత్వము స్పష్టము. ఈ రెంటి భేదము నెఱుంగని జనులకుఁ బేరులందు భ్రమ కలిగెను.

ఇచటఁ బ్రసిద్ధమగు దొండపండునందు బింబత్వమును దాచి రాగాతిశయ మను నిమిత్తముచే దమయంత్యోష్ఠమున బింబత్వము నుత్ప్రేక్షించుట పర్యస్తాపహ్నుతితో గూడిన స్వరూపోత్ప్రేక్ష. హేతూత్ప్రేక్షయందుఁ బర్యస్తాపహ్నుతి యుండుట పూర్వోక్త హేతూత్ప్రేక్షోదాహరణమునని కనఁబడుచున్నది. అచట నంధకారములం దాంధ్యకారణత్వమును దాచి గోనయనమునం దుత్ప్రేక్షింపఁబడినది.

ఫలోత్ప్రేక్షయం దుదాహరణము.

> వడఁదాకిన గజము రవిసంబంధులగు పద్మములను బాధించుటకుఁ గాబోలు బద్మాకరమునఁ బ్రవేశించుచున్నది, గాని స్నానమునకుఁ గాదు. గజస్నానము వ్యర్థముకదా!

ఇచట గజము సరస్సులో దిగుటకు స్నానము ఫలమైయుండ దానిని దాచి పద్మబాధనము ఫలముగా నుత్ప్రేక్షింపఁబడినది. ఇఁక నీ ప్రసక్తానుప్రసక్తిచేఁ జాలును.

---

22. జానేऽతిరాగాదిద మేవ బింబం బింబస్య చ వ్యక్త మితోऽధరత్వం
ద్వయో ర్విశేషావగమాక్షమాణాం నామ్ని భ్రమోऽభూ దనయోర్జనానామ్ ॥

## 3. భేదకాతిశయోక్తి

వర్ణనీయవస్తువునకే భేదమున్నట్లు వర్ణించుట భేదకాతిశయోక్తి యగును. ఈ రాజు గాంభీర్యమే వేఱు, ధైర్యమే వేఱు.

ఇచట లోకమునఁ బ్రసిద్ధమగు గాంభీర్యాదికముకంటె భేదము లేకున్నను భేద మున్నట్లు వర్ణింపఁబడినది. మఱియు,

ఈ రూపసంపద వేఱు ఈ చాతుర్యపు ధోరణి వేఱు, ఈ తామరసాక్షి బ్రహ్మదేవుని సామాన్య సృష్టి కాదు.

## 4. సంబంధాతిశయోక్తి

సంబంధము లేనిచోట సంబంధ మున్నట్లు వర్ణించుట సంబంధాతిశయోక్తి.

ఉ॥ ఈ పట్టణపు మేడలు చంద్రమండలము నంటుచున్నవి. మఱియు,

వీరరుద్రదేవుఁ డిట్లు వితరణశాలి కాఁగాఁ బ్రొద్దును గ్రుంకఁజేయు బంగారు కొండ కొద్దిదినముల కంతము నొందునని చక్రవాకాంగన మోదమొందుచున్నది.

ఇచటఁ జక్రవాకికి సూర్యాస్తమయమును జేయు మేరుపర్వతము క్షీణించు నను సంతోషపు సంబంధము లేకున్నను దానిసంబంధ మున్నట్లు వర్ణింపఁబడినది.

## 5. అసంబంధాతిశయోక్తి

సంబంధమున్నను లేదనివర్ణించుట అసంబంధాతిశయోక్తి యగును.

ఉ॥ రాజ! నీవు దాతగానుండఁ గల్పవృక్షముల గారవింపము.

ఇచటఁ గల్పవృక్షములందు గారవసంబంధమున్నను లేనట్లు వర్ణించుటవలన నసంబంధాతిశయోక్తి. మఱియు,

శోభనాంగీ! వర్ధమానములగు నీ పాలిండ్లకు బాహు లతామధ్యమునఁ జోటు చాలదు.

## 6. అక్రమాతిశయోక్తి

హేతు కార్యము లేక కాలమున నైనట్లు వర్ణింప నక్రమాతిశయోక్తి యగును.

ఉ॥ దేవ! నీ బాణములు నారిని, శత్రువులు భూమిని నొక్కమా రాలింగనము చేసికొనుచున్నారు.

ఇచట నారియందు బాణమును సంధించినప్పుడే శత్రువులు భూమి యందు పడుచున్నారని హేతుకార్యముల నేకకాలికత్వము వర్ణింపఁ బడినది. మఱియు,

[28] హమ్మీరవీరుని ఖడ్గము కోశమును వీడగా శత్రువర్గము కోశమును వీడుచున్నది. అది కంపము నొందగా నిదియుఁ గంపించుచున్నది. ఖడ్గము క్షమను వీడగా నరివర్గముకూడ క్షమను వీడుచున్నది.

ఇచట ఖడ్గ మొఱ వీడుట మొదలగునవి జరిగినప్పుడే వైరులు బొక్కము వీడుట మొదలగునవి యైనట్లు వర్ణింపఁబడినది

## 7. చపలాతిశయోక్తి

కారణజ్ఞానమువలననే కార్య మైనట్లు చెప్పుట చపలాతిశయోక్తి.

ఉ॥ ప్రియుఁడూరి కేగుదునని చెప్పినంతనే తన్వి కంకణము కంకణ మయ్యెను.

---

28. ముంచతి ముంచతి కోశం భజతి భజతి ప్రకంప మరివర్గః!
హమ్మీర వీరఖడ్గే త్యజతి త్యజతి క్షమా మాశు॥
కోశమును = కత్తిరొఱను, బొక్కసమును. కంపమునొందు = కదలు.
కంపించు = వణకు క్షమను = శాంతిని, భూమిని.

ఇట నాయకుని ప్రయాణ ప్రసక్తిచేతనే యువతికిఁ గృశత్వము కార్య రూపముగఁ గనఁబడెను. మఱియు,

24 పూవు పట్టఁ జూచినంత మాత్రమున నాలోలాక్షి కరాగ్రి మెఱ్ఱవారెను. లత్తుకపూతపేరు చెప్పిననే చరణములు రక్తములయ్యెను. మైపూత తలంపుకూడ దుఃఖమును గలిగించుచుండెను. అయ్యో! పాప మేమిచెప్పను! ఆమెకు అలకామోదముకూడ భారముగాఁ గన్పట్టు చున్నది. (సౌకుమార్యాతిశయ వర్ణన మిది) మఱియు, వెళ్ళుచున్నాను, లేదు. అని భర్త చెప్పుచుండగనే తన్వంగికి తొలి కంకణములు జారెను. మలికంకణములు బిగిసి విరిగిపోయెను.

## 8. అత్యంతాతిశయోక్తి

హేతుకార్యముల పౌర్వాపర్యమును విపరీతముగ వర్ణించిన నత్యంతాతిశయోక్తి యగును.

ముందు కోపము పోయెను. పిమ్మటఁ బ్రియునిచేఁ నామె బ్రతిమాలుకొనఁబడెను. మఱియు,

25 కవీంద్రుల ముంగిళ్ళు మెట్టమొదటనే భృంగములతోఁ గూడిన గంధగజముల మదామోదముచే మధురములై

---

24. ఆదాతుం సకృదీక్షితేపి కుసుమే హస్తాగ్రమాలోహితం
లాక్షారంజనవార్తయాపి సహసా రక్తం తలం పాదయోః
అంగానామనులేపనస్మరణమప్యత్యంతఖేదావహం
హంతాధీరదృశః కిమన్యదలకామోదోపి భారాయతే ॥

25. కవీంద్రాణాం ద్రాక్ ప్రథమతరమేవాంగణభువః
చలద్భృంగాసంగాకులగజమదామోదమధురాః
అభూవన్ పశ్చాత్తే సుమహితభవద్రుద్రనృపతేః
కటాక్షాః క్షీరోద్భవసరదురుచీచీసహచరాః ॥

హేతుభిన్నమగు చమత్కృతిజనక కార్యకారణవిపర్యయము విషయము. అతిశయోక్తి ప్రాధాన్యము.

యుండెను. విస్మృటనే క్షీరసాగరవీచీసదృశములగు నీ రుద్రరాజు కటాక్షము లా కవులమీఁదఁ బ్రసరించెను. ఈమా దతిశయోక్తులు కార్యశీఘ్రతను దెలుపును.

## 14. తుల్యయోగితాలంకారము

కేవలము ప్రస్తుతములకుగాని కేవల మప్రస్తుతములకుగాని యేక ధర్మాన్వయము తుల్యయోగిత యగును.

ఉ॥ సరోజములు స్వైరిణీవదనములును సంకోచించుచున్నవి. నీ శరీరసౌకుమార్యమును జూచినచో మాలతీ కదళీ శశిరేఖల కాఠిన్య మెవని చిత్తమునకు తోఁచకుండును ?

కేవలము ప్రస్తుతములకుఁగాని కేవల మప్రస్తుతములకుగాని గుణక్రియారూపమగు ఏకధర్మాన్వయము తుల్యయోగిత. సరోజము లనునది ప్రస్తుత తుల్యయోగిత కుదాహరణము. ఇచటఁ బ్రస్తుత చంద్రోదయ కార్యముగ వర్ణనీయములగు సరోజములకు, కెల్లడియగునని భయపడు స్వైరిణీవదనములకును సంకోచరూపైకక్రియతో నన్వయము చూపఁబడినది. రెండవ వాక్యమున నాయికాసౌకుమార్యవర్ణనము ప్రకృత మగుచుండగా నప్రకృతములగు మాలత్యాదులకుఁ గఠోరత్వరూపమగు నొక్క గుణముతోనే అన్వయము చూపఁబడినది. మఱియు,

38 సజ్జాతపత్రములు స్ఫుటపాటలములు భానుకరములచే భాసురములు, నగు దినములు పద్మములును వృద్ధి నొందెను.

---

38. సజ్జాత పత్రప్రకరాన్వితాని సముద్వహంతి స్ఫుటపాటలత్వమ్
వికస్వరా ణ్యర్కకరాభిమర్శా ద్దినాని పద్మాని చ వృద్ధిమీయుః ॥
సజ్జాతపత్రములు = విప్పబడిన గొడుగులు కలవి. ( దినములు )
సజ్జాతపత్రములు = చక్కగ పుట్టిన రేకులు కలవి. ( పద్మములు )
స్ఫుటపాటలములు = వికసించిన పాటల వృక్షములు కలవి ( దినములు )
స్ఫుటపాటలములు = స్పష్టమగు పాటల వర్ణము కలవి. ( పద్మములు )
ఈ శ్లోకము కావ్యదర్పణపాఠానుసారముగ వ్రాయఁబడినది.

[27] కరి కరములు కదళీవిశేషములు గొప్ప రూపము నొందియు, చర్మమునందలి కాఠిన్యముచే నేనుఁగు తొండములు, నెల్లప్పుడు చల్లగ నుండుటచేఁ గదళీవిశేషలును బార్వతితొడల కుపమానములు కాక పోయెను.

ఇచట గ్రీష్మవర్ణనమున గ్రీష్మకాలికములగుటచేఁ బ్రస్తుతములగు దినములకుఁ బద్మములకు నేకక్రియతో నన్వయము. ఊరువర్ణనమున నప్రస్తుతములగు కరికరములకుఁ గదళీవిశేషములకు నేకగుణాన్వయము.

మిత్రామిత్రులందు సమప్రవృత్తి కలుగుట మఱొక తుల్యయోగితయగును.

ఉ॥ దేవ! నీవు హితాహితులకుఁ [27] బరాభూతి నిత్తువు.

ఇచట హితాహితులగు మిత్రశాత్రవులకు నుత్కృష్టభూతి దానమునకు పరాభవ దానమునకును పరాభూతిపదశ్లేషచే నభేదాధ్యవసాయము వలన వృత్తియందు తుల్యత్వమున్నది. మఱియు,

వేము తన్ను నఱకువానికిఁ బెంచువానికిఁ బూజించు వానికిఁ జేదుగనే యుండును.

మొదటి యుదాహరణము స్తుతిని దెలుపును. ఇది నిందను దెలుపును. ఇదియే భేదము. ఈ తుల్యయోగిత సరస్వతీ కంఠాభరణమునఁ జెప్పఁబడినది.

గుణశ్రేష్ఠులతో సామ్యము వివక్షచేసి చెప్పుట మఱొక తుల్యయోగిత.

ఉ॥ ఇంద్ర యమ వరుణ కుబేరులు నీవును లోకపాలురు.

---

27 నాగేంద్రహస్తాస్త్వచి కర్కశత్వా దేకాంతశైత్యాత్కదళీవిశేషాః
లబ్ధ్వాపి లోకే పరిణాహిరూపం జాతా స్తదూర్వోరుపమాన బాహ్యాః॥

27_వి. పర + ఆ + భూతి = పరాభూతి = గొప్ప యైశ్వర్యము, అవమానము.

ఇచట వర్ణనీయుఁడగు రాజు ఇంద్రాదులతో లోకపాలత్వముచే సమానము చేయఁబడెను. మరియు,

యువతుల పొందులు, మెఱుపులకాంతులును [28] ఘనా
రబ్ధములయ్యు రెండు క్షణములై న నుండవు.

పూర్వమున నుతి ; యిట నింద. ఇది కావ్యాదర్శమునఁ జూపఁబడెను. కొందఱీ తుల్యయోగితను సిద్ధి యని వ్యవహరించిరి. జయదేవుఁ డిట్లు చెప్పెను.

సామ్యము చెప్పుటకుఁ బ్రసిద్ధులలోఁ బేరు కీర్తింపఁబడిన
సిద్ధి యగును.

ఉ॥ బలముచే నీవు, జలముచే జలధియు మీరిద్దఱే ప్రసిద్ధులు.

ఇతరమతములం దిది చెప్పఁబోవు దీపకమే యగును.

## 15. దీపకాలంకారము

ప్రస్తుతాప్రస్తుతముల కేక ధర్మాన్వయము దీపకమగును.

ఉ॥ మదముతోఁ గలభము ప్రతాపముతో మహీపతియు
భాసిల్లును.

ప్రకృతాప్రకృతముల కొకే ధర్మముతో నన్వయము కల్గుట దీపకమనఁబడును. ఎట్లన నృప కలభములకు ప్రస్తుతాప్రస్తుతములకు భాసక్రియతో నన్వయము. మఱియు,

[29] సానబెట్టిన మణియు, కత్తిదెబ్బతినియు విజయమునొందిన

---

28. ఘనారబ్ధములు = మిక్కుటముగ నారంభింపఁబడినవి. ( పొందులు )
ఘనారబ్ధములు = మబ్బుతో ప్రారంభింపఁబడినవి. ( మెఱుపులు )

29. మణిశ్శాణోల్లీఢ స్సమరవిజయీ హేతిదళితో
మదక్షీణో నాగశ్శరది సరితః శ్యానపులినాః ।
కలాశేష శ్చంద్ర స్సురతమృదితా బాలవనితా
తనిమ్నా శోభంతే గళితవిభవా శ్చార్థిషు నృపాః ॥

> రాజు, మదక్షీణమగు నేనుఁగు, శరదృతువున విశద
> పులినలగు నదులు, కలామాత్రావశిష్టుఁడగు చంద్రుఁడు,
> సురతముచే నలిగిన గోలయు, దానముచే దరిద్రులగు
> ధరణీపతులును గార్శ్యముచే శోభిల్లుచున్నారు.

ఇచటఁ బ్రకృతులగు ధరణీపతులకు నప్రకృతములగు మత్త్యాదులకును, శోభైక ధర్మాన్వయము. ప్రస్తుతమునందు మాత్రమే యున్న సమాన ధర్మము ప్రాసాదమునకై పెట్టిన దీపము వీధి కుపకరించినట్లే, - ప్రసంగ మువశమున మఱొకచోట నుపయోగించుచున్నది. ఇట్లు దీపసామ్యము వలన దీపకమని చెప్పఁబడుచున్నది. 'సంజ్ఞాయాంచ' అను సూత్ర ముచే నివార్థమునందు 'కన్' ప్రత్యయము వచ్చెను.

> ఆలోచింపగా, శూరుఁడు విద్యాంసుఁడు సేవింపనేర్చిన
> వాఁడు, ఈ ముగ్గురు పురుషులు పృథివిని సువర్ణపుష్ప
> నుగాఁ జేయుచున్నారు.

అనుచోటఁ బ్రకృతాప్రకృతము లందొకమాటే ధర్మాన్వయము. కలభము మదముతో భాసిల్లుచున్నదనుచోట నప్రస్తుతమునకే మొదట ధర్మముతో నన్వయము కనఁబడుచున్నదికదా! ప్రాసంగికత్వ మెట్లు కుదురును? అట్లుండినను ప్రకృతమునకు ధర్మముతో ప్రథమమున నన్వ యము ప్రాసంగికత్వ ప్రయోజకము కాదుకనుక, వస్తుతః ప్రకృతోద్దేశ ముతో చేసిన వర్ణనమె యప్రకృతము నందుగూడ నన్వయించుటంబట్టియు ప్రాసంగికత్వము లేకపోలేదు. దీపము వీథిప్రాసాదములందొక్కమా ఉపకరించుటచేతను నల్లునకు వండిన సూప మతిథులకు ముందు పెట్టుట చేతను బ్రాసంగికత్వము పోదుకదా!

తుల్యయోగితలో నొకటి ప్రకృతము మఱొకటి యప్రకృతము నను భేదము గ్రహింపకపోవుటవలన నన్నిటి నుద్దేశించియే ధర్మము చెప్పుట అనునది భేదము. ఈ దీపక తుల్యయోగితల కింకొక భేదము కూడ

కలదు. ఈ రెంటియం దుపమాలంకారము గమ్యమగుటలో భేదము లేకున్నను దీపకమున నప్రస్తుత ముపమానము ప్రస్తుత ముపమేయము నని యుపమానోపమేయభావము నియతము. తుల్యయోగితలో నట్టి నియమము లేకపోవుటచే నుపమానోపమేయ భావ మైచ్ఛికము.

## 16. ఆవృత్తిదీపకము

దీపకమున కావృత్తి కల్గినచో నావృత్తి దీపకమగును. అది మూఁడు విధములు.

30 అంబుదపంక్తి యుబ్దమగుచున్నది ఈ రాత్రియు నబ్ద మగుచున్నది.

2. కదంబములు వికసించుచున్నవి, గిరిమల్లికలు విచ్చు చున్నవి.

3. తృప్తినొందిన చాతకములు మదించుచున్నవి. నెమళ్లును మదించుచున్నవి.

దీప మనేకోపకారములకు సమర్థమగుటచే దీపస్థానీయమగు పదము యొక్క యర్థముయొక్క రెంటియొక్కయు, నావృత్తిచే నావృత్తి దీపకము మూఁడు విధములు. క్రమముగ వాక్యత్రయముచే నుదాహరణము లీఁబడినవి. మఱియు,

మేఘమాల మయూరవర్గము నుత్కంఠముగాఁ జేయు చున్నది. మదనుఁడు యువకుల మనము నుత్కంఠ మునుగాఁ జేయుచున్నాఁడు.

2. పయోదపంక్తి చిరకాలోపనతమగు చాతకముల పిపా సను బాపుచున్నది. కామినుల కన్నీటిధార కాముకుల ప్రవాసాభిలాషను బోఁగొట్టుచున్నది.

3. సుందరి ! నీ ముఖముచే నిర్జితమగు చంద్రబింబ మంబు దమున నణఁగుచున్నది. పద్మముకూడ పయః పూరమున నణఁగుచున్నది.

---

30. అంబుదపంక్తి యబ్దమగుచున్నది. అబ్దము = నీటినిచ్చునది.
ఈ రాత్రియు నబ్దమగుచున్నది. అబ్దము = సంవత్సరము.

[31] ఇట్లావృత్తులు ప్రకృతాప్రకృతోభయ విషయములు కాకున్నను దీపక సాదృశ్యప్రాప్తి మాత్రముచే దీపక మని పేరుకలిగెను.

## 17. ప్రతివస్తూపమ.

పెక్కువాక్యములకు సమానధర్మ మొక్కటియైనఁ బ్రతివస్తూపమ యగును.

ఉ॥ సూర్యుఁడెండచే రాజిల్లును. వీరుఁడు వింటిచే విలసిల్లును.

ప్రతివస్తు=ప్రతివాక్యార్థమందు ఉపమా=సమానధర్మము ఇందున్న దనువ్యుత్పత్తినిఁబట్టి, యెచ్చట నుపమానోపమేయ భావముకల వాక్యముల కొక సమాన ధర్మము వేర్వేఱుపదములతోఁ జెప్పఁబడునో యచట ప్రతివస్తూపమయుండును. ఎట్లన రాజిల్లు విలసిల్లు అని ఒక ధర్మమె యుపమానోపమేయ వాక్య ములందు వేఱుపదములచేఁ జెప్పఁబడినది. మఱియు,

[32] గుణవంతుల సద్వృత్తము ఖలవృత్తిచే బాధింపఁబడదు.
రత్నదీపపు శిఖ సుడిగాలిచేతను నార్పఁబడదుకదా?
మఱియు, అమృతము నొసగు నీ పాదపంకజము నాశ్ర
యించిన వాఁడితరము నెట్లు కోరును? మకరందముతో
నిండిన యరవిందము ఉండగా మధువ్రతము కాకి
చెఱుకును గాంచదు కదా!

---

ప్రస్తుతమునకు నప్రస్తుతములకు నేకధర్మాన్వయముకలిగిన దీపక మగును. ప్రస్తుతములకుమాత్ర మేకధర్మాన్వయముకలిగిన నావృత్తిదీపక మగునుగదా! దీపక పదముచే నావృత్తిదీపక మెట్లు చెప్పఁబడు ననుశంక రాగా ప్రస్తుతాప్రస్తుతత్వవివక్ష వీడి రెంటియందు నేకధర్మాన్వయాంశమును మాత్రము గ్రహించి దీపక శబ్దవ్యవహార మని యీమూలవాక్యమునకు భావము

32. స్థిరా శైలీ గుణవతాం ఖలబుద్ధ్యా న బాధ్యతే।
రత్నదీపస్య హి శిఖా వాత్యయాపి న నాశ్యతే॥

1. తవామృతస్యందిని పాదపంకజే నివేశితాత్మా కథ మన్య దిచ్ఛతి।
స్థితేఽరవిందే మకరందనిర్భరే మధువ్రతో నేక్షురకం హి వీక్షతే।

ఇచటఁ జూడఁగా నుపమేయ వాక్యమున ననిచ్ఛ ఉపమానవాక్యమునం దవీతు అని ధర్మభేద మగపడుచున్నను, తప్పనిచూపంతయు మానుటకు వీలులేదు కనుక కోరికతో జూడమి యిది యనిచ్ఛారూపమేయగుటచే ధర్మమొకటేయని యనుకొనవలెను. [33] అర్థావృత్తిదీపకము కేవలము ప్రకృతములకుగాని కేవల మప్రకృతములకుఁ గాని ధర్మైక్యమును జెప్పును. ప్రతివస్తూపమ యన్ననో ప్రకృతా ప్రకృతో భయములకు నని భేదమెఱుంగవలెను.

మఱియొక భేదముకూడ కలదు. ఆ వృత్తిదీపకము వైధర్మ్య ద్వారముగ సంభవింపదు. ప్రతివస్తూపమయన్ననో వైధర్మ్యద్వారముఁ గూడఁ గనఁబడుచున్నది. ఎట్లన,

> విద్వాంసుఁడే విద్వాంసుని పరిశ్రమము నెఱుంగును.
> గొడ్రాలు గొప్పప్రసవవేదన నెఱుంగదుకదా! మఱియు,
> పురుషునందుత్తమగుణము లుండెనేని యవి స్వయముగనే
> ప్రకాశించును. కస్తూరికామోదము నానచే నడ్డగింపఁ
> గాదు గదా.

33. 'అర్థావృత్తిదీపకము కేవలము ప్రస్తుతములకుగాని కేవల మప్రస్తుతములకు గాని ధర్మైక్యమును జెప్పును. ప్రతివస్తూపమ యన్ననో ప్రస్తుతా ప్రస్తుతోభయములకు నని యీ రెంటికి భేదము' అన్నచోట ప్రతివస్తూపమ యుభయవిషయమనుట సరియేకాని యావృత్తిదీపకములకు ప్రస్తుత మాత్రగోచరత్వమే కాని యప్రస్తుత మాత్ర విషయత్వము లేదు. ఎట్లన:—కువలయానందోక్తోదాహరణములం దంతట వర్షర్తు వర్ణనమే కావున తత్సంబంధులు, ప్రస్తుతములే అగు కదంబాదులకు వికాసాదిధర్మాన్వయమే కాని యప్రస్తుత ధర్మాన్వయ మెక్కడను లేదు. దండి కావ్యాదర్శమున నావృత్తిత్రయోదాహరణములందు, విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణ్యుదాహరణములందును, ప్రస్తుతములకే ధర్మైక్యము చెప్పెను గాని యప్రస్తుతములకుఁ జెప్పలేదు కావున నర్థావృత్తిదీపకమున కేవల మప్రకృతములకన్నమాట పొడుటు చింతనీయముగఁ దోచుచున్నది. కావ్యప్రకాశ. కావ్యప్రదీప, ప్రతాపరుద్రీయ, సాహిత్యదర్పణాదులం దీయావృత్తిదీపకము పేరే లేదు.

## 18. దృష్టాంతము.

వాక్యార్థములం దున్న ధర్మములకు బింబ ప్రతిబింబభావ ముండినచో నప్పుడు దృష్టాంతమగును.

ఉ॥ నీవే కీర్తిమంతుఁడవు. చంద్రుఁడే కాంతిమంతుఁడు.

ఏ కావ్యమున నుపమానోపమేయ వాక్యములం దున్న భిన్నధర్మములే బింబ ప్రతిబింబభావముచేఁ జెప్పఁబడునో యచట దృష్టాంతాలంకారము. 'నీవే కీర్తిమంతుఁడవు' ఇత్యాదియందు కీర్తికాంతులకు బింబప్రతి బింబ భావము. మఱియు,

వేలకొలఁదిరాజు లుందురుగాక. ఈతని చేతనే భూమిని రాజన్వతినిగాఁ జెప్పుదురు. రాత్రి నక్షత్ర తారాగ్రహ ములతో నిండిన దయ్యుఁ జంద్రునిచేతనే జ్యోతిష్మతి యగుచున్నది.

[34] వాగ్దేవి నెందఱో సేవించుచునే యున్నారు. సారస్వత సారమునుమాత్రము గురుకులమున క్లేశపడిన మురారి కవి విశేషముగఁ దెలిసికొను చున్నాడు. వనచరసేనచే నబ్ధి దాటఁబడినను దీనిగాంభీర్యమునుమాత్ర మా పాతాళము మునిగిన మందరమే యెఱుంగును.

ఓయి! ఇందుపమానోపమేయ వాక్యములందు జ్ఞాన మొకటే ధర్మముగఁ జెప్పఁబడినది గనుక ప్రతివస్తూపమ యగు ననరాదు. అచేతన

---

34. దేవీం వాచ ముపాసతే హి బహవస్సారం తు సారస్వతం
జానీతే నితరా మసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః।
అబ్ధిర్లంఘిత ఏవ వానరభటైః కింత్వస్య గంభీరతాం
ఆపాతాళనిమగ్నపీవరతనుర్జానాతి మంథాచలః॥

ఈయుదాహరణమున తెలిసికొనుచున్నాడు, ఎఱుంగును, ఇత్యాది క్రియలం దానుపూర్వి (వర్ణక్రమము) యొకటి కాకపోవుటచేఁ బదావృత్తి దీపకము దఱి వ్యాప్తి యేరేకపోవుటవలన తద్వారణ క్రమము విచారింపఁదగి యున్నది

మగు మందరమందు జ్ఞానము బాధితమగుటచే నచట నెఱుంగు నను శబ్దముచే సముద్రపుటడుగు నంటుటమాత్రము వివక్షింపఁబడుటచే ధర్మైక్యము లేదు. ఇచట నుదాహరణమునఁ బదావృత్తిదీపకము కంటె భేదము పూర్వము (అర్థావృత్తి ప్రతివస్తూపమలకు) వలెనె ప్రస్తుతాప్రస్తుత విషయకము (దృష్టాంత ముభయవిషయకము పదావృత్తి దీపక మేకవిషయకము)గ నెఱుంగవలెను. ఈ దృష్టాంతము వైధర్మ్య ద్వారమునఁగూడఁ గనఁబడుచున్నది.

ఉ॥ దేవ! నీచే మనస్సు శౌర్యాభిముఖముగఁ జేయఁబడినది,
ఇఁక నేమి కావలెను? మనశ్శత్రువులు చంపఁబడిరి. సూర్య
బింబ ముదయాద్రికి శిరోభూషణము కానంతవఱకే
చీకటు లుండవనుగదా!

## 19. నిదర్శనాలంకారము.

సదృశవాక్యార్థముల కైక్యారోపము నిదర్శన.

ఉ॥ దాత సౌమ్యతే పూర్ణచంద్రు నకళంకత.

ఇచట నుపమేయ వాక్యార్థ మగు దాతృపురుష సౌమ్యత్వమునకు, నుపమాన వాక్యార్థ మగు పూర్ణచంద్రు నకళంకత్వమునకు, నైక్యమా నారోపించుట నిదర్శన యగును. మఱియు,

[35] ఏది ఖలుని సేవించుటో యది, యరణ్యరోదనము, శవ
శరీరమునకు నలుగుపెట్టుట, మెట్టయం దబ్జము నాటుట,
చవుటినేల నెక్కువ వర్షించుట, కుక్కతోకను జాఁగ

35. అరణ్యరుదితం కృతం శవశరీర ముద్వర్తితం
స్థలేఽబ్జ మవరోపితం సుచిర మూషరే వర్షితమ్।
శ్వపుచ్ఛ మవనామితం బధిరకర్ణజాపః కృతో
ధృతోఽంధముఖదర్పణో యదబుధో జనః సేవితః॥

దీయుట చెవిటివాని చెవిలో సంకూదుట, గ్రుడ్డివాని
కద్దముఁ జూపుటయు నగును.

ఇచట ఖలసేవకు నరణ్యరోదనాదులకు యత్తచ్ఛబ్దములచే నభేదా రోపము.

పదార్థవృత్తికూడ మఱొక నిదర్శనయని కొంద ఱందురు.

ఉ॥ నీ కనుగవ నల్లకలువల కాంతిని దాల్చుచున్నది.

ఇచటఁ గనుగవయందు నల్లకలువల కాంతిరూప పదార్థము నారో పించుట నిదర్శన. మఱియు,

వియోగకాలమునందలి గాఢాంగనల కపోలపాండిమ,
ఖర్జూరపు గుత్తుల గర్భరేణువులందుఁ గనఁబడుచున్నది.

మొదటి యుదాహరణమునం దుపమేయమున నుపమాన ధర్మారో పము. ఇచటనో! ఉపమానమున నుపమేయ ధర్మారోపము. రెండు ఉదాహరణములందు నొకదాని ధర్మ మింకొకదానియం దుండదు, కావున తత్సదృశ ధర్మమును నాఁచికొనుటచే సాదృశ్యమునందుఁ బర్యవ పన్న మగుట సమానము. ఈ పదార్థవృత్తి నిదర్శన లలితోపమ యని జయదేవుఁడు చెప్పెను.

యద్యపి 'వియోగకాలమున గాఢాంగనల' ఇత్యాది, ప్రాచీనులచే వాక్యార్థవృత్తి నిదర్శనయం దుదాహరింపఁబడెను. అట్లయ్యు బింబ ప్రతిబింబ భావాపన్న వస్తు విశిష్ట వస్తువుల కైక్యారోపము [38] వాక్యార్థ వృత్తి నిదర్శన, ఉపమానోపమేయములలో నొకదానియం దింకొకదాని ధర్మము నారోపించుట పదార్థవృత్తి నిదర్శనయు నను నియమము నాశ్రయించి మాచే నిం దుదాహరింపఁబడెను. ఇట్లు వ్యవస్థ చేయుటచే,

అర్థులమగు మాకు దాతవు నీ వుండగా దరిద్రముతో
క్షుద్రు ననుసరించు మేము, కామధేనువుండఁగా పాలకై

38. ఎ. ఈలక్షణములో వస్తుపదముచే బిలునుబట్టి ధర్మిని ధర్మమును గ్రహించి లక్షణమును సమన్వయించుకొనవలెను.

వెనుక కాలితాపులచేఁ బొందరాని యొంటిపిల్ల ననుస
రించు చున్నాము. [36]
భుజములతో నబ్ధి దాటఁ గోరువారు నీగుణసముద్రమును
స్తుతించిరి.

ఇత్యాదులందు బింబప్రతిబింబ భావము నొందిన ధర్మముల కైక్యారోప ముండుటంబట్టి వాక్యభేదము లేకున్నను వాక్యార్థవృత్తినిదర్శనే యగును. సదృశములగు వాక్యార్థములకు అనులక్షణవాక్యమందున్న వాక్యార్థశబ్దముచే [37] బింబ ప్రతిబింబ భావము నొందిన వస్తువిశిష్ట స్వరూపము లగు ప్రస్తుతాప్రస్తుత ధర్మములు వివక్షితము లగుటవలన నీ వ్యవస్థ మూలవిరుద్ధము కాదు.

ఇట్టి యర్థవివక్ష చేయుటచేతనే,

[37] మనుజులకు రాజసేవ, కత్తివాదరను నాకుట సింగము నాలిం
గనముచేసికొనుట పాముమోమును ముద్దిడుకొనుట.

అనుచోటఁ బ్రస్తుతాప్రస్తుత వృత్తాంతము లగు రాజసేవాదులు వేర్వేఱు పదములచే గ్రహింపబడియు నవి బింబప్రతిబింబ భావాపన్న వస్తువులచే నతిశయితములగు క్రియారూపము లగుటవలన వాక్యార్థవృత్తి నిదర్శన యగుటకు లోపము లేదు. అందుచేతనే నిదర్శన రూపకముకంటె వేఱు. రూపకమున బింబప్రతిబింబ భావశూన్యములే యగు ముఖచంద్రాదుల కైక్యారోపము కదా!

---

36. త్వయి సతి శివ దాతర్యస్మదభ్యర్థితానా
మితర మనుసరంతో దర్శయంతోర్థిముద్రామ్
చరమచరణఘాతై ర్దుర్గ్రహాం దోగ్ధుకామాః
కరభ మనుసరామః కామధేనౌ స్థితాయామ్ ॥
దోర్భ్యామబ్ధిం తితీర్షంతస్తుష్టువుస్తే గుణార్ణవమ్ ।

37. బింబప్రతిబింబభావాపన్న ధర్మిధర్మాన్యతర విశిష్టధర్మి ధర్మ్యన్యతరముల కైక్యారోపము నిదర్శన. ఇట్లు వివక్షించుటచే నిం దుదాహరించిన యైదు లక్ష్యములందు సమన్వయ మగును.

37. రాజసేవా మనుష్యాణా మసిధారావలేహనమ్
పంచానన పరిష్వంగో వ్యాళీవదనచుంబనమ్ ॥

[38] బలి నిగ్రహమున పైకెత్తబడిన హరిచరణ దండము
పరమేష్ఠి వసించు పద్మపునాళదండ మైనది మీ సంతస
మున కగుగాక !

అను విశిష్ట రూపకోదాహరణమందును, పరమేష్ఠి వసించు పద్మ సంబంధిత్వ రూప సాధారణ ధర్మసంపాదనార్థమే వానియందు ఊర్ధ్వోత్క్షిప్తత్వ విధివిష్టర పద్మసంబంధిత్వ విశేషణములను గ్రహించుటవలన బింబ ప్రతిబింబ భావాపన్నవస్తు విశిష్టరూపత్వము లేదు. 'దాత సామ్యత' ఇత్యాది నిదర్శనోదాహరణములందు దాతృపూర్ణచంద్రాదుల కానందకరత్వాదికము చేతనుంబోలె నిచటి విశేషణములకు బింబ ప్రతిబింబభావము లేకపోవుటంబట్టి.

ఎచట విషయ విషయి విశేషణములకుఁ బరస్పర సాదృశ్యముచే బింబ ప్రతిబింబభావ ముండునో

[39] జ్యోత్స్న యను భస్మపు పూతచే ధవళయు, తారకాస్థుల ధరించునది యంతర్ధాన వ్యసనరసికయు నగు నీ రాత్రి కాపాలికి చంద్రుఁ డనుముద్రాకపాలమం దుంచబడిన సిద్ధాంజన చూర్ణమును లాంఛన వ్యాజముతో ధరించుచు నొక ద్వీపమునుండి మఱొక ద్వీపమున కరుగుచున్నది.

అను నట్టి సావయవరూపకోదాహరణ స్థలమందును విషయ విషయులకు వాని విశేషణములకును వేర్వేఱుగ నైక్యారోపము కాని

38. అంఘ్రిదండో హరే రూర్ధ్వముత్క్షిప్తో బలినిగ్రహే
విధివిష్టరపద్మస్య నాళదండో ముదేఽస్తు వః ॥

39. జ్యోత్స్నాభస్మచ్ఛురణధవళా బిభ్రతీ తారకాస్థీ
న్యంతర్ధానవ్యసనరసికా రాత్రికాపాలికీయమ్
ద్వీపాద్ద్వీపం భ్రమతి దధతీ చంద్రముద్రాకపాలే
న్యస్తం సిద్ధాంజనపరిమళం లాంఛనస్య ఛలేన ॥

జ్యోత్స్నాది విశిష్టరాత్రిరూప విషయమునకు భస్మాదివిశిష్ట కాపాలికీ రూపవిషయికిని విశిష్టరూపముతో నైక్యారోపము లేదు. పై లక్షణము యుక్తినిరూపిత మగుటవలన 'మనుజులకు రాజసేవ' ఇత్యాదుల యందును వాక్యార్థవృత్తి నిదర్శనే యుక్తము. సదృశ వాక్యార్థముల కైక్యారోపము నిదర్శన యను యథాశ్రుతలక్షణము నంగీకరించువారి మతమున నిచటఁ బదార్థవృత్తినిదర్శనే కాఁదగును. (ఒక పదార్థమందు వేఱొక పదార్థమునుగాని దాని ధర్మమునుగాని యారోపించుటే యా లక్షణమని వారి యభిప్రాయము కనుక)

క్రియచే నసత్సదర్థముల బోధనమును గూడ మఱొక నిదర్శననుగాఁ జెప్పుచున్నారు.

ఉ॥ రాజవిరోధి నశించు నని బోధించుచునే చంద్రోదయము కాగా తమము క్షీణించుచున్నది. సమృద్ధికి ఫలము సుహృదనుగ్రహ మని తలంచుచు మిత్రుఁ డుదయిం పగనే పద్మములందు కాంతి నర్పించు చున్నాఁడు.

ఒకఁ డొక కార్యమును జేయుచుఁ దనకార్యముచేఁ బరుల కసదర్థమునుగాని సదర్థమునుగాని బోధించుట యేది వర్ణింపఁబడుచున్నదో దానిని మఱొక నిదర్శననుగాఁ జెప్పుచున్నారు. అసదర్థబోధనమునందు మొదటి వాక్య ముదాహరణము. ఇచట నశించు నని బోధించుచునే అని చెప్పవలసియుండగా 'బోధించుచునే' అను నది గమ్య మగుటచేఁ బ్రయోగింపలేదు. అందువలన రాజగు చంద్రునితోఁ గూడ విరోధించి నశించు తమము దృష్టాంతమగు తన నాశముచే నితరుఁడును నిట్లు రాజ విరోధి యైనచో నశించునని యనిష్ట పర్యవసన్న మగు నర్థమును బోధించుచునే నశించినదను నర్థమును వర్ణించుటవలన నసదర్థ నిదర్శన. అట్లుత్తరవాక్యమున సూర్యుఁడు స్వోదయ సమయముననే పద్మములందు శోభనుంచుచు పద్మములందు శోభనుంచు తన క్రియచే సమృద్ధికి ఫలము

నుహ్యాదనుగ్రహామే యని శ్రేయస్కరమగు నర్థమును నితరులకు బోధించుచు వర్ణింపఁబడుటచే నిది సదర్థ నిదర్శన యగును. మఱియు,

[40] అల్పుఁ డున్నతపదము నొందియుఁ దేలికగనే క్రిందపడు నని చెప్పుచు గిరిశిఖరమందున్న వర్షబిందువులు మంద మారుతముచేఁ గదల్పఁబడియుఁ గ్రిందఁ బడుచున్నవి.

ఇచట గిరిశిఖరమున నున్న వర్షబిందువులు పిల్లతెమ్మెరలచేఁ గదల్పఁ బడియుఁ గ్రింద పడుచు నల్పున కున్నతపదప్రాప్తి పతనహేతు వగు నను నసదర్థమును బోధించుచుఁ గూర్పఁబడుటచే నసదర్థ నిదర్శన.

[41] గృహమేధుల కతిథిపూజనము కర్తవ్యమని బోధించుచు నుదయాద్రి తనదగ్గఱ కరుదెంచిన తరణిని తలమాని కముగఁ ధరించుచున్నది.

ఇచట నుదయాచలముదగ్గర కరుదెంచిన సూర్యుని శిరసునసంభా వించుచు తనయందున్న రవిధారణక్రియచే గృహమేధి గృహమున కరుదెంచిన యతిథుల కాతిథ్య మీయవలె నను సదర్థమును బోధించు చున్నట్లు కూర్పఁబడుటచే నిది సదర్థ నిదర్శన.

ఈ నిదర్శనాశ్రయ విషయమునఁ గొంతమంది వాక్యార్థవృత్తి పదార్థవృత్తి నిదర్శనాద్వయము అసంభవద్వస్తు సంబంధమూలక మనియు మూఁడవది మాత్రము సంభవద్వస్తు సంబంధమూలక మనియు వ్యవహ రింతురు. ఎట్లన మొదటి నిదర్శనలో వాక్యార్థముల కైక్యము సంభ

40. ఉన్నతం పద మవాప్య యో లఘుర్హేలయైవ స పతేదితి బ్రువన్ ।
శైలశేఖరగతః పృషద్గణ శ్చారు మారుతధుతః పత త్యధః ॥

41. చూడామణిపదే ధత్తే యో దేవం రవిమాగతం ।
సతాం కార్యాతిథేయీతి బోధయ న్గృహమేధినః ॥

వింపక వాని సామ్యమునం దేలుచున్నది. రెండవ నిదర్శనయం దొక దాని ధర్మ మింకొకదాని యందుండక ధర్మిసామ్యమునఁ బర్యవసన్న మగుచున్నది. మూఁడవ నిదర్శనయందన్ననో! స్వక్రియచేఁ బరులఁగూర్చి సదసదర్థ బోధనము సంభవించుచునే సామ్యమును లోఁగొనుచున్నది.

'గృహమేధులకు బోధించుచు' నిత్యాదియందు 'కారీషాగ్ని చదివించుచున్నది' యనునట్లు ఆకార్యమునకు సమర్థులఁగాఁ జేయుట యందు 'ణిచ్' ప్రత్యయ ప్రయోగము. అందువలన నెట్లు గోమయ పిండాగ్ని చలినిఁ బోఁగొట్టుటచే వటువుల నధ్యయన పటువులఁగాఁ జేయు చున్నదో యట్లే వర్ణ్యమాన పర్వతము తా నుపమానభావముతో గృహస్థుల నుక్తబోధనపటువులఁగాఁ జేయ సమర్థ మగుచున్నది.

ఎట్లీపర్వతము తన దగ్గరకు వచ్చిన సూర్యుని శిరసున సంభావించు చున్నదో యట్లే గృహస్థుఁ డింటికివచ్చిన యతిథి నాతిథ్యముచే సత్కరింపవలెనని బోధనసంబంధము సంభవించుచున్నది.

## 20. వ్యతిరేకాలంకారము.

ఉపమానోపమేయములకు భేదముండెనేని వ్యతిరేకమగును.

ఉ॥ సత్పురుషులు శైలములవలె ; నున్నతులు ప్రత్యుత సహజ కోమలులును.

ఇది యుపమేయాధిక్య రూపమగు వ్యతిరేకము. మఱియు,

వీరుఁడా ! కల్పతరు పల్లవముకంటె నీచేతికిది విశేషము. పల్లవము కర్ణభూషణ మగుచున్నది. నీ చేయి (దానముచే) కర్ణతిరస్కారము చేయుచున్నది.

ఉపమేయన్యూనతం దెలుపు వ్యతిరేకము.

[42] అశోకమా! నవపల్లవములచే నీవు, ప్రేయసి సౌందర్యాది గుణములచే నేనును రక్తులము. నీమీదికి శిలీముఖము లరుదెంచుచున్నవి. దర్పకుని ధనువునుండి శిలీముఖములు నామీదికిని వచ్చుచున్నవి. కామినీ పాదాఘాతము నీకుంబోలె నాకును బ్రియమే. మన మిద్దర మున్నిట సమానులమే కాని నన్నుమాత్ర మావిధి సశోకునిగా నొనరించెను.

శుద్ధ వ్యతిరేకమున కుదాహరణము.

[43] ధృఢతరనిబద్ధముష్టియుఁ గోశస్థితము మలినము నగు కృపణకృపాణములకు నాకారముచేతనే భేదము.

---

42. రక్తస్త్వం నవపల్లవై రహమపి శ్లాఘ్యైః ప్రియాయా గుణైః
త్వా మాయాంతి శిలీముఖాః స్మరధనుర్ముక్తా స్తథా మా మపి।
కాంతాపాదతలాహతి స్తవ ముదే తద్వన్మమా ప్యావయోః
సర్వం తుల్య మశోక కేవల మహం ధాత్రా సశోకః కృతః॥

రక్తులము = ఎఱ్ఱనిది, అనురాగము కలవాడు. శిలీముఖములు = తుమ్మెదలు, బాణములు. కామినీపాదాఘాతము = దోహదకూవము, భోగకూపము. అశోకము = చెట్టుపేరు, దుఃఖములేనిది. సశోకము = దుఃఖముతో గూడియుండుట.

43. దృఢతరని బద్ధముష్టేః కోశనిషణ్ణస్య సహజమలినస్య
కృపణస్య కృపాణస్య చ కేవల మాకారతో భేదః॥

ఆకారముచే = స్వరూపముచేత, దీర్ఘ ఆః కారముచేతను.

యద్యపి ఉపమాన మధికగుణము ఉపమేయ మల్పగుణము నను నియమ ముండుటచే నిందుపమేయన్యూనమగు వ్యతిరేకము ఉపమానమే కదా! అనుభయపర్యవసాయి వ్యతిరేకము సహజముగ నుపమానమే యగును. అందువలన వ్యతిరేకములో నంత్యభేదద్వయము నుపమాంతర్భావము నొందుచున్నను నందు సాదృశ్యము చమత్కారప్రయోజకము కాదు సరికదా ప్రత్యుత ఉపమేయన్యూనతయు నుత్కర్షాపకర్షలులేమియుమాత్రమే చమత్కారజనక మగుచుండుటచే దాని కుపమాలంకారము

## 21. సహోక్తి.

సహభావము జనరంజక మైనచో సహోక్తి యగును.

ఉ॥ ఆ రాజకీర్తి శత్రువులతోఁగూడ దిగంతముల కేగెను.

మఱియు,

"¹ నీడ యలయుటచేఁగాఁబోలు బాటసారులతోఁగూడ వృక్ష మూలము నాశ్రయించుచున్నది. చల్లఁదనము చిక్కుట

---

నం దంతర్భావము చెప్ప వీలులేదు. పూర్వపక్ష మాపాతరణీయముగఁ గనఁబడుచున్నను సారహీన మగుటచే గ్రంథకర్త యనువదింపలేదు.

వ్యతిరేకాలంకార విషయమున రుయ్యక మమ్మటభట్టుల వివాదమే దీక్షితజగన్నాథులకును గలుగుచున్నది. దీక్షితుడు రుయ్యక మతావలంబి, జగన్నాథుడు మమ్మట మతావలంబి.

రుయ్యకు డలంకారసర్వస్వమున 'ఉపమానముకంటె నుపమేయమున కాధిక్యముకాని న్యూనత్వముకాని కలిగిన వ్యతిరేకాలంకార మగుననెను.

మమ్మటుడు కావ్యప్రకాశమున 'ఉపమానముకంటె నుపమేయమున కాధిక్యముండిన వ్యతిరేకాలంకార మనెను. జగన్నాథు డీ మమ్మటమతము నవలంబించెను. దీక్షితుడు రుయ్యక మతావలంబియై యుపమానముకంటె నుపమేయ మధికగుణ మైనపుడు వ్యతిరేక మైనట్లే న్యూనగుణ మైనపుడుగూడ వ్యతిరేకమగు ననుటయే కాక యనుభయరూపమగు వేఱొక భేదమునుగూడ గ్రహించి యుదాహరించెను.

45\. ఛాయా సంశ్రయతే తలం విటపినాం శ్రాంతేవ పాంథైస్సమం
మూలం యాతి సరోజలస్య జడతా గ్లానేవ మీనైస్సహ।
ఆచామ త్యహిమాంశుదీధితి రప స్తప్తేవ లోకైస్సమం
నిద్రా గర్భగృహం సహ ప్రవిశతి క్లాంతేవ కాంతాజనైః॥

చేతనేమో! చేపలతోఁగూడఁ దటాకంబునదుగంటు
చున్నది. సూర్యకాంతి దప్పినొంది జనులతోఁగూడ
నీరు ద్రావుచున్నది నిజము. నిద్ర వాడినదా యను
నట్లు కాంతలతో గర్భగృహమునఁ బ్రవేశించుచున్నది.

జనరంజక మాటచే 'సముద్రతీరమున నితనితో విహారింపుము' అనుచో వహోక్తిలేదు.

## 22. వినోక్తి.

> కొంచెమేదేని లేదనిచెప్పినఁ బ్రకృతమునకు హీనత కలు
> గుట వినోక్తియగును.

ఉ॥ విద్య హృద్య యయ్యు వినయ సంపద లేనిచో నింద్య
యగును. మఱియు,

ఎవఁడు రాముని జూడఁడో రాముఁ డెవనిని జూడఁడో
వాఁడు లోకమున నిందితుఁడగును. వాని మనసుకూడ
వాని నిందించును.

ఇచట రామ దర్శనము లేకుండుటచే హీనత్వము వినా శబ్దము లేకున్నను జూపఁబడినది.

> కొంచె మేదేని లేదనిచెప్పినఁ బ్రకృతమునకు రమ్యత కలి
> గిన నదియు వినోక్తి యగును.

ఉ॥ రాజేంద్ర! నీ సభ ఖలులు లేకపోవుటచేఁ బ్రకాశించు
చున్నది. మఱియు,

చంద్రోదయము కాఁగాఁ జీకటిచే వీడబడిన రాత్రివలెను,
పొగపోయిన నైశాగ్నిజ్వాల వోలె, నొడ్డువిఱిగి
వడుటచేఁ గలుషమై తిరిగిప్రసన్న మగుచున్న గంగ
లాగున, నీ శోభనాంగి యూర్వశి మూర్ఛనుండి తేలి

పొందుచున్నట్లు కనఁబడుచున్నది. [46]

ఇచట చీకటి మొదలగునవి లేకుండుటచే నిశాదులకు రమ్యత్వము వినాశబ్దము లేకుండగనే తెలుపఁబడినది.

## 23. సమాసోక్తి.

ప్రస్తుతమును వర్ణించుచుండ నప్రస్తుతము తోచు నెడల సమాసోక్తియగును.

ఈ చంద్రుఁడు రక్తుఁడగుచు నైంద్రీముఖమును ముద్దిడు కొనుచున్నాఁడు. చూడుము! యనుచో

ఎచటఁ బ్రస్తుతవృత్తాంతము వర్ణింపఁబడుచుండ విశేషణ సామ్య బలమున నప్రస్తుతవృత్తాంతముగూడఁ దోచునో యచట సంగ్రహముగఁ బ్రస్తుతా ప్రస్తుతవృత్తాంతములఁ జెప్పుటచే సమాసోక్తి యగును. ఉదా హరణ మీచంద్రుఁడని. ఇచట ప్రాచ్యారంభరూప ముఖ సంబం ధాత్మక మగునుదయము చంద్రునకు వర్ణింపఁబడుచుండ, చంద్రశబ్దము నందలి పుంలింగముచేతను, నైంద్రీశబ్దమునందలి స్త్రీలింగముచేతను, నైంద్రీశబ్ద ప్రతిపాద్య మగు నింద్రసంబంధిత్వముచేతను, ప్రతిపాదితమగు ముఖశబ్దగతప్రారంభ వదన సాధారణ్యమువలన, రక్తశబ్దగతారుణ

---

46. ఆవిర్భూతే శశిని తమసా ముచ్యమానేవ రాత్రి
ర్నైశస్యార్చిర్హుతభుజ ఇవ ఛిన్నభూయిష్ఠధూమా ।
మోహేనాంతర్వరతను రియం లక్ష్యతే ముక్తకల్పా
గంగారోధః పతనకలుషా గృహ్ణతీవ ప్రసాదమ్ ॥

ఈ పద్యము విక్రమోర్వశీయనాటక ప్రథమాంకములో కేశియను రాక్షసుని జయించి వానిచే నపహృతయై భయమూర్ఛిత యగు నూర్వశిని చెలికత్తె యగు చిత్ర లేఖతోఁ గూడ రథమున నుంచి తీసికొని వచ్చు పురూరవసుఁడు; మూర్ఛనుండి తెలి వొందుచున్న యూర్వశిఁజూచి తత్సఖితోఁ జెప్పుసందర్భములోనిది.

కాముక సాధారణ్యమువలన, [47] ముద్దిడుకొను శబ్దగత సంబంధ, కాముక వ్యాపార, సాధారణ్యమువలనను, నప్రస్తుత మగు పరవనితా సక్త పురుషవృత్తాంతము తోచుచున్నది. మఱియు,

> [48] చందోయి చిందులాడ, కురులు చెదర, సరములు
> సంచలింప, చెవియాకులు చెక్కిళ్లపై మెఱుగు లీన,
> మోము దమ్మి చెమర్ప, నిట్టూర్పులునిగుడఁ, గర
> ప్రహారములతో రసాతిరేకమున నీయింతి నీతో నాడు
> చుండుటచే నోబంతీ ! నీవు సుకృతివి.

ఇచటఁ [illegible] తను వర్ణింపఁబడుచుండ జందోయిచిందులాడ నిత్యాది క్రియావిశేషణముల సామ్యమువలన విపరీతరతాసక్త యగు నాయికకథ తోచుచున్నది. పూర్వోదాహరణమున విశేషణములు శ్లిష్టములు, నిచట సాధారణములు.

సారూప్యమువలనను సమాసోక్తి కనఁబడుచున్నది. ఎట్లన,

> మును పేఱుపాఱినచోట నిపుడిసుకతిన్నెలుండెను. చెట్లు
> దట్టముగ నున్నచోటఁ బలుచబడెను. విరళముగ నున్న
> చోట దట్టమయ్యెను. చాలకాలమునకుఁ జూచుటచే
> నీవనము వే ఱనుకొన్నను గొండలుండుటచే రావన మిదే
> యను బుద్ధిని దృఢపఱుచుచున్నది. [49]

---

47 ముద్దిడుకొను శబ్దమునకుఁ బ్రకృతార్థ మగు సంబంధము లాక్షణికము. అప్రస్తుతార్థము కాముక వ్యాపారము ముఖ్యార్థము.

48. వ్యావల్గత్కుచభార మాకులకచం వ్యాలోల హారావళి
ప్రేంఖత్కుండలశోభి గండయుగళం ప్రస్వేది గాత్రాంబుజమ్ ।
శశ్వద్దత్తకర ప్రహార మధిక శ్వాసం రసాదేతయా
యస్మాత్కందుక సాదరం సుభగయా సంసేవ్యసే తత్కృతీ ॥

ఇచట వన వర్ణనము ప్రస్తుత మగుచుండ వనసారూప్యమువలన గృహస్థులందు ధనసంతానాది వృద్ధిక్షయముల వ్యత్యాసము నొందిన కుటుంబముల కాశ్రయ మగు గ్రామనగరాదుల వృత్తాంతము తోచు చున్నది.

---

49. ఉత్తరరామ చరిత్రమునందు సీతా త్యాగానంతరమున వనమున శ్రీ రామచంద్రుని వాక్యమిది.

పురా యత్ర స్రోతః పులిన మధునా తత్ర సరితాం
విపర్యాసం యాతో ఘనవిరళభావః క్షితిరుహామ్ ।
బహోర్దృష్టం కాలా దపరమివ మన్యే వనమిదం
నివేశ శ్శైలానాం తదిద మితి బుద్ధిం ద్రఢయతి ॥

దీక్షితోక్త మగు నీ లక్ష్యమందు రసగంగాధర కర్త జగన్నాథు డిట్లు దోషము నుద్ఘాటింపు చున్నాడు.

మమ్మటుడు కావ్యప్రకాశమున 'శ్లిష్టవిశేషణములచే నప్రస్తుతము గమ్యమైన సమాసోక్తి' అనెను.

రుయ్యకుఁ డలంకారసర్వస్వమున 'విశేషణముల సామ్యముచే నప్రస్తుతము గమ్యమైనచో సమాసోక్తి' చెప్పెను. విశేషణ సామ్యము:— శ్లిష్టత్వముచేత, సాధారణ్యముచేతను, సాదృశ్య గర్భతచేతను నగును.

విద్యానాథుడు తన ప్రతాపరుద్రీయమున ప్రకృతాన్వయి విశేషణ ముల సామ్యముచే నప్రస్తుతము గమ్యమైన సమాసోక్తి యని పై లక్షణ మునే యనుసరించెను.

ఇట్లు ప్రాచీనులందఱు విశేషణసామ్యమే సమాసో
చెప్పుచుండ 'మును పెఱుపాఱినచోట' యను ప్రకృత
వనవిశేషణములు శ్లిష్టములుకాని, సాధారణములుకాని, సాదృశ్య గర్భ ములుకాని, కాకపోవుటచే దీక్షితుడు సర్వప్రాచీనలక్షణ విరుద్ధముగ నచట సమాసోక్తి నెట్లు చెప్పెను? సర్వప్రాచీన లక్షణపరిత్యాగము చేసి స్వ

ఈ యుదాహరణములందు ప్రస్తుతాప్రస్తుత సాధారణములగు విశేషణములబలమునఁ గాని సామ్యబలముననఁగాని యప్రకృతవృత్తాంతబోధనము, ప్రకృతముతో నన్వయము లేనిదెట్లును కవిప్రయత్న విషయము కాదుకనుక ప్రకృత విశేష్యమం దారోపణార్థమే యగును. అందువలన సమాసోక్తిలో నప్రస్తుతవృత్తాంతసమారోపమే సౌందర్యహేతు వగును కాని రూపకమందువలెఁ బ్రస్తుతమునందప్రస్తుతసమారోపమిందు లేదు. ఎందువలన ననిన;

---

కపోలకల్పిత లక్షణము నంగీకరించినచో నంతటను నన్ని యలంకారములు నుండవలసి వచ్చుటచే నవ్యవస్థాదోషము కలుగును అని.

దీక్షితహృదయమును మన మిట్లూహింప నగును. మమ్మట లక్షణమందలి శ్లిష్టవిశేషణములచే నన్యార్థబోధన మనునది, రుయ్యక లక్షణమందలి సాదృశ్యగర్భ విశేషణములచే సామ్యగమ్యత్వ మనునదియు, కేవల సాదృశ్యగమ్యత్వమునకు నుపలక్షకములు. లేనిచో మమ్మట లక్షణానుసారముగ శ్లిష్టవిశేషణమాత్రముచేతనే యప్రస్తుతము గమ్యమన్నచో సాధారణవిశేషణస్థల మగు 'చందోయి చిందురాడ' నిత్యాదియం దవ్యాప్తివచ్చును. రుయ్యకలక్షణరీత్యా శ్లిష్ట, సాధారణ సాదృశ్య గర్భ విశేషణములచేత మాత్రమే యప్రస్తుతము గమ్యమనినచో కేవల సామ్యమాత్రముచే గమ్యమగు 'మును పేఱుపాటినచోట' నిత్యాదియం దవ్యాప్తి సంభవించును. ఇష్టాపత్తి యనరాదు.

'పుత్త్రుఁ డగు క్రౌంచమును దండ్రి యగు హిమవంతుని
వీడి రంధ్రమునం బ్రవేశించి తక్కలం గాపాడుకొన్న యా
తు డేము సంపాదించెను'

అనుచో మైనాకుఁడు ప్రస్తుతము కాగా సాదృశ్యమాత్రము వలన బాలుఁడగు పుత్త్రుని వృద్ధుఁడగు తండ్రిని వీడి యుద్ధమునఁ జేరి పొట్ట పోసికొను నప్రస్తుతపురుషుని వృత్తాంతముతోఁచుటచే సమాసోక్తి నవ్యా

౧. ముఖచంద్రుఁ డను-చోట ముఖమున చంద్రత్వారోపణమునకుఁ గారణ మగు చంద్రపదమును జెప్పినట్లు చంద్రుఁడు రక్తుఁడగుచు...ముద్దిడు కొనుచున్నాఁడు, ఇత్యాది సమాసోక్త్యుదాహరణమున చంద్రు నందు జారత్వారోపమునకుఁ గారణ మగు జారవాచకపదమును జెప్పక పోవుటవలన,

౨. రాత్రియందు మేఘుడభిసారికా ముఖమును విద్యున్నయ
నములతో వీక్షించి వర్షధారలతో నీచంద్రుఁడు జారి
పోయెనా యని తలంచి మొఱపెట్టెను.

---

నుభవసిద్ధ మగుచున్నది. ఇచట సాదృశ్యము తప్ప పై లక్షణములు లేనే లేవు. అందుచేతనే మన కువలయానందకర్త తన సమాసోక్తి లక్షణ మున్నవిశేషణము-లకు శ్లిష్టత్వమునుగాని సాధారణ్యమునుగాని మఱిదేనిం గాని చెప్పక 'ప్రస్తుతమం దప్రస్తుతపరిస్ఫూర్తి కలిగిన-చో సమాసోక్తి' అని, యేవిధముగనైనను, ప్రస్తుతమున నప్రస్తుతము తోఁచినచో సమా సోక్తి యగునని చెప్పెను.

ప్రాచీన లక్షణము వీడి స్వలక్షణము నంగీకరింప నన్ని-చోటు-ల నన్నియలంకారములు సంభవించునని యవ్యవస్థాదోషమును జగన్నాథు డాపాదించె నని చింతింప నవసరము లేదు. పరమప్రాచీనుడగు దండ్యా చార్యుడే తనకావ్యాదర్శమున నస్మదాదుల కలంకారకల్పనమున నధి కారము నంగీకరించెనుగదా !

ఇంతియకాదు, శాస్త్రములందు లక్ష్యానుసారముగ లక్షణకల్ప నము కావున 'మునుపేఱుపాఱినచోట' నిత్యాదియందు కేవల సాదృ శ్యముచేతనే సమాసోక్తి దీక్షితులవారిచే వివక్షింపఁబడినది.

ప్రాచీనలక్షణ తాత్పర్యవివరణముచే వానికిఁ గౌరవ మాపాదిం చెనే కాని ప్రాచీనలక్షణ విరోధముకాని లక్షణమున కవ్యవస్థకాని యేమియు లేదు.

అను నేకదేశవివర్తిరూపకోదాహరణ మందువలెఁ బ్రస్తుతమం దప్రస్తుతారోపమునకు గమక మైన లేకపోవుటవలనను,

విద్యున్నయనములో ననుచోట నన్ననో! నిరీక్షణమున కుపయోగ పడుటవలన నుత్తరపదార్థ ప్రధానమగు మయూరవ్యంసకాదిసమాసముచే నేర్పడిన ఉత్తరపదార్థములగు నయనముల కన్వయము కుదురుటకై మేఘునం దనుక్త మయ్యు ద్రష్టృపురుషత్వారోపము గమ్య మని యంగీకరింపఁబడుచున్నది

3. ఈ సమాసోక్తియం దట్లు గమకమగు నిరీక్షణము వలె 'ఓ రాజ! నీవు రాగా నీ సముద్రము వణకుచున్న దేమి?' ఇత్యాది వాక్యమందు సేతు కర్తృత్వాదికమువంటి అప్రస్తుతాసాధారణ ధర్మమున్ను జెప్పఁబడక పోవుట వలనను,

౪. శ్లిష్టసాధారణాది విశేషణములచే బోధితము లగు ప్రస్తుతా ప్రస్తుత వృత్తాంతములలో నప్రస్తుత (జార) వృత్తాంతమునకు విద్యున్నయనములలో నయనమునకుంబోలె ప్రాధాన్యమున్ను లేక పోవుటవలనను, అట్లు ప్రాధాన్య ముండినచో నాప్రాధాన్యము కుదురుటకై నీవు సేతుమంథనకర్త వనుస్థలము నందువలెఁ బ్రకృతమునందనుక్త మయ్యు నప్రకృత సమారోపము నంగీకరింతుము. ఏవంచ, అప్రస్తుత వాచకము, అప్రస్తుతగమకము, అప్రస్తు తాసాధారణ ధర్మము, అప్రస్తుత వృత్తాంతప్రాధాన్యము నను నీ నాల్గింటిలో నొకటియు నిచట లేక పోవుటవలన విశేషణములచే ప్రతిపాదిత మగునప్రస్తుత వ్యవహారము నారోపించుట మాత్ర మిందు చమత్కారజనకము కాని యప్రస్తుత సమారోపము చమత్కార జనకము కాదు.

విద్యున్నయనమువలె సమాస సంపాదిత మగు శాబ్దప్రాధాన్యము లేకున్నను శ్లిష్టములు సాధారణములు నగువిశేషణములచేఁ బ్రతిపాది

తము లగు ప్రస్తుతాప్రస్తుత వృత్తాంతములు రెండును భిన్నపదోపాత్త విశే షణములవలె సాక్షా ద్విశేష్యములోడనే యన్వయించుటవలన నార్థిక ప్రాధాన్య మున్నదే? యన్నను శ్లిష్టసాధారణ విశేషణములచే సంపా దింపఁబడిన పరనాయికా ముఖచుంబన రూపాప్రస్తుత వృత్తాంత మేవిధ మునను బ్రస్తుతములో నన్వయింపక పోవుటవలన నసంబద్ధాభిధాన ప్రసంగభీతిచే దానిని ప్రస్తుత విశేష్యమం దారోపించుటవలనఁ బ్రస్తుత మున నప్రస్తుత సమారోపము నంగీకరింపరాదు. (అసంబద్ధాభిధాన ప్రసంగ పరిహారము తుల్యమే కావున నప్రస్తుత ధర్మియందే ప్రస్తుత వృత్తాంతము నన్వయింపరాదా ?, యన్నచోఁ జెప్పుచున్నాఁడు). ప్రస్తుతవిశేష్యమం దప్రస్తుత వృత్తాంతాన్వయమునకు యోగ్యతలేనట్లే యప్రస్తుత మగు జారాదియందును బ్రస్తుతవృత్తాంతాన్వయమునకు యోగ్యత లేదు. ఇట్లు యోగ్యతారూప వినిగమకము లేకపోగా నసంబద్ధప్రలాప భీతిచే సమప్రధానము లగు ప్రస్తుతాప్రస్తుత వృత్తాంత ములలో నొకదాని యారోప మింకొక విశేష్యమం దవశ్యమంగీకరింప వలసి యుండగా వాచ్య (వినిగమక) మగుప్రస్తుత విశేష్యమునం దే యప్రస్తుత వృత్తాంతారోపము చమత్కారజనక మనుట యుక్తము.

ఓయి! ఇ ట్లప్రస్తుతధర్మి సమారోపము నంగీకరింపక ప్రస్తుతము నందు శ్లిష్టములు సాధారణములు నున్నగు విశేషణములచేఁ బ్రతిపాదిత మగు నను రాగపూర్వక వదన చుంబనాద్య ప్రస్తుత వృత్తాంతముయొక్క సమారోపమునకు మాత్రమే చమత్కారజనకత్వము నంగీకరించుటచే విశేషణ సామ్యసంపాదితమగు కాముకాద్య ప్రస్తుత ధర్మివ్యంజన నపే క్షింపక పోవుటవలన, 'విశేషణ సామ్యముచే నప్రస్తుతము గమ్యమగుచో సమాసోక్తి' 'ప్రస్తుతమందున్న విశేషణముల సామ్యముచే నప్రస్తుతము గమ్యమైనచో సమాసోక్తి' ఇత్యాది రుయ్యక విద్యానాథాది ప్రాచీనుల సమాసోక్తి లక్షణములు కుదురక పోవలసివచ్చునే — అన్నచోఁ

చెప్పుచున్నాఁడు. అప్రస్తుత జారసంబంధిగాఁ దెలియఁబడని పరవనితా వదనచుంబనాద్యారోపము చమత్కార జనకము కాకపోయినను నప్రస్తుత కాముకాది సంబంధిగాఁ దెలియఁబడినపరవనితాముఖచుంబనాద్యారోపము చమత్కారజనక మగును. అట్టి వృత్తాంతమే రసానుగుణమగుటంబట్టి.

కాముకాద్యప్రస్తుత ధర్మివ్యంజ నాపేక్షయున్నను విశేషణ సామ్యమునకు కాముకాద్యప్రస్తుతధర్మిని వ్యంజింపజేయు శక్తిలేక పోవుటవలన లక్షణము కుదరకపోవుట తప్పనిదే కదా యన్నచో ఆవిశేషణసామ్యమునకు స్వతః శక్తిలేకున్నను వృత్తాంతమును వ్యంజింపచేయుట ద్వారా శక్తికలుగుటవలన దోషములేదని చెప్పుచున్నాడు.

అప్రస్తుతజార సంబంధముతోఁ గూడిన వృత్తాంతమును బోధించుటకు విశేషణములకు సామర్థ్యము లేదు కావున విశేషణపదములందలి శ్లేషాదిసామర్థ్యముచే నప్రస్తుతకాముక సంబంధిగాఁ దెలియబడని వదన చుంబనాదిచేఁ దత్సంబంధియగు కాముకాదికమభివ్యక్తముకాఁగాఁ దిరిగి వదన చుంబనాదియందు కాముకసంబంధిత్వజ్ఞానము కలుగును. మనచే నశ్వముగనే చూడబడిన రాజాశ్వాదికము తత్సంబంధి యగు రాజాదిని దెలుపఁగా దిరిగి యా యశ్వాదికము రాజ సంబంధమైనదను జ్ఞానమెట్లుకలుగునో యట్లే విశేషణసామ్యముచే వాచ్యమును పోషించు నప్రస్తుత జారవ్యంజనాపేక్ష కలుగును. అట్లప్రస్తుతజారవ్యంజనము నపేక్షించుట వలననే 'ఈ చంద్రుడు...ముద్దిడుకొనుచున్నాడు' ఇత్యాది శ్లిష్టవిశేషణ సమాసోక్తియందువలెనే 'చందోయి చిందులాడ' నిత్యాది సాధారణ విశేషణ సమాసోక్తియందును నప్రస్తుత వ్యవహార సమారోపమే యని ప్రాచీనుల ప్రవాదము. అప్రస్తుత ధర్మివ్యంజనాపేక్ష లేకున్న నిట్టి ప్రవాదమేలలేదన్నచో కందుకమందు 'చందోయి చిందులాడ' నిత్యాది విశిష్టవనితా సేవ్యత్వము సహజముగనేయుండుటచే నందారోపమే యనవసరమగుటవలన కాముకసంబంధిగానే యారోపింపదగి యున్నదికదా !.

ఇంతియకాదు, సారూప్యనిబంధనగా నుదాహరింపఁబడిన 'మును పేరుపారినచోట' నిత్యాది సమాసోక్తియం దప్రస్తుతవృత్తాంతము

వాచ్యము కానిదై యప్రస్తుతసంబంధి వృత్తాంతరూపముగనే తెలియఁబడుటచే నయ్యప్రస్తుత సంబంధి వృత్తాంతరూపముగనే యచట నా (యప్రస్తుత వృత్తాంతమున కా) రోపము సిద్ధించుటవలన మఱియొక సమాసోక్తియందును నట్లే యారోపించుట యుక్తముకావున ప్రాచీనుల లక్షణములుకూడ సమన్వితములే యని తలఁపఁదగును.

## 24. పరికరము

ప్రకృతార్థము నుపపాదించు నర్థములను సూచించు విశేషణము లుండినచోఁ బరికర మగును.

ఉ॥ సుధాంశుశేఖరుఁడగు శివుఁడు మీతాపమును బోఁగొట్టును.

ఇచట సుధాంశుశేఖరుఁడను విశేషణము తాపహరణ సామర్థ్యాభివ్యంజకము. మఱియు,

50 నీదయవలనఁ గుసుమాయుధుఁడ నయ్యు నేనొకవసంతునే
సహాయునిగాఁగొని పినాకపాణియగు హరునిధైర్యము
నైనను హరింతును వేఱువిలుకాండ్రు నా కేమి లెక్క ?

ఇచట పినాకపాణియను హరవిశేషణము, కుసుమాయుధుఁ డను నహామర్థ విశేషణమున్ను సారాయుధత్వాసారాయుధత్వాభిప్రాయ వ్యంజకములు.

51 సర్వాసహ్యాములకునిధి కృతఘ్నము నశించునదియు నింద్యము నగు శరీరముకొఱకుఁ గూడ మూఢులు పాతకము లొనరింతురు.

ఇచట శరీరవిశేషణములు అది హేయమగుటచే సంరక్షింపఁదగినది కాదను నభిప్రాయసూచకములు. మఱియు,

---

5. తవ ప్రసాదాత్కుసుమాయుధోఽపి సహాయమేకం మధుమేవ లబ్ధ్వా
కుర్యాం హరస్యాపి పినాకపాణేర్ధైర్యచ్యుతిం కే మమ ధన్వినోఽన్యే ॥

51 సర్వాశుచినిధానస్య కృతఘ్నస్య వినాశినః
శరీరకస్యాపి కృతే మూఢాః పాపాని కుర్వతే ॥

ఓరాజ ! నేను నీగుణబృందమును వర్ణింప నెట్లు శక్తుఁడను ? ఒకటిగనున్న వేదగణమును విస్తరింపఁజేయలేదు. పుట్టనుండి పుట్టను, నారాయణుని నాభీకమలమునుండి బయటబడలేదు. మహాభాష్యమును రచింపలేదు. చిత్రార్థమును బృహత్కథను జెప్పలేదు. ఇంద్ర గురువును గాను.[52]

ఇచట 'వేదగణమును విస్తరింపజేయలేదు' ఇత్యాది విశేషణములు తనయందు వ్యాసాద్యసాధారణ కార్యకర్తృత్వనిషేధరూపముగ 'నేను వ్యాసుఁడనుగాను' అను నభిప్రాయవ్యంజకములు. ఇందులో మొదటి రెండుదాహరణములందు నొక్కొక్క విశేషణము. తరువాతిలక్ష్యము లందొక విశేష్యమున కనేకవిశేషణములు. వానిలో మొదటియుదాహరణమున నన్నివిశేషణములు నొక యర్థమందభిప్రాయమును సూచించుచు, పదార్థరూపములును. రెండవ యుదాహరణమున భిన్నాభిప్రాయ సూచకములు, వాక్యార్థరూపములును. ఇదియేభేదము. శివునకు తాపహరణమందు, మదనునకు శివప్రతాపహరణమునందు, కైముతికన్యాయమున సర్వధన్విధైర్యాపహరణమందు, శరీరసంరక్షణకై పాప మాచరించు వారి మూఢత్వమందు, తనకు వర్ణనీయరాజగుణ కథ నాసామర్థ్యమందును, వాచ్యము లగువానియందే యంగములగుటంబట్టి యీ యుదాహరణములందు వంగ్యార్థ మున్నను ధ్వనివ్యవహారము లేదు. వాచ్యమునకు సహకారియగుటచేతనే వ్యంగార్థము వాచ్యమునకు పరికరమగుట వలనఁ బరికరమని యీ యలంకారమునకుఁ బేరు.

కొందఱు ప్రయోజనములేని విశేషణములను జెప్పిన నపుష్టార్థత్వదోషము సంభవించును గావున నాదోషము లేకపోవుటయే సప్రయో

---

52. వ్యాస్థం నైకతయా స్థితం శ్రుతిగణం జన్మీ న వల్మీకతో
నాభౌ నాభవ మచ్యుతస్య సుమహద్భాష్యం న చాభాషిషమ్
చిత్రార్థాం న బృహత్కథామచకథం సుత్రామ్ణి నాసం గురు
ర్దేవ త్వద్గుణబృందవర్ణన మహం కర్తుం కథం శక్నుయామ్ ॥

జన విశేషణమునకు ఫలముకాని యేయలంకారము కాదు. ఒకవిశేష్య మునకు సాభిప్రాయానేక విశేషణములు చెప్పుటలో నధికచమత్కార ముండుటవలన నీపరికర మలంకారములలోఁ బరిగణింపఁబడిన దందురు. వస్తుతస్తు అనేకవిశేషణము లుండిననే పరికర మను నియమము లేదు. శ్లేష యమకాదులం దపుష్టార్థదోషము లేకపోవుటచే నందొక్క సాభిప్రాయవిశేషణ మున్నను చమత్కార విశేష ముండుటంబట్టి పరికర మగును. ఎట్లన,

> [53] తనదేవమునువీడి యన్యదైవము నారాధించువాఁడుభయ
> లోక భ్రష్టుఁడై పాపమును నొందును. వనవదనవద్గిరి
> సుత్రాములలో వనవద్గిరిచేతనే మనము సదైవతకులము
> అనవత్సుత్రామునితో నేమిపని ?

ఇచట పురుహూతపూజోద్యుక్తులగు నందాదులఁగూర్చి భగవంతుఁడగు కృష్ణునివాక్యము. గోవర్ధనపర్వతమే మనకురక్షకమగుటచే దైవతము. అదియే పూజనీయము కాని యరక్షకుఁ డగు నింద్రుఁడు మనకు దైవతము కాఁడు; అను నర్థపరముకాగా వనవత్తు అను గోవర్ధనగిరి విశేషణము కాననములు కాలువలు మున్నగునవి కలుగుట వలన పుష్పఫలమూలజల తృణాదులచే నాటవికుల మగు మనకు, మన ధనము లగు గోవులకు నిదియే రక్షక మను నభిప్రాయవ్యంజకము. ఇట్లు యమకస్థలమున సాభిప్రాయ మగు విశేషణ మొక్కటి చెప్పినను చమత్కార విశేషము కలుగుటవలన సాభిప్రాయవిశేషణ మున్నచో

---

53. అతియజేత నిజాం యది దేవతాముభయతశ్చ్యవతే జుషతేఽప్యఘమ్ ।
క్షితిభృత్యైవ సదైవతకా వయం వనవతానవతా కి మహేంద్రుకః ॥

వనవ దనవ ద్గిరిసుత్రాములలో = గిరియు సుత్రాముఁడు = గిరిసుత్రాములు. వనవాన్, అనవత్ = వనవదనవంతములు. వనవద్గిరి = కాననములు కాలువలు కల కొండ. అనవత్సుత్రాముడు = రక్షింపని ఇంద్రుడు

నలంకార ముండినపుడు యమకములేని సుధాంశుశేఖరుఁ డనుచోటను నలంకార ముండుట కాటంక ముండరాదు. ఇంతియకాక ఏకపదార్థ హేతుక మగు కావ్యలింగ మలంకార మని సర్వసమ్మతముకదా ? అట్లే ఒక్క విశేషణ మున్నను నది సాభిప్రాయ మైనచో నలంకార మగుట యుక్తమేయగును.

## 25. పరికరాంకురము.

ప్రకృతార్థము నుపపాదించునర్థమును సూచించు విశేష్య ముండినచోఁ బరికరాంకుర మగును.

ఉ॥ దేవుఁడైన చతుర్భుజుఁడు నాలుగు పురుషార్థముల నిచ్చును.

ఇచట చతుర్భుజుఁడను విశేష్యము పురుషార్థ చతుష్టయదాన సామర్థ్యవ్యంజకము. మఱియు,

రాజ ! నీగుణములను ఫణీంద్రుఁడు చెప్పఁగలఁడు. కార్తవీర్యుఁడు వ్రాయఁగలఁడు. ఇంద్రుఁడు చూడగలఁడు. మానవమాత్రుఁడనగు నే నెక్కడ ? నీగుణము లెక్కడ ?

ఫణీంద్రుఁడు మొదలగు విశేష్యపదములు సహస్రముఖత్వసహస్ర బాహుత్వసహస్రాక్షత్వాభిప్రాయ సూచకములు.

## 26. శ్లేష.

అనేకార్థక శబ్దములకూర్పు శ్లేష. అది ప్రకృతవిషయము నప్రకృత విషయము నుభయ విషయము నగును.

ఉ॥ సర్వోఽగంగామదీధరత్ = కొండను భూమిని ధరించినవాఁడు, గంగను ధరించినవాఁడు. సర్వదుఁడు మాధవుఁడు మిమ్ము రక్షించుగాక. హరిణాహితశక్తినా = మృగముచే నంకరూపమున నుంచఁబడిన నంగము కల,

సూర్యునిచే కృతసంగముకల. యబ్జతుల్యము నీ ముఖము.
ఉచ్చరద్భూరికీలాలుఁడు వాహినీపతి ప్రకాశించెను.

అనేకార్థకశబ్దముల కూర్పు శ్లేష. అది ప్రకృతానేక విషయము అప్రకృతానేకవిషయము ప్రకృతాప్రకృతానేకవిషయము నని త్రివిధము. సర్వదుఁ డిత్యాదులు క్రమముగ నుదాహరణములు. అందు 'సర్వదుఁడు మాధవుఁడు' అని స్తుతివిషయము లగుటచేఁ బ్రకృతములగు హరిహరులకీర్తనము ప్రకృతశ్లేష. అబ్జము కమలము అబ్జుఁడు చంద్రుఁడు అవి యుపమానమాత్రము లగుటచే నప్రకృతములకీర్తన మప్రకృతశ్లేష. వాహినీపతి=సేనాపతి, సముద్రుఁడును. వారిలో యుద్ధమున శత్రుప్రహారణములచే రక్త మోడుచున్న సేనాపతి వర్ణనమే ప్రకృతము. కనుక ప్రకృతాప్రకృతశ్లేష. మఱియు

" ఏ దయామయునిచే నపరాధి యయ్యు నండజ (పాము, కాకి ) మాదరింపఁబడెనో అపూతనామరణ ఖ్యాతుఁ డగు ప్రభువు మాకు శరణ మగుఁగాక. లుబ్ధశిలీముఖములచేనాకులితములు వనవృద్ధములు నగు కమలములకు

---

54. 1. త్రాతః కాకోదరో యేన ద్రోగ్ధాపి కరుణాత్మనా ।
పూతనామారణఖ్యాత స్స మేఽస్తు శరణం ప్రభుః ॥

కాకోదరశబ్ద ముభయార్థకముగఁ దెలుగున రాకపోవుటచే సామాన్య వాచకమును నప్రసిద్ధార్థకము నయ్యు, అండజపదములో చెప్పుట,

పూతనామరణఖ్యాతుఁడు = పవిత్ర నాముడు, రణప్రసిద్ధుడు (రాముడు) పూతన మరణముచేఁ బ్రసిద్ధుడు (కృష్ణుడు)

2. నీతా నామాకులీ భావం లుబ్ధైర్భూరిశిలీముఖైః
సదృశే వనవృద్ధానాం కమలానాం త్వదీక్షణే ॥

లుబ్ధశిలీముఖములు = కేటగాని బాణములు, ఆసక్తములగు తుమ్మెదలు. వనవృద్ధములు=అడవిలో పెరిగినవి, నీటిలో పెరిగినవి. కమలములకు=హరిణములకు, పద్మములకు.

నీకన్నులు సమానములు[3] ఉదయారూఢుఁడు కాంతి
మంతుఁడు రక్తమండలుఁడు ఈరాజు మృదులములగు
కరములచే జనమనోహరుఁ డగుచున్నాఁడు.

వీనిలో మొదటిదానియందు స్తుతివిషయు లగుటచేఁ బ్రకృతు లగు రామకృష్ణులకు శ్లేష. రెండవదానిలో నుపమానము లగుటచే నప్రకృతములగు పద్మహరిణములకు శ్లేష. మూఁడవదానిలో రాత్రి వర్ణన ప్రస్తావమునఁ బ్రకృతుఁడు నభినవోదితుఁడు నగు చంద్రునికి నప్రకృతుఁడు నభిషిక్తుఁడునగు రాజునకును శ్లేష.

ఇచ్చట ప్రకృతాప్రకృత శ్లేషోదాహరణమున శబ్దశక్తి మూల ధ్వనినంగీకరించు ప్రాచీనాలంకారికుల యభిప్రాయము, అప్రకృతార్థము కూడ శబ్దశక్తిచే ప్రతిపాద్యమై అభిధేయ మగుటచే వ్యంజన నపేక్షింపక పోవుటంబట్టి ప్రకృతా ప్రకృతాభిధాన మూలకోపమాద్యలంకారము వ్యంగ్యమనికాని అప్రకృతార్థమే వ్యంగ్యమను నభిప్రాయము కాదు.

యద్యపి ప్రకృతార్థము ప్రకరణబలమువలన శీఘ్రముగ బుద్ధికిఁ దోఁచినపిమ్మటనే నృపతి తద్గాత్రహ్యాధనాది వాచకములగు రాజకరాదిపద ముల యన్యోన్య సన్నిధాన బలమున వానివానిశక్త్యంతర వికాసముచే నప్రకృతార్థము స్ఫురించును. అట్లైనను అంతమాత్రముచే శక్తిచే నర్థము ప్రతిపాదింపఁబడుచుండగా నేవిధమునను వ్యంజననపేక్షింపక పోవుటవలన దానికి వ్యంగ్యత్వములేదు. ప్రకృతార్థాభిధానము ముగిసిన పిదప నప్రకృతార్థము తోఁచుచున్న దన్నచో నది మిక్కిలి గూఢశ్లేష యగుగాక. (గూఢశ్లేష=అప్రకృతమగుటచే ద్వితీయార్థము శీఘ్రముగ దోఁపకుండుట)

---

3. అసావుదయమారూఢః కాంతిమాన్ రక్తమండలః।
రాజా హరతి లోకస్య హృదయం మృదుభిః కరైః॥

ఉదయారూఢుఁడు = ఉదయపర్వతము నొందినవాఁడు, వృద్ధినొందుచున్న వాఁడు రక్తమండలుఁడు=ఎఱ్ఱనిబింబముకల, అనురక్తమగురాజ్యముకలవాఁడు. రాజు=చంద్రుఁడు, రాజు. కరములు=కిరణములు, పన్నులు

వేఱుచోటను గూఢశ్లేషయున్నది.    ఎట్లన,

" ఈకొండ అతిజరఠములు నతిగురువులు నలఘువిలంబి పయోధరోపరుద్ధములు నెల్లప్పుడు ప్రాణుల కగమ్యరూపములు పరిణత దిక్కరికలు నగు తటులను ధరించు చున్నది.

ఓషధిపతి సమీపమున లేకపోగా సూర్యకాంతములు మందాగ్ని నొందుచున్నవి. తమము పుష్టినొందుచున్నది. చూపులు తిమిరజన్యదోషము నొందుచున్నవి.

ఇచట సమాసోక్త్యుదాహరణములందు ప్రస్తుతార్థము సందర్భవశమున శీఘ్రముగ బుద్ధికి దోఁచినపిదప విశేషణసామ్యమువలన నప్రకృత మగు వృద్ధవేశ్యావృత్తాంతము, రోగివైద్యవృత్తాంతముకూడ తోఁచు చున్నదికదా ! అందు సమాసోక్తి అభంగశ్లేష యనుట యందఱకు నభిమతమే. ఇట్లితరస్థలములందును గూఢశ్లేషను ధ్వనిగాఁదలంపరాదు.

---

55. అయ మతిజరఠాః ప్రకామగుర్వీ రలఘువిలంబిపయోధరోపరుద్ధాః ।
సతత మసుమతా మగమ్యరూపాః పరిణతదిక్కరికా స్తటీర్బిభర్తి ॥

అలఘువిలంబి పయోధరోపరుద్ధములు=గొప్పగ వ్రేలాడు మబ్బులతోఁగూడినవి (చరియలు) గొప్పగ వ్రేలాడు స్తనములతో గూడినవారు (వృద్ధవేశ్యలు) అగమ్యరూపములు = పొందరానివి (చరియలు) సంగమమునకు దగనివారు వృద్ధవేశ్యలు. పరిణత దిక్కరికలు = తిర్యగ్దంతప్రహారము చేయు ఏనుఁగులు కలవి (చరియలు) ప్రకటముగు దంతక్షత నఖక్షతములు కలవారు వేశ్యలు.

2. మంద మగ్ని మధు రర్యమోపలాః దర్శితశ్వయథు చాభవ త్తమః ।
దృష్టయ స్తిమిరజం సిషేవిరే దోష మోషధిపతే రసన్నిధౌ ॥

ఓషధిపతి=చంద్రుడు, వైద్యుడు. మందాగ్ని=ప్రకాశము లేమిని, రోగవిశేషమును. తమము=చీకటి, శోధరోగము, తిమిరజన్యదోషము, కనబడకుండుట, తిమిరరోగము,

[56] ద్వారకయందు రమ్యములు కావున పతాకల నొందు
చున్నవి, వివిక్తలు కావున రాగమును వృద్ధి నొందించు
చున్నవియు, నమద్వలీకలు నగు వలభులను వయను
కాంద్రు వల్లభలతో సమముగ సేవించిరి.

ఇచట విభక్తిభేదముండుటచే ద్వితీయాంత విశేషణ ప్రతిపాదితను
లగు నర్థాంతరములకు శబ్దశక్తిచే వల్లభలతో నన్వయములేదు.

[57] అధిక పయస్సంపదను వహించునవి వాయుజ వేగముచే
సంక్షోభమునొందింపఁబడిన యీ గిరినిర్ఝరములు సంబద్ధ
రామలక్ష్మణను లగు వాల్మీకివాక్కుల సాధర్మ్యమును
ధరించుచున్నవి.

అనుచోట విభక్తిభేద మున్నను శ్లేషచే నాకర్షింపబడిన సాధర్మ్య
మున్నట్లు ఇచట సాధర్మ్యమున్ను కూర్పఁబడకపోవుటచే నాక్షిప్త శ్లేష
యగుటకును వీలులేదు. సమ మను క్రియావిశేషణ మున్నను నది
సహార్థమగుటచేత నుపపన్నమగుచు వల్లభలందు శ్లిష్టవిశేషణార్థాన్వ
యము కంటెఁ బూర్వమందు శీఘ్రముగఁ దోపనిదై సామ్యార్థము నొం
దదు. అందువలన నర్థసౌందర్యబలముననే వల్లభలందు శ్లిష్టవిశేష

---

56. రమ్యా ఇతి ప్రాప్తవతీః పతాకా రాగం వివిక్తా ఇతి వర్ధయంతీః।
యస్యామసేవంత నమద్వలీకాః సమం వధూభి ర్వలభీ ర్యువానః॥

పతాకలను=జండాలను, సౌభాగ్యములను. వివిక్తలు=నిర్జనములు, పవిత్రలు. నమద్వలీకలు=వంగిన ఛాదినీగుడ్డలుకలవి, (వాచూరులు) వంగినవళిత్రయముకలవారు వల్లభలు.

57. ఏతస్మి న్నధికపయః శ్రియంవహంత్యః సంక్షోభం పవనభువా జవేననీతాః।
వాల్మీకేరరహితరామలక్ష్మణానాం సాధర్మ్యం దధతి గిరాం మహాసరస్యః॥

అధికపయస్సంపదను=ఎక్కువనీటిని 'అధికపయః' అను పదమువ్యస్తమై వాల్మీకి వాక్కులం దన్వయించును-శ్రోతుల కథలుకలవని.

సంబద్ధ రామలక్ష్మణములు=భర్తలతోఁగూర్పబడిన పౌరసవనితలు కలవి, పక్షమున రామలక్ష్మణులకు చెందినవి వాక్కులు.

ణార్థాన్వయాను సంధానమని గూఢశ్లేషము. పిమ్మట శ్లేషబలముననే సమశబ్దమునకు సామ్యార్థకల్పనము కావున వాచ్యమే యగు నుపమాలంకారమున కీశ్లేష యంగ మగును. ఇంక విస్తరింపరాదు. అందు వలన శ్లేష త్రైవిధ్యము సిద్ధము

ఏవంచ శ్లేష ప్రకారాంతరముచేతను ద్వివిధము. ఉదాహరణ గతము లగు నబ్జ, కీలాల, వాహినీపత్యాది శబ్దములందు పరస్పరవిలక్షణ మగు పదభంగము నపేక్షింపక యనేకార్థముల క్రోడీకరించుటచే నభంగ శ్లేష. సర్వదుఁడు మాధవుఁడు, 'యోऽగంగాం' హరిణాహితస క్తి, ఇత్యాదిశబ్దములందు పరస్పర విలక్షణమగు పదభంగముచే ననేకార్థము లను గూర్చుటవలన సభంగశ్లేషయని. అందు సభంగశ్లేష శబ్దాలంకారము అభంగశ్లేష అర్థాలంకారము అని రుయ్యకాదులు. రెండును శబ్దాలంకారములే యని మమ్మటాదులు. రెండు నర్థాలంకారములే యని దీక్షితులు. దీని వివరము చిత్రమీమాంసయందుఁ జూడఁదగును.

## 27. అప్రస్తుత ప్రశంస

ప్రస్తుత వృత్తాంతవ్యంజక మగు నప్రస్తుతవృత్తాంతకథన మప్రస్తుత ప్రశంస యగును.

ఉ॥ ఇంద్రునొక్కనినే యాచించు నా చాతక మొక్కటే
శకుంతములలో ధన్యము

ఎచట నప్రస్తుతవృత్తాంతవర్ణనము ప్రస్తుత వృత్తాంతమును బోధించుటలోఁ బర్యవసాన మొందునో యచట నప్రస్తుత ప్రశంసాలంకారము. అప్రస్తుత వర్ణనముచే బ్రస్తుత వృత్తాంతావగమనమున్ను ప్రస్తుతా ప్రస్తుతములకు సంబంధ ముండినచే సంభవించును. ఆసంబంధము సారూప్యముగాని సామాన్య విశేషభావముగాని కార్యకారణభావముగాని యగు చున్నది. అందు సామాన్యవిశేషభావములో సామాన్యమువలన విశేష

బోధనము, విశేషమువలన సామాన్యబోధనమునని రెండువిధములు. ఇట్లే కార్యకారణభావమందును గార్యమువలనఁ గారణబోధనము, కారణము వలనఁ గార్యబోధనము నని రెండువిధములు. సారూప్యమందొక్క భేదమే కావున నీయప్రస్తుతప్రశంస యైదువిధములు. [1] కార్యము, ప్రస్తుతము కాగా కారణమును బోధించుట, [2] కారణము ప్రస్తుతముకాగా కార్యమును బోధించుట, [3] సామాన్యము ప్రస్తుతముకాగా విశేషమును బోధించుట, [4] విశేషము ప్రస్తుతముకాగా సామాన్యమును బోధించుట, [5] తుల్యము ప్రస్తుతముకాగా తుల్యమును బోధించుటయు నని యైదు విధములు చెప్పియున్నారు. అందు సారూప్యనిబంధనా ప్రస్తుత ప్రశం సోదాహరణము 'ఆచాతక మొక్కటే' యనునది. ఇచట నప్రస్తుత మగుచాతకము యొక్క ప్రశంస, ప్రశంసార్హుఁడగుటచేఁ బ్రకృతుఁడు చాతక సదృశుఁడు నగుక్షుద్రుల నడుగనొల్లని మానవంతునియందుఁ బర్యవసాన మొందుచున్నది. మఱియు,

> [58] కృత్రిమముగ గూర్పఁబడిన సటలతో జటిల మగు నంస
> భిత్తి కలశునకము మృగరాజ పదవియం దారోపింపఁబడి
> నను మదకుంభి కుంభముల విదళింప నురుకు మృగాధి
> పతియొక్క నాదము నెట్లుచేయగలదు ?

ఇచట శునకనింద, నిందార్హుఁడగుటచేఁ బ్రకృతుఁడు శునకసదృశుఁడు కృత్రిమ వేషవ్యవహారాదిమాత్రముచే విద్వాంసునివలె నటించుమూర్ఖుని యందుఁ బర్యవసాన మొందుచున్నది. మఱియు,

> [59] లోపల నెక్కువఛిద్రములు వెలుపల నెక్కువ కంటక
> ములుంగల కమలనాళగుణములు భంగశీలము లెట్లు
> కాకుండును ?

---

58. అబద్ధకృత్రిమసటా జటిలాంసభిత్తి
రారోపితో మృగపతేః పదవీం యది శ్వా
మత్తేభకుంభ తటపాటనలంపటస్య
నాదం కరిష్యతి కథం హరిణాధిపస్య

59. అంతశ్ఛిద్రాణి భూయాంసి కంటకా బహవో బహిః ।
కథం కమలనాళస్య మాభూవన్ భంగురా గుణాః ॥

ఇచట కమలనాళవృత్తాంతకీర్తనము కమలనాళసదృశునందు, బయట ఖలులు బాధించుటకు కాచుకొనియుండ నింటఁ బుత్త్రాదులతోఁ గల హించు పురుషునందుఁ బర్యవసాన మొందుచున్నది. ఇట్టి లక్ష్యలక్షణ ములందు ప్రశంసాశబ్దము స్తుతి, నిందా, స్వరూపకథన, సాధారణ మగు కీర్తన మాత్రపరముగా నెఱుఁగవలెను. సామాన్య నిబంధనా ప్రస్తుతప్రశంస:—

క్రోధముతోఁ గూడినశత్రువుఁనుపేక్షించునరులు పొద
యందగ్ని నుంచి గాలివాలుగా నిద్రించుచున్నారు.

ఇచట పూర్వమే విరోధియగు శిశుపాలునందు రుక్మిణీహరణాదికముచే వైరమును దృఢ పఱచుకొన్న కృష్ణునికి శిశుపాలుని విషయమై యుదా సీనత తగ దని చెప్పఁదగిన విశేషార్థము ప్రస్తుతమై యుండ దానిం దెల్పు టకు సామాన్యార్థము చెప్పఁబడినది. మఱియు,

"బహుళభంగుల భిన్నములగు సౌహార్ద స్వర్ణ రేఖల బరీక్షిం
చుటకు బరోక్ష మను గీటుఱాయొకటి కలదు.

ఇచట నీ వెదుటవలెఁ జాటునను నాకు హితమాచరింతువేని నప్పుడు నీవు నిక్కమగు సఖుఁడ వని విశేష మగు ప్రస్తుతము చెప్పవలసియుండ సామాన్యము చెప్పఁబడినది.

విశేషనిబంధనాప్రస్తుతప్రశంస:—

అంకాధిరోపితమృగుఁడు చంద్రుఁడు మృగాంకుఁ డని
చెప్పఁబడు చున్నాఁడు. నిష్ఠురక్షిప్త మృగవ్రాతము
సింహము మృగాధిప మనఁబడెను.

ఇచట కృష్ణునుద్దేశించిన బలభద్రవాక్యము మార్దవదూషణపరము కాగాఁ బూర్వసందర్భమును బట్టి క్రూరుఁడే ఖ్యాతి నొందునుగాని మృదుశీలుఁడు ఖ్యాతి నొందఁ డనుసామాన్యము చెప్పవలసియుండఁ

59. సౌహార్దస్వర్ణరేఖాణా ముచ్చావచభిదా జుషామ్ ।
పరోక్ష మితి కోప్యస్తి పరీక్షానికషోపలః ॥

దద్యోధనకై యప్రస్తుత మగు విశేషము చెప్పబడినది. ఇట్లే బృహత్కథాదులందు సామాన్యముగ నొకానొకయర్థమును ప్రస్తుతముగాఁ జేసికొని దానిని వివరించుటకై చెప్పిన యప్రస్తుత కథావిశేషో దాహరణములం దీయప్రస్తుత ప్రశంసాలంకారమే యని యెఱుంగవలెను.

కారణ నిబంధనాప్రస్తుతప్రశంస: —

" బ్రహ్మ దమయంతీ వదన నిర్మాణముల కిందుమండలము
నుండి సారమును హరించెఁగాబోలు నందుచేతనే మధ్య
బిలమునుండి యాకసపు నలుపు కనబడుచున్నది.

ఇచట నప్రస్తుత మగు నిందుమండలగతముగా నుత్ప్రేక్షింపబడిన, దమయంతీ వదననిర్మాణమున కగు సారాంశహరణ రూపకారణముచే తత్కార్యరూపము, వర్ణనీయ మగుటచేఁ బ్రస్తుతము, దమయంతీ వదన గతము నగు లోకోత్తర సౌందర్యవిశేష మూహింపఁబడుచున్నది. మఱియు, నా వరదరాజ స్తవమందు

" ప్రతిమాసమందు వేఱగు చంద్రులు నీపాదము నాశ్ర
యించి దేహక్షయము కాగా లబ్ధమగు దివ్యపదమున
కభిముఖులై లావణ్య మను పుణ్యరాశిని మిత్ర మగు
నీమోమునం దుంచి సూర్యునిఁబొందుచున్నారు, నిజము.

ఇచట నప్రస్తుత చంద్రకర్తృకముగా నుత్ప్రేక్ష్యమాణము లావణ్య పుణ్య విన్యాసరూపము నగు కారణముచేఁ దత్కార్యము, అనన్యముఖ

---

60. హృతసార మివేందుమండలం । దమయంతీవదనాయ వేధసా ॥
కృతమధ్యబిలం విలోక్యతే । ధృతగంభీరఖనీఖనీలిమా ॥

61. ఆశ్రిత్య నూన మమృతద్యుతయః పదం తే
దేహక్షయోపనత దివ్యపదాభిముఖ్యాః ।
లావణ్యపుణ్యనిచయం సుహృది త్వదాస్యే
విన్యస్య యాంతి మిహిరం ప్రతిమాసభిన్నాః ॥

సాధారణమునగు ననంతకోటి చంద్రలావణ్యము, భగవన్ముఖమందున్నట్లు చెప్పుటచేఁ బ్రస్తుతముగాఁ దెలియుచున్నది. (దానినే వివరించుచున్నాఁడు)

చంద్రుఁడు పుట్టినప్పుడెల్లఁ గ్రొత్తయగుచున్నాఁడు. (నవోనవో భవతి జాయమానః) అను మంత్ర సామర్థ్యమువలనగాని వృద్ధిక్షయములచే భేదము లేకున్నను భేదాధ్యవసాయమువలనఁగాని ప్రతిమాసము వేఱుగ వర్ణింపఁబడినాఁడు. అందుచేఁ గాల మనాది కనుక అతీత చంద్రు లనంతకోటు లని తేలినది. ఆసమస్త చంద్రుల విష్ణుపద (ఆకాశ) సమాశ్రయణము శ్లేషమహిమచే భగవంతుని చరణసమాశ్రయముగ నధ్యవసానము చేయఁబడినది. భగవంతుని పాదముల నాశ్రయించిన వారికి దేహక్షయము కాఁగాఁ బరమపదప్రాప్తి యభిముఖ మగుట, అప్పుడే తన మిత్రవర్గమునందు పుణ్యరాశినుంచుటయుఁ బిమ్మట సూర్య మండల ప్రాప్తియు నను నీసర్వము శ్రుతి (తత్సుకృత దుష్కృతే విధూనుతే తస్య ప్రియా జ్ఞాతయ స్సుకృతముపయం త్యప్రియా దుష్కృతం) వలన సిద్ధము కావున తదనుసారముగా వారి కమావాస్యారూపదేహ క్షయకాల మాసన్నముకాగా సూర్యమండల ప్రాప్తికిఁ బూర్వము ప్రత్యక్షసిద్ధ మగు పుణ్యరూప లావణ్యానాశమును నిమిత్తముగాఁ జేసికొని చంద్రసాదృశ్యముచే బరిపుష్టసౌహార్దముకల భగవన్ముఖమందు లావణ్యముంచు టుత్ప్రేక్షింపఁబడినది. యద్యపి మిత్రు లధికముగ నుండిన నల్పపుణ్యమే సంక్రమించును. అయినను నిచట మిత్ర మను నేకవచనముచే భగవంతుని ముఖమున కితరముఖములకంటె నతిశయము వెల్లడింపఁబడినది. అందువలన భగవన్ముఖముననే సకల చంద్రుల సమస్తలావణ్య పుణ్యవిన్యాసము నుత్ప్రేక్షించుటచేఁ బూర్వమున వర్ణింపఁబడిన ప్రస్తుతార్థము స్పష్టముగనే తెలియుచుండెను. ఆలోచింపగ శ్రుతియందు సూర్యమండల ప్రాప్త్యనంతరమున విరజానదీతరణము, దానితరువాతనే సుహృదులందు సుకృతసంక్రమణము ననియున్నను

నాత్మప్రతిపాదక శాస్త్రమునందలి ప్రయోజనానుకూలముగా దానికి బూర్వపరీభావమును మార్చి 'మిత్రునం దంచి మిహిరునిఁ బొందు చున్నార' ని చెప్పఁబడినది.

కార్యనిబంధనా ప్రస్తుత ప్రశంస:—

"నాథ ! నీపాదనఖధావనోదకమునం (గంగలో) బడిన నఖ కాంతికణికలు సముద్రమునఁగలిసి జలధిమథనముచే గట్టిపడి చంద్రపదము నొందినవి, నిజము.

ఇచట భగవత్పాదాంబుజక్షాళన తోయరూప మగు గంగయందు లత్తుకరసమువలె గలిసి, దానితో సముద్రమునఁ బ్రవేశించిన భగవత్పాద నఖకాంతికణికల పరిణామముగనూహింపఁబడినదియు, సముద్రనవనీతపద వాచ్యము కార్యము నగు చంద్రునిచేఁ దత్కారణ మగు భగవత్పద నఖ కాంత్యుత్కర్ష ప్రతీయమాన మగుచుండెను. మఱియు,

"ఈకామిని గమనసౌకుమార్యమును గాంచినచో హంస గర్వమును వీడును. మాటల వినినచోఁ గోయిల మౌన ముద్ర వహించును. శరీరమార్దవమును జూచి నచో మాలతి కఠినశిలాసదృశ యగును. వేయేల ? కాంతినిఁ గాంచినచో కమల కాషాయమును గట్టును.

ఇచట నాయికాగమన సౌకుమార్యాదులు వర్ణనీయ మగుటచేఁ బ్రస్తుతములు కాగా నుచితముగ నుత్ప్రేక్షింపఁబడిన హంసగత గర్వ

---

62. నాథ త్వదంఘ్రినఖధావనలోయలగ్నాః స్తత్కాంతిలేశకణికా జలధిం ప్రవిష్టాః।
తా ఏవ తస్య మథనేన ఘనీభవంత్యోనూనం సముద్రనవనీతపదం ప్రపన్నాః॥

63. అస్యాశ్చేద్గతిసౌకుమార్యమధునా హంసస్య గర్వైరలం
సంలాపో యది ధార్యతాం పరభృతైర్వాచంయమత్వవ్రతం।
అంగానా మతికోరతా యదిదృషత్ప్రాయైవ సా మాలతీ
కాంతిశ్చేత్కమలా కిమత్ర బహునా కాషాయ మాలంబతాం॥

కాంత్యాది రూపకార్యము లభిహితములు. ఇవియుఁ జెప్పట్లు హారణమునందువలె గతిసౌకుమార్యాదిరూప వస్తుకార్యములు కాక తన్నిరీక్షణాదులకార్యము లగుచున్నవి.

> తిర్యగ్జంతువుల చిత్తమునందు సిగ్గుండినచో చమరీమృగములు పార్వతీకేశపాశమును బరికించి వాలములందు వాత్సల్యమును వదలుకొనును. సందియము లేదు.

అను నుదాహరణాంతరమందును నిరీక్షణకార్యమగుటే స్పష్టము. శరీరమార్దవ మను మూఁడవ వాక్యమునందు వర్ణనీయాంగ సౌకుమార్యాతిశయ నిరీక్షణకార్యత్వముకూడ, ప్రతియోగి విశేషగత (వేఱువస్తువు సందున్న) కాఠిన్యము అంగసౌకుమార్యాతిశయ జ్ఞానకార్యమే కాని యంగసౌకుమార్యాతిశయ కార్యము కాకపోవుటంబట్టి కఠినశిలాప్రాయత్వ రూపార్థలబ్ధమగు మాలతీకఠోరతయందు వివక్షింపఁబడలేదు ఈబుద్ధి కార్యత్వమున్ను 'నీయంగమార్దవముచూడగా' ఇత్యాది తుల్యరూపోదాహరణమందును నిరీక్షణకార్యమగుటే స్పష్టము.

"అర్థకార్యమందువలెనే బుద్ధికార్యమందును గార్యనిబంధనత్వముండకపోదని ప్రాచీను లిట్టివి (జ్ఞానకార్యములు) కార్యనిబంధనాప్రస్తుతప్రశంసయందుదాహరించిరి. నిజమున కప్రస్తుతప్రశంసయందు సంబంధపంచకముకంటె నధిక మున్ననుదోషములేదు. అప్రస్తుతప్రశంస సంబంధాంతరములందును నుండుటచే ప్రస్తుతాప్రస్తుతముల కైదువిధములే సంబంధములని నియమింపసాధ్యము కాదుకదా! ఎట్లన,

---

౮౪. ఓయి! కార్యరూపాప్రస్తుతార్థ మెఱటఁ ప్రస్తుతకారణమును దోఁగఁ జేయునో యది కార్యనిబంధనాప్రస్తుతప్రశంస యని చెప్పఁబడును. ఈదాహరణము లం దట్లుండుట లేదు. మాలతీకఠోరత్వాది రూపాప్రస్తుతార్థము అంగమార్దవము యొక్క కార్యము కాదని నీవే చెప్పితివికదా! ఇట్లే ప్రస్తుతమగు కామినీగమన సౌందర్యాతిశయాదికముయొక్క నిరీక్షణమే కారణ మగుటచేతను స్వరూపముతో కామినీగమనవిష్ఠ సౌందర్యాతిశయాదికము కారణము కాకపోవుటంబట్టియు అని శంకించినఁ జెప్పుచున్నాఁడు.

నాత్మప్రతిష్ఠారీ ! నీనిట్టూర్పు గాలిచే నిబుసముగఁ జేయఁబడిన
స్మితరూప తాపత్రయౌషధపు పొల్లుపోగువలె నీ చంద్ర
కిరణములు లోకమంతటను వ్యాపించు చున్నవి.

ఇచట నప్రస్తుతము లగు చంద్రకిరణములు భగవంతుని మందస్మిత రూప మగు దివ్యౌషధీ ధాన్యవిశేషముయొక్క పొల్లుపోగుగా నుత్ప్రేక్షించుటచే భగవంతుని మందస్మితము చంద్రకిరణ సారరూప మను నొక యుత్కర్ష తెలుపఁబడుచున్నది. ధాన్యవిశేషమునకు పొల్లుపోగునకు కార్యకారణభావసంబంధములేదు. అందుచే సహోత్పత్త్యాదిక మను సంబంధాంతరమునుగూడ నాశ్రయింపవలసినదే.

ఇట్లుపమానోపమేయ పదార్థముల నాశ్రయించి వానిలోఁ ప్రౌఢోక్తికల్పిత కార్యకారణభావ నిబంధనరూపాప్రస్తుత ప్రశంస హరింపఁబడినవి. మఱొకచోటఁగూడ నిది కనఁబడుచున్నది.

"కాళిందీ! చెప్పుము. కుంభోద్భవ! నేనంబుధిని, శాశ్వ
పేరుతో నన్నేల పిలుచుచున్నావు? నేను నర్మదను,
నా సవతిపేరుతో నన్నేల పిలుతువు? నీవు నర్మదవైన
నీకీ నైల్య మేల కలిగెను? మాళవాంగనల కాటుకకంటి
నీటిచేత. వారికేమివచ్చెను? కుంతలదేశపురాజు
కోపించెను.

---

65. తాపత్రయౌషధవరస్య తవస్మితస్య నిశ్వాసమందమరుతా నిబుసీకృతస్య।
ఏతే కడంగరచయా ఇవ విప్రకీర్ణా జైవాతృకస్య కిరణా జగతి భ్రమంతి॥

సముద్ర నర్మదల సంవాదమిది. అందు సముద్రుడు నర్మదనుజూచి కాళింది యనుభ్రాంతితో కాళింది! యని పిలువవది కోపమున సాభిప్రాయముతో జవాబిచ్చుట.

66. కాళింది బ్రూహి కుంభోద్భవ, జలధి రహం నామగృహ్ణాసి కస్మాత్
శత్రోర్మే నర్మదాహం త్వమపి వదసి మే నామ కస్మాత్సపత్న్యాః।
మాలిన్యం తర్హి కస్మాదనుభవసి మిళత్కజ్జలై ర్మాళవీనాం
నేత్రాంభోభిః కిమాసాం సమజని కుపితః కుంతలక్షోణిపాలః॥

ఇచట వారి కేమివచ్చెనని మాళవాంగనల రోదన కారణ మడుగ వారిప్రియ మరణరూపకారణమును జెప్పక కుంతలుఁడు కోపించెనని ప్రియుల మరణమునకుం గారణమును జెప్పుటచేఁ గారణ నిబంధనాప్రస్తుత ప్రశంస. మాళవదేశమున కేగిన కుంతలరాజు వారిని జయించెనా? యని యడుగ వారి మరణానంతరమున జరిగిన జలధి నర్మదల ప్రశ్నోత్తర రూపకార్యము చెప్పఁబడినచో నిచటనే కార్యనిబంధనయు నగును. కారణనిబంధన యందు ప్రశ్న శాబ్దము. ఇందు ప్రశ్న మార్థము నని భేదము.

## 28. ప్రస్తుతాంకురాలంకారము.

ప్రస్తుతవర్ణనము ప్రధానముగు నింకొకప్రస్తుతమును వ్యం
జింపఁ జేసినచోఁ బ్రస్తుతాంకురమగును.

భృంగమా ! మాలతి యుండఁ గంటకములతో గూడిన
కేతకి కొఱకేల యాసపడుదువు ?

ఎచట వర్ణ్యమాన మగుప్రస్తుతముచే నభిమత మగు వేఱొక ప్రస్తుతము తోచునో యచటఁ బ్రస్తుతాంకురము. ఉత్తరవాక్య ముదాహరణము. ఇచట ప్రియతమునితో నుద్యానమున విహరించు నొకయువతి భృంగమునుగూర్చి యిట్లు చెప్పెను. కావున వాచ్యార్థము ప్రస్తుతమయ్యెను. మాధ్యాదికమువలన పిలువరానిభృంగమును బిలుచుటచే వాచ్యము కాకపోవుటవలన నప్రస్తుతమేయగు వాచ్య మిచట స్వానదృశ మగు ప్రస్తుతమును బోధించుటకై చెప్పఁబడిన దనుటకు వీలులేదు. భృంగాదులం బిలుచుట, లోకమందు కలదు కదా!,

పథిక శాఖోటక తరువుల సంభాషణము చూడుము.

ఓయి ! నీవెవరవు ? చెప్పుచున్నాను. నన్నుదృష్టశూన్య
మగు శాఖోటకముగా నెఱుంగుము. వైరాగ్యముతో
చెప్పుచున్నట్లున్నదే ? బాగుగా గ్రహించితివి. ఎందు

[67] చేత నీవై రాగ్యము ? ఇక్కడ దారికెడమవై పుగ వట
వృక్ష మున్నది. పాంథులు దాని నన్నివిధముల సేవిం
తురు. దారిలోనున్నను నానీడకూడ పరోపికారి కాజాల
కున్నది. ( దానిమీఁద దయ్యము లుంటఁగాఁబోలు )

అనుచో చేతనాచేతన ప్రశ్నోత్తరమువలె తిర్యక్కులం బిలుచుటయు నసంభావితము కాకపోవుటంబట్టి యిట్లు ప్రస్తుతము వాచ్యార్థము నగు భృంగోపాలంభమువలన గ్రూరులు చుట్టుకొనియుంటచే దుష్ప్రాప యగు పరవనితతోడగాని, విటసర్వస్వాపహారణ శీలయగుటచే పొందరాని వేశ్యతోఁగాని కంటకములతో నిండిన కేతకి సదృశయగు దానితోఁ బ్రవర్తించు ప్రియతము నుద్దేశించి కులాంగన, సౌందర్యాభిమానవతియు నగు వత్రిచేసిన యుపాలంభము తెలుపఁబడుచున్నది. మఱియు,

[68] ఓభ్రమరమా! రారాపు నోర్చు సుమనోలతలందు, అంత
వరకు లోల మగు మనసును సంతోషపెట్టుము. బాలయు
నజాతరజస్కయు నగు నవమల్లికా కలిక నకాలమున
వ్యర్థముగ నేలపీడింతువు ?

ఇచటను నుద్యానమధ్యమునఁ జరించుచున్న భృంగమును గూర్చిన యుపాలంభ మగుటచే వాచ్యార్థముకూడఁ బ్రస్తుతము. ఇదియుఁ బ్రౌఢాంగనలుండగా బాలికను రతికై బాధించు కామి వినుచుండగా

---

67. కస్త్వం భోః కథయామి దైవహతకం మాం విద్ధి శాఖోటకం
వైరాగ్యాదివ వక్షి సాధువిదితం కస్మాదిదం కథ్యతే।
వామేనాత్ర వటస్తమధ్వగజనస్సర్వాత్మనా సేవతే
నచ్ఛాయాపి పరోపకారకరిణీ మార్గస్థితస్యాపి మే ॥

68. అస్యాను తావదుపమర్దసహాసు భృంగ
లోలం వినోదయ మనస్సుమనోలతాసు।
బాలామజాత రజసం కలికామకాలే
వ్యర్థం కదర్థయసి కిం నవమల్లికాయాః॥

నొకానొక విదగ్ధ చెప్పుటచే నాకామింగూర్చి యుపాలంభము తెలియు చున్నది. మఱియు

[69] ‘ఈనళిని కాదంబచంచుక్షతమగు కోశద్వంద్వమును ధరించు చున్నది. ఈచూతలత పుంస్కోకిలాస్వాదిత మగు కిసలయమును ధరించుచున్న’ దని దీర్ఘికాతటమం దొకరితో నొకరు చెప్పుకొనుచున్న సఖులవాక్యము విని, యా యువతి కొంగుతోఁ గుచతటమును, గరమున నోష్ఠమును గప్పుకొనెను.

ఇచట ఈ యని నళినీవ్యక్తివిశేషమును జూపుటచేతను దిగుడు బావియొద్దున అనుమాటచేతను వాచ్యార్థము ప్రస్తుతమగుట స్పష్టము. ప్రస్తుతాంతరమున్ను వాక్యోత్తరభాగమందు కవిచే స్వయముగనే వెల్లడింపఁబడినది.

ఇందులో మొదటి రెండుదాహారణములందు నన్యాపదేశ ధ్వని యని లోచనకారుఁ డనెను. (దానినే చెప్పుచున్నాఁడు) అప్రస్తుత ప్రశంసలో వాచ్యార్థ మప్రస్తుతముకావున వర్ణనీయము కాకపోవుటచే నచట నభిధ పర్యవసన్నము కాకపోగా నభిధచే ప్రస్తుతార్థ మభివ్యక్త మగుట యలంకారము. ఇచటనో, వాచ్యము ప్రస్తుత మగుటచే నభిధాశక్తి సమాప్తి నొందగా నర్థసౌందర్యబలముచే నభిమతార్థము వ్యక్త మగుట ధ్వనియే యగును. నిజమున కిదియు నలంకారమేకాని ధ్వని కాదని చిత్రమీమాంసయందు [70] వ్యవస్థ చేయఁబడినది.

---

69. కోశద్వంద్వమియం దధాతి నళినీ కాదంబచంచుక్షతం
ధత్తేచూతలతా నవం కిసలయం పుంస్కోకిలాస్వాదితం।
ఇత్యాకర్ణ్య మిథస్సఖీజనవచస్సా దీర్ఘికాయా స్తటే
చేలాంతేన తిరోదధే స్తనతటం బింబాధరం పాణినా॥

70. వాచ్యము ప్రస్తుత మయ్యు నదే ముఖ్యమును తాత్పర్యము లేక పోవుటచే నభిధ సమాప్తము కాకపోవుటంబట్టి యలంకారమే యనివ్యవస్థ.

తృతీయోదాహరణ మలంకారమగుటలో నెవరికి నభ్యంతరము లేదు. ధ్వనికారుఁడు చెప్పియున్నాఁడు.

శబ్దార్థశక్త్యా చే సంపాదితమయ్యు వ్యంగ్యార్థమును కవి తిరిగి యెచట స్వోక్తిచే వెల్లడించునో యది ధ్వనికంటె వేఱగు నలంకారమే యని.

ఇవి సారూప్యనిబంధనోదాహరణములు.

సంబంధాంతర నిబంధనములగు ప్రస్తుతాంకురములఁగూడ వాచ్యవ్యంగ్యము లతిశక్తముసఁ బ్రస్తుతము లగుటచే నుదాహరింపఁదగిన వానిని దిఙ్మాత్రముగ నుదాహరించుచున్నాఁడు.

71 ఉ॥ ఓకన్నులారా! శివరాత్రి సమీపించుచున్నది. మీ రప్రమత్తములై మెలకువగ నుండుఁడు. మీదగ్గర మీవంటి మిత్రుఁడొకఁ డుదయింపఁగలఁడు.

ఇచట శివసారూప్యమువలెనే దానిలో నేకదేశమగుటచే నుదాహరణమందు వాచ్యమగు లలాటలోచనముకూడ శివరాత్రిమాహాత్మ్యప్రయుక్తమగుటచే వర్ణనీయము కావున తద్ద్వారముగ శివసారూప్య మంతయు గమ్యము. (ఇచట నేకదేశైకదేశభావము సంబంధము.) మఱియు,

ఓసర్వమంగళా! నీ కేశపాశపు చీకటికాంతుల పుంజముచే బందీకృతమగు బాలార్కకిరణముంబోలెనున్న సింధూ

---

71. రాత్రిశ్శివా కాచన సన్నిధత్తే విలోచనే జాగరతమప్రమత్తే
సమానధర్మా యువయోస్సకాశే సఖా భవిష్యత్యచిరేణ కశ్చిత్ ॥

72. వహంతీ సింధూరం ప్రబల కబరీ భారతిమిర
ద్విషాం బృందైర్బందీకృతమివ నవీనార్కకిరణం
తనోతు క్షేమం నస్తవ వదనసౌందర్యలహరీ
పరీవాహస్రోతస్సరణిరివ సీమంతసరణిః ॥

రమును ధరించు నీవదన సౌందర్యలహరీ నిర్గమనమార్గ
మనునట్లున్న నీపాపట మాకు క్షేమముఁ గలిగించుఁగాక.

ఇచట వర్ణనీయ మగుటచేఁ బ్రస్తుతమగు పాపటను వదనసౌందర్య ప్రవాహమునకు నిర్గమనమార్గము (పొల్లుకలింగలు) గ నుత్ప్రేక్షించుటచే నిండు చెరువువలెఁ దూముకుఁ గారణమై తనచోట నిముడని సౌందర్య సమృద్ధి తోఁచుచున్నది. వదన సౌందర్యముకూడ వర్ణనీయమగుటచేఁ బ్రస్తుతమే. మఱియు,

[73] అంగమును గప్పు నంబుజకాండము భృంగకాంతి నొందు
చున్నది. శ్వాసానిలమువలన నాసామౌక్తిక మింద్ర
నీలమణి యగుచున్నది. కుచములం దుంచిన కర్పూరము
కూడ దీపమగుచున్నది. కరములందు ధారగఁబోసిన
నీరు కాలిన యినుమునందలి నీటివలె హరించుచున్నది.

ఇచటనాయికావిరహాసహత్వాతిశయమును బ్రకటించుటకై సంతాప కార్యములగు మృణాళమాలిన్యాదులును వర్ణనీయములుగ వివక్షింపఁ బడుటచే వానిమూలమున సంతాపము గ్రహింపఁదగినది.

ఏ కావ్యమునఁ గార్యమూలమునఁ గారణబోధ గూర్పబడునో యచట ననుమానాలంకారమేకాని యీ ప్రస్తుతాంకురాప్రస్తుతప్రశంస లుండవు ఎట్లన,

పైరెం డుదాహరణములందును గార్యమూలమున సౌందర్య వృద్ధి సంతాపాధిక్యరూపకారణముల నూహింపవలెను.

---

73. అంగాసంగి మృణాళకాండమయతే భృంగావళీనాం రుచిం
నాసామౌక్తిక మింద్రనీలసరణిం శ్వాసానిలాద్గాహతే।
దత్తేయం హిమవాలుకాపి కుచయోర్దత్తే క్షణం దీపతాం
తప్తాయః పతితాంబువత్ కరతలే ధారాంబు సంలీయతే॥

పీన స్తన జఘనముల పీడనముచే నుభయభాగములందు వాఁడినది, తనుమధ్యము తగులక నడుమునఁ బచ్చనిది, చిక్కనచేతుల కదలికచేఁ జెదరిన తామరాకుసెజ్జ, కృశించిన సాగరికా సంతాపము నూహింపఁజేయుచున్నది.[74]

## 29. పర్యాయోక్తము.

గమ్యమగు విషయమును వేఱువిధముగఁ జెప్పుట పర్యాయోక్తము.

ఉ॥ రాహువధూకుచముల వ్యర్థమొనరించినవానికి నమస్కారము.

గమ్యముగ వివక్షింపఁబడినదానినే వివక్షితరూపముకంటె సుందరతరమగు రూపాంతరముతోఁ జెప్పుట పర్యాయోక్తమగును. ఉత్తరవాక్యముదాహరణము. ఇచట భగవంతుఁడు వాసుదేవుఁడు తన యసాధారణరూపముతో గమ్యుఁడై యాతఁడే రాహువధూకుచ వైయర్థ్యకారకుడను రూపాంతరముతోఁ జెప్పబడెను. మఱియు,

[75] ఎవనిపాదము లోకమును జూచునో యాలోక మెవని పాదమును జూడదో వారిద్దఱు గూడ జగద్గురు వగు నీ విద్య నెఱుఁగరు.

ఇందు గౌతమ పతంజలులు తమ యసాధారణరూపముల గమ్యులై రూపాంతరములతోఁ జెప్పఁబడిరి. మఱియు,

---

74. పరిమ్లానం పీన స్తనజఘనసంగాదుభయత
స్తనోర్మధ్యస్యాంతః పరిమిలనమప్రాప్య హరితం।
ఇదం వ్యస్తన్యాసం శ్లథభుజలతాక్షేపవలనైః
కృశాంగ్యాస్సంతాపం వదతి నలినీపత్రశయనం॥

75. లోకం పశ్యతి యస్యాంఘ్రిః స యస్యాంఘ్రిం న పశ్యతి
తాభ్యామప్యపరిచ్ఛేద్యం విద్యా విశ్వగురో స్తవ॥

76 ఓనల! నీకటికిడెందము శిరీషకోరకపు మార్దవాభిమానము
నణంచు నీపాదముల నెంతదూరము ప్రయాసపెట్టఁ దలఁ
చినది ? తెలుపుము.

ఇచట నెంతదూర మేగఁదలంపను గమ్యమాన విషయమే పాదముల నెంతదూరము ప్రయాసపెట్టదలంపు అనువిధముగఁజెప్పబడినది. మఱియు,

77 ఎవని కంబుధి నిషంగము. లోకప్రసిద్ధులు వ్యాసాదు
లెవని వాహనముల వహింతురు, పాతాళమెవనికి భూష
ణముల పెట్టె, ఆకాశము పూదోట, ఇంద్రాదులు కోటీ
పాలురు మదనుఁడు చందనతరువు నాగునో, అట్టి దేవతా
సార్వభౌమునకు నమస్కరించు చున్నాను.

ఇచట నెవనికి వేదములు వాహనములు నాగములు భూషణములు నిత్యాది ఆయావాక్యార్థముల వివక్ష కలుగుచుండగా వేదత్వాద్యా కారమున వ్యంగ్యములే యగు వేదాదులు వ్యాసాది శిక్షణీయత్వాది రూపమునఁ జెప్పఁబడినవి. ఇంతేకాక దేవతాసార్వభౌముఁ డగుటను స్పష్టపఱచుటకు విశేషణవిశేష్యభావవ్యత్యాసముచేఁ దెలుపఁబడినవి.

ఈ విషయమున నలంకారసర్వస్వకారుఁడును "గమ్యమునే వేఱు విధముగఁజెప్పుట పర్యాయోక్తము" అను నీ సంప్రదాయాగత లక్షణ మునే యంగీకరించెను, కాని

---

76. విశేద్యతాం హంత సమాపతుంతా శిరీషకోశమ్రదిమాభిమానం ।
పాదౌ కియద్దూరమిమౌ ప్రయాసే నిధిత్సతే తుచ్ఛదయం మనస్తే

77. దేవం వందే శరధి శరధిం దేవతాసార్వభౌమం
వ్యాసప్రష్ఠా భువనవిదితా యస్య వాహాధివాహాః ।
భూషాపేటీ భువనమతలం పుష్కరం పుష్పవాటీ
శాటీపాలాశ్శతముఖముఖాశ్చందనద్రుర్మనోభూః ॥

[78] ఎవఁడు చక్రపుదెబ్బయను కఠినశాసనముచేతనే రాహు
వధూజనమునకు రతోత్సవము నాలింగనాదిశూన్య
ముగను జుంబనమాత్ర శేషముగను జేసెను.

---

78. చక్రాభిఘాతప్రసభాజ్ఞయైవ చకార యో రాహువధూజనస్య ।
ఆలింగనోద్దామవిలాసవంధ్యం రతోత్సవం చుంబనమాత్రశేషమ్॥

ఈ పద్యవిషయమున ఉద్భటానంద వర్ధనాభినవగుప్తమమ్మట రుయ్యక దీక్షిత జగన్నాథాద్యాలంకారిక బృందమునకు పర్యాయోక్తాలంకారమే యభిమతము. దానిలక్షణముకూడ "వ్యంగ్యమును సుందరమగు భంగ్యంతరములో శబ్దశక్తిచేఁ దెలుపుట," యనియే.

ఈ విషయమున నప్పయదీక్షితు డిట్లుచెప్పెను.

ఈ పద్యమున భగవంతునియందు రాహువధూసురత కర్మకాలింగన రహితచుంబనమాత్ర శేషకర్తృత్వము వాచ్యము, వాసుదేవత్వము వ్యంగ్యము. అభినవగుప్తాలంకార సర్వస్వకారాది ప్రాచీనులన్నవో! లక్షణమును లక్ష్యమును కష్టముగ నన్వయించిరి. వారు చెప్పినట్లు రాహుశిర శ్ఛేదాదికము వ్యంగ్యమన్నచో ప్రస్తుతముచే నింకొక ప్రస్తుతము తోఁచినచో ప్రస్తుతాంకురమని నేను కల్పించిన ప్రస్తుతాంకురమే యగును. వాచ్యవ్యంగ్యములు రెండును ప్రస్తుతములే కనుక వాసుదేవత్వము వ్యంగ్యమన్న పర్యాయోక్తమగును. ప్రాచీనులు వృథాశ్రమనొందిరిఅని.

దీనికి జగన్నాథుని జవా బేమిటంటే ?

'ఎవడు.........చేసెనని' యచ్ఛబ్దవాచ్యమగు వాసుదేవుడు విశేషణమగుటచే వాసుదేవత్వము వాచ్యమే యగుటవలన, వాసుదేవత్వ మిప్పటికి వ్యంగ్యముకాదు. శబ్దశక్తిప్రతిపాదితమగుదాని కెట్లును వ్యంగ్యత్వ మిష్టముకాదు. కావుననే ప్రాచీనులు క్లిష్టగతినవలంబించుట:-
ఎట్లన ? అభినవగుప్తుడు ధ్వన్యాలోకలోచనమున నుద్భటోక్తమగు "అన్యవిధమున, జెప్పఁబడునది పర్యాయోక్త" మను లక్షణమును జూపి దానియర్థ మిట్లు వివరించెను. చెప్పఁబడునను మాటచే అన్యము= వాచ్యముకంటె నన్యము అని యర్థము.

అను ప్రాచీనోదాహరణమునమాత్రము రాహువధూగతమగు విశిష్ట రతోత్సవముచేఁ దత్కారణమగు రాహుశిరశ్ఛేదము గమ్యమగుచున్న దని, వేఱుగా సమన్వయించెను.

---

అన్యవిధమున్న=వాచ్యముకంటె వేఱగు వ్యంగ్యమే. అన్యనిధమున ననుచో తృతీయార్థ ముపలక్షణము: – ఇంతకు వ్యంగ్యోపలక్షితమగుచుఁ జెప్పఁబడినది పర్యాయోక్త మని ఫలితార్థము. వ్యంగ్య ముపలక్షణమ గుటచే ప్రధానముకాదుకనుక వాచ్యమే చమత్కారి యగుటచే ప్రధాన మగుటవలన ధ్వనికంటె విలక్షణమగు పర్యాయోక్తమని. ఇచట వ్యంగ్య మేమన దానినతఁడే యచటనే చెప్పెను. ఇచట వాసుదేవ ప్రతాపము వ్యంగ్యముగ వివక్షింపఁబడినది కాని యది చమత్కారి కాకపోవుటచే పర్యాయోక్తమేయగునని.

ఏతావతా దీక్షితులవారుచెప్పిన వాసుదేవత్వము వ్యంగ్యమను విషయము అభినవగుప్తపాద పర్యంతమగు ప్రాచీనుల కెవరికి నభిమతము కాదనుట స్పష్టమే. వాసుదేవత్వము "ఎతఁడు...చేసె" నని యచ్ఛబ్ద వాచ్యమగుటవలన, వ్యంగ్యముకాఁదగదని తేలుటచేతనే వారు క్లిష్టగతి నవలంబింపవలసి వచ్చెను.

అలంకార సర్వస్వకారుడును "గమ్యమునుగూడ వేఱువిధమున నభిధానము పర్యాయోక్తము" అని లక్షణమును జెప్పి పిమ్మట నిట్లు శంకించుకొని సమాధాన మొసగెను. గమ్యమగుదానికే యభిధానము సంభవింపకుండుటవలన కార్యాదిద్వారముననే చెప్పుట యని. అట్లు చెప్పుటచే "చక్రపుదెబ్బయను" ఇత్యాద్యుదాహరణమున వాచ్యము రాహువధూసురతము నాలింగనరహితముగను చుంబనమాత్రశేషము గను జేయుట, దానికిఁ గారణము రాహుశిరశ్ఛేదము. అదే వ్యంగ్యము కాని దీక్షితోక్తమగు వాసుదేవత్వము కాదు. అది 'యెవఁడు' అను యచ్ఛబ్దవాచ్యము, ప్రకరణలబ్ధము నగుటవలన.

ఇట్లు మమ్మట పక్షమందును యచ్ఛబ్దవాచ్యుఁడు ప్రకరణలబ్ధుఁడు నగు భగవంతునియందు రాహువధూసురతచుంబన మాత్రశేషకర్తృ త్వము వాచ్యము కాగా రాహుశిరశ్ఛేదకర్తృత్వమే వ్యంగ్యముకాని

ఏవంచ గమ్యమగుదానినే చెప్పుట యనులక్షణమున కసంభవము నాశంకించుకొని చెప్పుచున్నాడు. ఏది గమ్యమగునో దానికే శక్తిచే

---

దీక్షితోక్తమగువాసుదేవత్వ మిదివరలోఁ జెప్పినకారణముననే వ్యంగ్యము కాదు. ఏవంచ దీక్షితులవారు సర్వప్రాచీ నాలంకారికాభిమతమునకు విరుద్ధముగనే చెప్పినట్లు తెలినది.

ఈ విషయమున చంద్రికాకర్త జగన్నాథుడు చెప్పినదానిని దూషించి దీక్షితులవారు చెప్పినదానిని సాధించుచున్నాఁడు. ఎట్లన:— పర్యాయోక్తములో విషయమగు వాసుదేవత్వరూపమున నవగమనము విశేషణమర్యాదాలభ్య మగుటచే సుందరము కాదనునది యాలోచింపనిమాట. ఎందుచేత ? పర్యాయోక్తమున వ్యంగ్యముకంటె వాచ్యమే సుందరమగుట సర్వసమ్మతవిషయముకదా ! ప్రకృతమందు వాచ్యమగు రాహువధూసురత చుంబనమాత్రశేష కర్తృత్వమునకే వ్యంగ్యమగు వాసుదేవత్వముకంటె చమత్కారిత్వ మిష్టమే యగును. వాసుదేవత్వము సుందరము కానేకాదు. వాసుదేవత్వమే సుందరమైనచో ధ్వనియే యగునుకాని పర్యాయోక్తాలంకారము కానేకాదు. అలంకారసర్వస్వఖండనప్రవృత్త మగుదీక్షితగ్రంథమునకు అలంకారసర్వస్వగ్రంథవిరోధమును జూపుట మంచిదికాదు.

ఇంతేకాక అలంకారసర్వస్వమును దీక్షితుడనుసరించె ననుటయు పొసగింపే దీక్షితులవారు "కువలయానందారంభమునఁగాని చిత్రమీమాంసారంభమునఁగాని సర్వస్వగ్రంథవిరుద్ధముగ నేమియు చెప్పనని ప్రతిజ్ఞ చేసిరా ? ఇంతియకాదుసరికదా ! తన యభిమతమునుమాత్రమే యంగీకరించుచు విరుద్ధాంశమును ఖండించుచునే వచ్చిరి. అందువలన జగన్నాథోక్తములు దూషణములే కావు. అని

ఈ చంద్రికాకారుడగు వైద్యనాథుడు చెప్పినదంతయు బాగున్నది కాని సర్వప్రాచీనానభిమతముకావున వాసుదేవత్వము వ్యంగ్యముకాదన్న జగన్నాథునిదూషణమునకు సమాధానము చెప్పక దానికి వ్యంగ్యత్వము సాధింపకయె వాసుదేవత్వరూపవ్యంగ్య మసుందరమన్న దానినిమాత్రమే గ్రహించి యిష్టాపత్తిచెప్పుట యేమిన్యాయమో యూహింపరాదు.

బోధనము సంభవింపకపోవుటవలన కార్యాదిద్వారముననే యభిధానము లక్షణమందు వివక్షింపఁబడినదని లక్షణమునుగూడ క్లిష్టముగ సమన్వయించెను.

లోచనకారుఁడగు అభినవగుప్తపాదుఁడును "వేఱువిధమునఁ జెప్పఁబడునది పర్యాయోక్తము"ను నీలక్షణమునే యంగీకరించి దాని యుదాహరణమందును వాచ్యమగు కార్యముచేఁ గారణమును వ్యంగ్యముగఁ జూపి యందు లక్షణమును లక్ష్యనామమును గ్లిష్టముగ సమన్వయించెను. వాచ్యముకంటె నన్యవిధమగు వ్యంగ్యముతో నుపలక్షితమగుచు నేది చెప్పఁబడునో యది పర్యాయమగు=ప్రకారాంతరమగు, వ్యంగ్యముతో నుపలక్షితముగఁ జెప్పఁబడునది పర్యాయోక్తమని,

ఈ క్లేశమంతయు నెందులకో యెఱుంగము. గమ్యమగునదే రూపాంతరమున వాచ్యమగుటయందెన్నో యుదాహరణములు చూపఁబడినవి కదా! 'చక్రపుదెబ్బయందలి కఠినశాసనముచే' నను ప్రాచీనోదాహరణముకూడ స్వరూపముతో గమ్యమగు భగవంతునికి విశిష్టరతోత్సవకారిత్వరూపముతో నభిధాన ముండుటచేఁ జక్కగ సమన్వితమే యయ్యెను. అందు రాహుశిరశ్ఛేదమే గమ్యమన్నచోఁ బూర్వోక్తరీతిగఁ బ్రస్తుతాంకురమే యగును.

ప్రస్తుత ము॥, రాహుశిరోమాత్రావశేషముచే నాలింగనవంధ్యత్వాద్యాపాదనరూపము వాచ్యము నగుభగవంతునిరూపాంతరముపపాదితము కాగా నావాచ్యముచే వాసుదేవత్వరూపముతో భగవదవగమనము పర్యాయోక్తమునకు విషయము.

సుందర మగువ్యాజముచే నిష్టమును సాధించుకొనుటయుఁ
బర్యాయోక్తమగునందురు.

ఉ॥ నేను చూతలతను జూచుట కేగుచున్నాను. మీరిద్దఱు
నిచట నుండుఁడు.

ఇచట నాయికను నాయకునితోఁగూర్చి చూతలతా దర్శనవ్యాజమున వెళ్లుచున్న సఖు వారికి స్వేచ్ఛా సంపాదన మను నిష్టమును సాధించుట పర్యాయోక్తము. మఱియు,

[79] ఓ రాధ ! నీయొడిలోఁదాచిన నాబంతి నిమ్మని యాచిం
నీవిని విప్పుచున్న కృష్ణుఁడు మీకు సంతసము నిచ్చుఁగాక.

మొదటి యుదాహరణమున నితరులయిష్టమును సాధించుట. ఇచటనో ! బంతి యున్నదా ? యని పరీక్షించుటకు కోకముడి విప్పుట యనువ్యాజముతో తనకోరికను నెరవేర్చుకొనుట, ఇదియేభేదము.

## 80. వ్యాజస్తుతి.

నిందాస్తుతులచే స్తుతినింద లభివ్యక్తమైనచో వ్యాజస్తుతి యగును
స్వర్ణదీ ! నీకు వివేకమేది ? పాపులఁగూడ స్వర్గము నొందించు చున్నావు. దూతి ! మంచిది. మఱి మంచిది. నాకై దంతములచేతను గోళ్లచేతను గాయపడితివి. ఇంతకంటె నేమిచేయవలయును ?

నిందచే స్తుతి వ్యక్తమగుటకాని స్తుతిచే నింద వ్యక్తమగుట కాని వ్యాజస్తుతి యగును. స్వర్ణదీ ! నీకు వివేక మేది ? ఇత్యాద్యుదాహరణమందు వివేకము లేదను నిందావ్యాజముచే గంగ సుకృతిని వలెనే పాతకినిగూడ స్వర్గము నొందించుచున్న దను వ్యాజరూపనిందచే గంగా ప్రభావాతిశయస్తుతి, 'దూతి! మంచి' దీత్యాద్యుదాహరణమందు నాకై మహాక్లేశ మనుభవించితి వను వ్యాజరూపస్తుతిచే నీవు క్రీడించుట కేగితివేకాని నాకొఱ కేఁగలేదు. దూతికాధర్మవిరుద్ధకారిణి వగు నిన్నుగూర్చి సిగ్గగుచున్నది, అనునిందయు వ్యక్తమగుచున్నది. మఱియు,

---

79. దేహి మత్కందుకం రాధే పరిధాననిగూహితం ।
ఇతి విస్రంసయన్నీవిం తస్యాః కృష్ణో ముదేఽస్తువః ॥

రాజ! నీశౌర్యమద మేమి? యుద్ధ మొనరింప నీ వొక్క-
గుఱ్ఱమునెక్కఁగా నీశత్రువులు సప్తసప్తి (ఏడుగుఱ్ఱముల)
(రవి) సమారూఢులగుచున్నారు.

80A శివునియర్ధభాగమును హరియు నింకొకయర్ధము గిరిజయు
గైకొనిరి. దేవ! ఇట్లు భూతలమందు హరునిలేమి
కలుగగా గంగ సాగరమును శశికళ యాకసమును నాగ
ములు పాతాళమును బొందెను. సర్వజ్ఞత్వ మీశత్వము
నిన్నుఁ బొందెను. నన్ను భిక్షాటనము పొందెను.

ఇచట మొదటియుదాహరణమున సప్తసప్తిపదములోని శ్లేషమూల నిందావ్యాజముచే స్తుతి వ్యక్తమగుచున్నది. రెండవ యుదాహరణ మందు సర్వజ్ఞుఁడవు సర్వేశ్వరుఁడవు ననువ్యాజరూపరాజస్తుతిచే నాదు పై దుష్య దారిద్ర్యాదుల నన్నంటి నెఱింగియు నెక్కువగ నిచ్చి రక్షింపఁ గలిగియు నాశించకయు నీవు. అనునింద వ్యక్తమగుచున్నది. ఇదంతయు నిందాస్తుతు లేక విషయ మగుటలో నుదాహరణము.

భిన్నవిషయ మగుటలో నుదాహరణము. నిందచే స్తుతి వ్యక్త మగుట యెట్లన,

80 వానర! నీవెవరు? రామరాజభవనమున సందేశహారుఁ
డను. వెనుక వచ్చిలంకఁగాల్చిన హనుమంతుఁ డిప్పు
డెక్కడి కేఁగెను? ఇంద్రజిత్తుచేఁ గట్టఁబడె నని కపికులము
కొట్టితరిమివేయగా బెదరిన యావనమృగము హనుమం

---

80A చిరకాల సేవితుడగు రాజునకు విఫలుడగు కవి చెప్పిన వాక్యమిది

80. కస్త్వం వానర రామరాజభవనే లేఖార్థసంవాహకో
యాతః కుత్ర పురాగతస్సహనుమాన్నిర్దగ్ధలంకాపురః ।
బద్ధో రాక్షససూనునేతి కపిభిస్సంతాడితస్తర్జితః
సవ్రీడాత్తపరాభవో వనమృగః కుత్రేతి నజ్ఞాయతే ।

తుండు సిగ్గుచే పరాభూతుడై యెక్కడి కేగనో
రొయిఁగరాదు.

ఇచట హనుమన్నిందచే నితరవానరస్తుతి వ్యక్తము. స్తుతిచే నిందాభి
వ్యక్తి యెట్లన,

[81] ఓకురంగమ ! మాటిమాటికి ధనికులమోము చూడవు.
వారి గరువపు పలుకులు వినవు. ఆసతో వారికడ
కేగవు. సకాలమున గరికపరకలం దిని నిద్ర వచ్చినపుడు
నింద్రింతువు. అట్లుండుటకు నీవెక్కడనేమితప మొనరిం
చితివో నాకుఁ జెప్పుము.

ఇచట కురంగస్తుతిచే రాజసేవచే ఖిన్నుఁడగు తనయొక్క నింద వ్యక్త
మగు చున్నది. ఇది యప్రస్తుతప్రశంసావిశేష మని యలంకారసర్వ
స్వకారుఁ డనెను. అందుచేతనే కదా ! యిట్లు బోధింపబడినది.
సాదృశ్యనిబంధనాప్రస్తుత ప్రశంసోదాహరణాంతరము వైధర్మ్యముతోఁ
గూడఁ జూడఁబడుచున్నది. ఎట్లన,

జలజసుగంధములు సుఖశీతలములు నగు నీవన వాయువు
లిందీవరశ్యాముని రాముని స్వేచ్ఛగ సేవించుచున్నవో
యవి ధన్యములు కదా !

ఇచట వాయువులు ధన్యము లను నప్రస్తుతార్థమువలన నే నధన్యుఁడ
నని వైధర్మ్యముచేఁ బ్రస్తుతార్థము ప్రతీయమాన మగుచున్న దని.
దండి యీసాదృశ్య నిబంధనయే అప్రస్తుతప్రశంస కాని కార్య

81. యద్వక్త్రం ముహురీక్షసే న ధనినాం బ్రూషే న చాటూన్మృషా
నైషాం గర్వవచశ్శృణోషి న చ తాన్ప్రత్యాశయా ధావసి ।
కాలే బాలతృణాని ఖాదసి పరం నిద్రాసి నిద్రాగమే
తన్మే బ్రూహి కురంగ కుత్ర భవతా కిం నామ తప్తం తపః ॥

కారణభావాదినిబంధన యగునది యప్రస్తుతప్రశంస కాదని యిట్లు దాహరించెను.

> అనమయమునందలి స్తుతియు నప్రస్తుతప్రశంస యగును.
> వనమందు హరిణములు పరులసేవింపక యప్రయత్నలబ్ధ
> ములగు జలతృణాది వస్తువులతో సుఖముగ జీవించు
> చున్నవి.

రాజానుసరణ క్లేశముచే దుఃఖితుఁ డగునభిమానిచే నిచట నప్రస్తుతమే యగు నీమృగవృత్తి కొనియాడఁబడుచున్నది.

నిజమున కిచట స్తుతిచే నిందాభివ్యక్తి యని యప్రస్తుతప్రశంస కంటె విశేష ముండుటంబట్టి, వ్యాజస్తుతి యగుటే యుక్తము. అటు కానిచోఁ బ్రసిద్ధవ్యాజస్తుత్యుదాహరణములందును నప్రస్తుతము లగు నిందాస్తుతులచే బ్రస్తుతము లగు స్తుతినిందలు గమ్యము లయినంత మాత్రమున వ్యాజస్తుతి యంతయు నప్రస్తుతప్రశంసయే కావలసివచ్చును.

ఏవంచ ఈవిధముగ నిచట నొకదానిస్తుతివివక్షచే మఱియొక దాని స్తుతి చేయఁబడిన నచటను అన్యస్తుతి వ్యాజముచేఁ దదన్యస్తుతి యను నర్థానుగమ ముండుటవలన వ్యాజస్తుతియే యగును.

> " ఓతరుణీ! యీశుకశాబక మేకొండమీద నేమిపేరిటి తప
> మొనరించెనో! నీయధరారుణ మగు దొండపండును
> గొఱుకుచున్నది.

ఇచట శుకశాబకస్తుతిచే నాయికాధరసౌభాగ్యాతిశయస్తుతి యభివ్యక్త మగుచున్నది.

---

౮౩. శిఖరిణి క్వను నామ కియచ్చిరం కిమభిధానమసావకరో త్తపః ।
తరుణి యేన తవాధరపాటలం దశతి బింబఫలం శుకశావకః ।

## 31. వ్యాజనింద

ఒకని నిందచే మఱియొకనికి నింద గమ్యమైనచో వ్యాజనింద యగును.

ఉ॥ ఓ బ్రహ్మదేవుఁడా! పూర్వ మెవఁడు సీతల నొకదానినే త్రుంచెనో అతఁడు నిమ్న్యఁడు.

ఇచట దారుణపరిణామము కల సంసారమును బ్రవర్తింపఁజేయువిధి యొక్కనింద హరనిందచే నభివ్యక్తమై వ్యాజనింద యగుచున్నది. **మఱియు,**

ఓ కాకమా! నీ వఱచుక్కొనుము. నీకు వ్వేమున్నది? సహకారతరువున సరళమగు కోకిలతో సహవాస మొనరించిన విధియే విశేషముగ నిందింపఁ దగినవాఁడు.

ఈవ్యాజనింద యేయాలంకారికునిచేతను జెప్పఁబడకున్నను అన్యస్తుతిచే నితరనిస్తుతి వ్యక్తమగు నను నైదవరకపు వ్యాజస్తుతికిఁ బ్రతిద్వంద్విగా నిందు జెప్పఁబడినది.

ఓయి! అన్యస్తుతిచే నన్యస్తుతి అన్యనిందచే నన్యనిందయు గమ్యమగుచోట వ్యాజస్తుతి వ్యాజనిందాలంకారముల నంగీకరించినచో స్తుతినిందారూపా ప్రస్తుతప్రశంసోదాహరణములు కూడ వ్యాజనిందా విషయములగుటవలన నందు, నప్రస్తుతప్రశంస చెప్ప వీలులేదు, అన్నచో వేఱుచోటఁ బ్రసిద్ధమగు నలంకారద్వయ మొకచో కలియుట దోషము కాదని సమాధానము చెప్పుచున్నాఁడు. స్తుతి నిందారూపమగు నప్రస్తుత వృత్తాంతమువలన సదృశవృత్తాంతము ప్రతీయమాన మగునట్టి "లోపల నెక్కువఛిద్రములు" ఇత్యాది స్థలమందు, లబ్ధావకాశ యగు సారూప్య నిబంధనా ప్రస్తుతప్రశంస యిచటను నున్నచో దానిని వారింపరాదు.

అన్యస్తుతిచే నన్యస్తుతి యన్యనిందచే నన్యనిందయు నను వ్యాజస్తుతి వ్యాజనింద లుండిన నవియు స్వేచ్ఛగ నుండవచ్చునుగాని యప్రస్తుత ప్రశంసను వీడ వీలులేదు. యద్యపి 'కాకమా నీవఱచుకొను' మిత్యాది యందు విధినిందచేత, తన్మూల కాకనిందచేతను నవిశేషజ్ఞుఁ డగు రాజు యొక్క నిందయు రాజుచే విద్వాంసునితో సమముగ గౌరవింపఁ బడిన మూర్ఖుని నిందయు తోచుచుంటచే నచట సారూప్యనిబంధనా ప్రస్తుతప్రశంసయు నున్నది. అట్లుండినను నాయప్రస్తుతప్రశంస వ్యాజ నిందామూలమే యగుటచే మొదట తోచిన వ్యాజనిందయు నచట వారింపరానిది. ఏవంచ యీయప్రస్తుతప్రశంస వ్యాజనిందామూలకము వ్యాజ నిందారూపము నగుటచేఁ జమత్కారాతిశయజనక మగును.

ఇట్లే వ్యాజస్తుతిమూలకము వ్యాజస్తుతిరూపము నగు నప్రస్తుతప్రశంసయుఁ గనఁబడుచున్నది. ఎట్లన,

[83] లావణ్యధనవ్యయము లెక్కచేయలేదు. గొప్పక్లేశ
ముసు బొందెను. విటుల హృదయమునందు చింతా
జ్వరమును జనింపచెను. ఈదీనురాలును అనురూపవరు
ఁడు లేకుంటచే చెడిపోయెను. (సామ్యమపోక, గొప్ప
ప్రయాసపురాక, ప్రజలబాధ, నిరర్థకారంభము సిద్ధింప)
ఈతలోదరినిసృజించు విరించియేమి తలంచెనో కదా!

ఇచట నప్రస్తుతపు తరుణియొక్క సృష్టి నిందావ్యాజముచేతను తరుణీ నిందావ్యాజముచేతను తరుణీ సౌందర్యప్రశంస, ప్రశంసనీయముగ కవిచే

---

83. లావణ్యద్రవిణవ్యయో న గణితః క్లేశో మహానార్జితః
స్వచ్ఛందం చరతో జనస్య హృదయే చింతాజ్వరో నిర్మితః ।
ఏషాపి స్వగుణానురూపరమణాభావాద్వరాకీ హతా
కోఽర్థశ్చేతసి వేధసా వినిహితస్తన్వ్యాస్తనుం తన్వతా ॥

వివక్షింపఁబడిన స్వకవిత్వముయొక్క సృష్టి నిందావ్యాజముచేతను కవిత్వపు నిందావ్యాజముచేతను శబ్దార్థముల చమత్కారాతిశయ ప్రశంసయందు బర్యవసన్న మగును. యద్యపి ఈవాక్యమందలి వాచ్యార్థ విషయ మంత సమంజసముగాలేదు. విరాగి కిట్టిశృంగార విషయములందు ప్రవృత్తియుండదు కనుకను, రసమున కనుగుణము కాక పోవుటవలనను నీ వికల్పములు విరాగివని తలంపశక్యముకాదు. రాగితలంపులందును, నీ దీనురాలి కనుకుత్సితవాక్యము చెడిన దను నమంగళవాక్యము ననుచితము లగుటవలన, ననురాగపరిమాణము లేకుంటచే ననున దనలే తగని దగుట వలనను నీ తలంపులు రక్తునివనియుఁ దలంపరాదు. నీ నాతరుణికిఁదగ నను తలంపుకూడ రాగి యగువాని కనుచితమే యగును గదా!

అట్లయ్యు వివక్షితమగు స్వకవితాసౌందర్యరూప ప్రస్తుతార్థమందన్యాయ మించుకంతయు లేదు. వాచ్యార్థ మసమంజసముగ నున్నను నప్రస్తుతప్రశంస యుపపన్న మగుటంబట్టియు వాచ్యార్థ మించు సమంజసముగా నుండుటచేతను ప్రాచీను లీపద్యము నప్రస్తుత ప్రశంసాపరముగ చెప్పిరి.

## 32. ఆక్షేపాలంకారము.

తాను చెప్పినదానినే కొంచె మాలోచించి కారణము
చూపి నిషేధించుట నాక్షేప మందురు.

ఉ॥ చంద్ర! దర్శనమిమ్ము! వలదులే! ప్రియాముఖ మున్నది.

[34] ఇచటఁ గోరినచంద్రదర్శనము ప్రియాముఖ ముండుటచే ననవసరముగఁ దలంచి వలదులే! ఇత్యాదిచే సూచింపఁబడిన నిషేధ మాక్షేపము. మఱియు,

---

34. ఇచట నైరర్థ్యమును చెప్పుటంతయు నిషేధముగాఁ దలంచి దీనికి గతార్థత శంకింపరాదు. అనైరర్థ్యము నిషేధమునుగూర్చి కారణమును చూపిన సృషిధానమగుటంబట్టి.

65 ఓకవివరులారా! సాహిత్యసముద్రమును మథించుట వలనఁ గలిగిన కావ్యామృతమును రక్షింపుఁడు. కావ్యార్థచోరులు రాక్షసులవలె దాని నపహరించుట కధికమగుచున్నారు. పోనిండు! అందఱు స్వేచ్ఛగ గ్రహింతురుగాక. కవీశ్వరుల కెక్కడను లోపములేదు. దేవతలు రత్నముల నెన్నిటినో యపహరించిన నిప్పటికి సముద్రుఁడు రత్నాకరుఁడేకదా!

ఇచట మొదటివాక్యమున ప్రార్థితమగు కావ్యార్థచోరులనుండి రక్షణమును సముద్రగత రత్నరాశివలె స్వలిఖితార్థవైచిత్ర్యముల కక్షయత్వము నాలోచించి నిషేధించుట ఆక్షేపము.

కొంతమంది నిషేధాభాసమునుగూడ నాక్షేపముగానే తలంతురు.

ఉ॥ నేను దూతిని గాను. ఆమెతనుతాపము కాలానల సదృశముగ నున్నది.

అలంకార సర్వస్వకారాదులు కొందఱిట్లు చెప్పుచున్నారు. నిషేధ మాత్ర మాక్షేపము కాదు. ఏ నిషేధము బాధితమగుచు నర్థాంతర మందు బర్యవసాన మొందినదై కించిద్విశేషమును సూచించునో యది యాక్షేపము.

ఎట్లన దూతి చెప్పుచు నేను దూతిని కా నను నిషేధము బాధితము కావున నాభాసరూపమై సంఘటనకాలమునకుఁ దగిన దొంగమాటల విడిచి నిజము చెప్పుటయందు బర్యవసాన మొందుచు నీవిప్పుడె

65. సాహిత్యపాథోనిధిమంథనోత్థం కావ్యామృతం రక్షత హే కవీంద్రాః ।
యత్తస్య దైత్యా ఇవ లుంఠనాయ కావ్యార్థచోరాః ప్రగుణీభవంతి ॥
గృహ్ణంతు సర్వే యదివా యథేచ్ఛం నాస్తి క్షతిః క్వాపి కవీశ్వరాణాం ।
రత్నేషు లుప్తేషు బహుష్వమర్త్యైరద్యాపి రత్నాకర ఏవ సింధుః ॥

వచ్చి నాయికను రక్షింపఁదగు నను విశేషమును సూచించుచున్నది. మఱియు,

> రాజేంద్ర! మేము సందేశహారులము కాము. జగత్కు-
> టుంబి వగునీ కిప్పుడు శత్రువెవ్వఁడు కనఁబడఁడు.

ఇచట సందేశహారులు చెప్పుచు మేము సందేశహారులము కామను నిషేధముబాధితమై సంధికాలమునకుఁ దగిన కైతవవచనములవీడుటచే యథార్థవాదిత్వమునఁ బర్యవసన్న మగుచు నీకు శత్రుభావములోఁ జూడఁదగినవాఁడు లేఁడు. అందఱురాజులు భృత్యభావమున సంరక్షింపఁదగినవారే యను విశేషమును సూచించుచున్నది.

> విధి వ్యక్తమై నిషేధము తిరోహితము కాఁగా నదియు
> నాక్షేప మగును.

> మనోహర! నీవేఁగు మేఁగినచో నేనచటఁ బుట్టుదునుగాక.

ఇచట నీవేఁగుము అనువిధి వ్యక్తమై వల దనునిషేధము కప్పబడినది. కాంతుఁడేఁగు దేశమందు తనపుట్టుకను గోరుచుఁ దనమరణమును సూచించుటచే గమననిషేధ మంతర్భావితమైయున్నది. మఱియు,

> [88] నీయాత్ర నన్నింతోకాలము బాధింపదు. నీ వేఁగదలఁ
> చిన నేఁగుము. సందేహామేల ?

ఇచటను నీయాత్ర నన్నింతోకాలము బాధింప దని తనమరణ సూచనముచే గమననిషేధ మంతర్హిత మయ్యెను.

## 33. విరోధాభాసము

> విరోధ మాపాతరమణీయముగఁ గనఁబడినచో విరోధా-
> భాసమగును.

> ఉ॥ తన్వీ! హారములు లేనివయ్యు నీకుచములు హారులే
> యగును.



---

88. న చిరం మమ తాపాయ తవ యాత్రా భవిష్యతి ।
యది యాస్యసి యాతవ్యమలమాశంకయాపి తే ॥

ఇందు హారరహితములయ్యు హారులు మనోహరము లను శ్లేష మూలకము విరోధాభాసము. మఱియు,

[67] అనలుని వలని భయముచే శత్రురాజులవలె విరుద్ధధర్మ
ములుగూడ భేదము వీడెను గాబోలును. అందుచే
నానలుఁడోజముచే మిత్రజిత్తయ్యు నమిత్రజిత్తును చార
దృక్కయ్యు విచారదృక్కునయ్యెను.

విరోధ సమాధానరూపోత్ప్రేక్షాప్రధానము విరోధాభాస మని పూర్వముకంటె భేదము.

## 34. విభావనాలంకారము

1. కారణములేకున్నను గార్యము పుట్టుట విభావన.

ఉ॥ లత్తుక పూయకున్నను బదద్వయము రక్తముగానున్నది.

ఇచట లత్తుకపూత యను కారణము లేకున్నను పదములందు రక్తిమ చెప్పఁబడినది. స్వభావసిద్ధ మగు రక్తవర్ణము పదములందుండుటచే విరోధము లేదు. మఱియు,

త్రాగకుండగనే మదించినహంసలు కలది, సమ్మార్జనము
లేకయే నిర్మలాకాశము, శుద్ధిచేయకయే నిర్మలో
దకము నగు లోకము మనోహరముగ నుండెను.

ఇచట పానాదిప్రసిద్ధహేతువులు లేకున్నను మదాదికార్యములు కూర్పఁబడెను. వర్ణ్యమానశరత్సమయమే వానికి హేతువు కావున విరోధములేదు. మఱియు,

---

87. ప్రతీపభూపైరివ కిం తతో భియా విరుద్ధధర్మైరపి భేత్తృతోజ్ఝితా ।
అమిత్రజిన్మిత్రజిదోజసా యద్విచారదృక్చారదృగప్యవర్తత ॥

" సుందరికి జుట్టుముడుచుటచే సురభియగు కాబరము
ములో లూనకుసుమయగు లతయొక్క వృంతము
నందును తుమ్మెదలుండెను.

ఇచట లతయందు పువ్వులు లేకున్నను తుమ్మెదలున్నట్లు చెప్పఁబడి నది. ఆతుమ్మెదలుండుటకు కామినీకబరీసంక్రాంత సౌరభములగు నరపతినఖములసంబంధరూప మగుకారణాంతరము విశేషణద్వారమునఁ జూపుటచే విరోధములేదు.

2. కారణ మసమగ్రముగానున్నను కార్యోత్పత్తియగు టయు విభావన యగును.

ఉ॥ తీక్ష్ణములు కఠినములును కాని బాణములచే మదనుఁడు
లోకమును జయించుచున్నాఁడు.

ఇచట లోకవిజయమును సాధించుటలోఁ గారణములగు బాణము లకు తీక్ష్ణత్వాది గుణావైకల్యము వర్ణింపఁబడినది. మఱియు,

ఉపవనపవన కంపితములగు చూతచంపకరేణువులు దారి
నడుచువారికన్నులం బడకున్నను సాశ్రువులం జేయు
చున్నవి.

ఇచట బాష్పోద్గమనహేతువుల కసమగ్రత్వము ప్రసక్తియారాహి త్యమే.

ఈ రెండవ విభావనను దండి విశేషోక్తి యనెను. అందు మొదటి యుదాహరణమున మన్మథ మహిమాతిశయ రూపవిశేషము, రెండవ యుదాహరణమున చూతచంపకరేణువుల కుద్దీపకతాతిశయరూప విశేష మున్ను చెప్పఁబడుటంబట్టి మేము తీక్ష్ణత్వాదిరూప కల్యముకూడ విశిష్ట కారణాభావరూప మగుటచే విభావనగాఁ జెప్పితిమి.

---

88. తరతనుత బరీవిధాయినా సురభినఖేన నరేంద్రపాణినా ।
అకలితకుసుమాపి వల్లరీ మధుపావృన్తనిలీనషట్పదా ॥

3. ప్రతిబంధకమున్నను కార్యోత్పత్తి యైనచో మూఁడవ విభావన యగును.

ఉ॥ రాజా ! నీయసిభుజంగము నరేంద్రులనే కఱచుచున్నది.

ఇచట నరేంద్రుఁలు విషవైద్యులు పాముకాటునడ్డగించు మంత్రౌషధులుకలవారు శ్లేషచేఁ గ్రహింపఁబడిరి. కావున ప్రతిబంధకమున్నను కార్యోత్పత్తి అయ్యెను. మఱియు,

" 4. ఓరాజేంద్ర ! నీప్రతాపతపనుఁ డాతపత్రములేని శత్రుగణమును వీడి యాతపత్రమున్న శత్రుగణమునే తాపపెట్టుచున్నాడు. చిత్రము !

కారణము కానిదానినుండి కార్యము పుట్టుట నాలవ విభావన.

ఉ॥ ఈ వీణానినాదము శంఖమునుండి పుట్టుచున్నది. ఏమి యద్భుతము !

ఇచట శంఖముగఁ గమనీయమగు కామినీకంఠము, వీణానాదముగ కామినీగీతమున్ను నధ్యవసానము చేయఁబడుచున్నది. కావున నకారణమునుండి కార్యోత్పత్తి.

5. కార్యవిరుద్ధమగు కారణమునుండి కార్యము పుట్టుటయు నొకవిభావన యగును.

ఉ॥ శీతాంశుకిరణము లాతన్విని తాపపెట్టుచున్నవి కష్టము.

ఇచట తాపనివర్తకము లగుటచే తాపవిరుద్ధములగు చంద్రకిరణములచేఁ దాపోత్పత్తి చెప్పఁబడినది. మఱియు,

---

89. చిత్రం తపతి రాజేంద్ర ప్రతాపతపన స్తవ।
అనాతపత్రముత్సృజ్య సాతపత్రం ద్విషద్గణం॥

[90] కుమారసూర్యుఁ డుదయింపఁగాఁ గువలయోల్లాసము నక్షత్రభాతియుఁ గన్పట్టుచున్నది. శత్రురాజకుమారుల పాణిపద్మములు ముకుళించుకొనుచున్నవి. మఱియు,

[91] వివేకములేని కుచద్వంద్వము ముల్లోకముల బాధించుఁగాక శ్రుతిపరిచితికల కనుగవకు జనమారణ మనుచితము.

పూర్వోదాహరణములందు కారణము కార్యవిరోధియగుట స్వాభావికము. ఇచట నన్ననో శ్రుతి పరిచయరూపాగంతుక గుణమూలకము. ఇదియే భేదము.

6. కార్యమువలనఁ గారణ ముత్పన్నమగుట యాఱవ విభావన.

ఉ॥ నీకరమను కల్పవృక్షమునుండికీర్తి సముద్రముదయించెను. మఱియు,

[92] కొండయందు లత పుట్టునుగాని యెప్పుడు లతయందుఁ గొండ పుట్టదుకదా! ఇప్పుడు దానికి విపరీతముగ నీకనక లతయందు గిరిద్వయ ముదయించెను.

## 35. విశేషోక్త్యలంకారము.

సంపూర్ణ కారణమున్నను గార్యము పుట్టకుండుట విశేషోక్తి.

ఉ॥ మన్మథదీపము మండుచున్నను మనసునందు స్నేహక్ష

---

90. ఉదితే కుమారసూర్యే కువలయముల్లసతి భాతి నక్షత్రం ।
ముకులీభవంతి చిత్రం పరరాజకుమారపాణిపద్మాని ॥
నక్షత్రభాతి = నక్షత్రములకాంతి. అక్షత్రభాతి = రాజకులమునకుఁ బ్రకాశము లేమి. న క్షత్రభాతి = అక్షత్రభాతి, అనియుఁ బదవిభాగము.

91. అవివేకి కుచద్వంద్వం హంతు నామ జగత్త్రయం
శ్రుతిప్రణయినోః కర్ణయోరయుక్తం జనమారణం ॥

92. జాతా లతా హి శైలే జాతు లతాయాం న జాయతే శైలః ।
సంప్రతి తద్విపరీతం కనకలతాయాం గిరిద్వయం జాతం ॥

యము కాలేదు. మఱియు,

సంధ్య యనురాగవతి, దివసమామె పురస్సరము, అట్ల య్యుఁగలయిక లేదు. దైవగతి యతిచిత్రము కదా!

## 36. అసంభవాలంకారము.

ఒక కార్యము పుట్టునని తలంపనట్లువర్ణించుట అసంభవాలంకారము.

ఉ॥ గోపబాలకుఁడు కొండ నెత్తునని యెవఁ డెఱుంగును ? మఱియు,

[93] ఈ సముద్రము నీటికి ముఖ్యస్థానము రత్నాకరము నని మేము దీనినాశ్రయించితిమి. కాని యింతలో నీ యగస్త్యముని దీనిని పుడిసిలించి వాడుపాఱుమకరాదులు కల్గున ట్లాచమించునని యెవఁ డెఱుంగును ?

## 37. అసంగత్యలంకారము.

కార్యకారణములకు భిన్న దేశములందునికి విరుద్ధమగుచో నసంగతి యుండును.

ఉ॥ జలధరములు విషముఁద్రావఁ బధికాంగనలు మూర్ఛ నొందిరి.

ఏకార్యకారణములకు వేఱుచోనునికి విరుద్ధమగునో వానికూర్పు అసంగత్యలంకారము. ఇచట విషపాన మూర్ఛలకు భిన్న దేశత్వము మఱియు,

ఖల భుజంగుని యీావధక్రమము చిత్రము. ఒకనిచెవి కొఱికిన మఱొకని ప్రాణము పోవును.

---

93. అయం వారామేకో నిలయఇతి రత్నాకర ఇతి
శ్రితోస్మాభి స్తృష్ణాతరళితమనోభిర్జలనిధిః ।
క ఏవం జానీతే నిజకరపుటీ కోటరగతం
క్షణాదేనం తామ్యత్తిమి మకరమాపాస్యతి మునిః ॥

ఒకచోట కార్యకారణముల యసాంగత్యమునకు సమా
ధానము కూర్చుటచేతను నసంగత్యలంకారము.

94 ఓదమయంతీ ! నలుని దీర్ఘసంకల్ప సోపానముల పరం
పరను నీవారోహింప, నిన్నే ధ్యానించుచుండుటచే నీ
స్వరూపమును దాల్చిన యానలుఁడు నిట్టూర్చు
చున్నాఁడు.

విరుద్ధ విశేషణమువలన కార్యకారణములకు భిన్న దేశత్వము విరు
ద్ధము కానిచోట నసంగతిలేదు. ఎట్లన,

95 సుముఖ ! భ్రూచాపవల్లిని వక్రము చేయునంతలో కటాక్ష
బాణములు నాగుండెను బగుల గొట్టుచున్నవి.

ఒకచోఁ జేయఁదలఁచినదానిని మఱొకచోఁజేయుట, అట్లే
యొకకార్యమును జేయఁదలంచువాఁడు దానికి విరుద్ధ
కార్యమును జేయుటయు నసంగతి యగును.

96 ఓ కృష్ణా ! భూమి నపారిజాతను (శత్రువులులేనిదాని) గాఁ
జేయఁ దలఁచి స్వర్గము నట్లు (పారిజాత తరువులేనిదిగ)
చేసితివి. పూర్వము గోత్రోద్ధార ( భూమినిరక్షింప )
ప్రవృత్తుఁడవయ్యు గోత్రభేదన మొనరించితివి.

ఇచటఁ గృష్ణునితో నింద్రుని సోపాలంభవచనమం దిట్లున్నది. భువి
యందు జేయఁగోరినదగుటచే నచటఁ జేయఁ దగిన యపారిజాతత్వము

---

94. అధ్యారోహసి దూరదీర్ఘాం సంకల్పసోపాన తతింతదీయాం
శ్వాసాన్సవర్ష త్యధికం పునర్యత్ ధ్యానాత్తవ త్వన్మయతామవాప్య ॥

95. భ్రూచాపవల్లీం సుముఖీ యావన్నయతి వక్రతాం ।
తావత్కటాక్ష విశిఖైర్భిద్యతే హృదయం మమ ॥

96. అపారిజాతాం వసుధాం చికీర్షన్ ద్యాంకథా కృథాః ।
గోత్రోద్ధార ప్రవృత్తోపి గోత్రోద్భేదం పురా కరోః ॥

స్వర్గమందు జేయఁబడినదని యొక యసంగతి. పూర్వము గోత్రము (భూమి) నుద్ధరించుటయందుఁ బ్రవృత్తుఁడవు వరాహరూపివగు నీచే దానికి విరుద్ధమగు గోత్రముల (కొండల) భేదనము డెక్కలనఱకుడుచేఁ జేయఁబడినదని మఱియొకయసంగతి. ఈ రెండును శ్లేషోత్థాపితములే. మఱియు,

[97] వీరుఁడవగు చోళేంద్ర ! నీనష్టశత్రువుల భార్యలకు నేత్ర
ములందు కంకణము తొడలందు పత్రవల్లియు కరము

---

97\. 1 త్వత్ఖడ్గఖండిత సపత్నవిలాసినీనాం భూషా భవంత్యభినవా భువనైకవీర ।
నేత్రేషు కంకణమథోరుషు పత్రవల్లీ చోళేంద్రసింహ తిలకం కరపల్లవేషు ॥

2 మోహం జగత్త్రయభువామపనేతుమేత
దాదాయ రూపమఖిలేశ్వర దేహభాజాం ।
నిస్సీమకాంతి రసనీరధినామునైవ
మోహం ప్రవర్ధయసి ముగ్ధవిలాసినీనాం ॥

కంకణము=గాజు, నీటిబొట్టు. పత్రవల్లి=ఆకులతోఁగూడిన తీగ, మకరికాది పత్రరచన. తిలకం=బొట్టు, తిలోదకము. పైరెండు 96, 97 విషయములలోని నాలుగుదాహరణములందును జగన్నాథపండితుడు దోషము నిట్లు ప్రకటించెను.

ఇందలి ద్వితీయాసంగతి భేదోదాహరణము ప్రథమాసంగతి లక్షణమునకును, తృతీయాసంగతి భేదోదాహరణము పంచమ విభావనా లక్షణమునకును, లక్ష్యము లగుననియిట్లు సమన్వయించెను. ఎట్లనఁ? “కార్య కారణములకు భిన్న దేశములందునికి విరుద్ధముగుచో నసంగతి యగు” నని కదా చెప్పఁబడినది. “తెలిసికొనును, కోరును, యత్నించును, చేయును,” అను క్రమమున కార్యమును గూర్చి యిచ్ఛకు కారణత్వ ముండనే యున్నది కనుక ప్రకృతమున కారణమగు పారిజాతరాహిత్యచికీర్ష భూమియందును కార్యమగు పారిజాత రాహిత్యము స్వర్గమందును నుండుటచే మొదటి యసంగతికి దీనికి భేదమేమియు లేదు.

ఇట్లే మూడవ యసంగత్యుదాహరణము పంచమ విభావనాలక్షణమునకు లక్ష్యమగును.

విరుద్ధకారణమునుండి కార్యముపుట్టుట ఐదవవిభావన. గోత్రోద్ధారహేతువు కావున గోత్రోద్ధృద విరుద్ధమగు గోత్రోద్ధారవిషయక ప్రవృత్తిచే గోత్రభేదనోత్పత్తి చెప్పఁబడినది ఏతావతా తృతీయాసంగతి భేదము పంచమ విభావనలో నంతర్భవించుటచే దానిని జెప్పుట సంగతము కాదు.

లందుఁ దిలకము ననునవి నూతనాలంకారము లగు
చున్నవి.

ఓ సర్వేశ్వరా ! ముల్లోకముల మోహమును బోఁగొట్ట
నీరూపము (కృష్ణస్వరూపము)ను దాల్చియు నిరవధిక
కాంతిరస సముద్రమగు నీరూపము చేతనే ముద్దరాం
డ్రకు మోహమును బెంపొందించుచున్నావు.

ఇచట మొదటి యుదాహరణమునఁ గంకణాదులను హస్తాదులం
దుంచుట ప్రసిద్ధము కనుక చెప్పలేదు. అగుధాతువుచే నగుటకుపకరించు
కార్యరూపమగు వేఁటుచోఁజేత ఆకర్షింపఁబడును గావున లక్షణసంగతి.

## 38. విషమాలంకారము.

అన్యోన్య మననురూపములగు పదార్థములకు సంబంధము
వర్ణింపఁబడినచో విషమాలంకార మగును.

ఉ॥ ఈశిరీష మృద్వంగి యెక్కడ? అట్టి మదనజ్వర మెక్కడ?

ఇచట అతి మృదువగుటచేతను నతిదుస్సహమగుటచేతను ననను
రూపములగు నంగనా మదనజ్వరములకూర్పు విషమము.

‘‘ చంద్రుఁడా ! మృగాక్షి మోముగోముతో సాదృశ్య

---

ఇట్లే ‘ నేత్రములందు కంకణము ’ ముల్లోకముల మోహము నిత్యాదియందును,
కంకణత్వ నేత్రాభరణత్వములకు, మోహనివర్తకత్వ మోహజనకత్వములకు విరుద్ధములగు
వానికి ఒకచో నునికి చెప్పుటచే విరోధాభాసాలంకారమగుటయే తగును గాని యసంగతి
భేదముగఁ జెప్పుట తగదని.

దీనికి చంద్రికాకారు డేదో సమాధానము చెప్పెను కాని యది యంత తృప్తి
కరముగ లేకుండుటచే ననువదింపలేదు.

88. అభిలషసి యదీందో ! వక్త్రలక్ష్మీం మృగాక్ష్యాః
పునరపి సకృదబ్ధౌ మజ్జ సంక్షాళయాంకమ్
సువిమలమథ బింబం పారిజాతప్రసూనై
స్సురభయ వద నో చేత్త్వం క్వ తస్యా ముఖం క్వ ॥

మును గోరుదువేని తిరిగి సముద్రములో మునుఁగుము. మచ్చను గడిగికొనుము. పిదప స్వచ్ఛమగు బింబమును బారిజాతపుష్పములతోఁ బరిమళింపఁ జేసికొని మృగాక్షి మోముపోలిక నొందితివని చెప్పుము. లేనిచో నీవెక్కడ? ఆమెమోమెక్కడ?

మొదటిచోట వస్తువుండగాఁ గూర్పుట, ఇటఁజంద్రునకు వదనలక్ష్మికి నూహింపఁబడినకూర్పు. ఇదిభేదము.

కారణమునకు విలక్షణమగు కార్యము పుట్టుట మఱొక విషమము.

ఉ॥ నీనల్లని కత్తినుండి తెల్లని కీర్తి పుట్టు చున్నది.

ఇచట కారణగుణములు కార్యమందుచొచ్చు నను న్యాయమునకు విరుద్ధముగ నల్లని కత్తివలనఁ దెల్లనికీర్తి పుట్టుట. కార్యకారణము లకు నివర్త్యనివర్తక సంబంధమున్నచో నైదవ విభావనయు, విరుద్ధగుణము కలిగినచో నీ విషమభేదమును నగునని భేదము.

ఇష్టార్థమునకుఁ బ్రయత్నించుటవలన ననిష్టప్రాప్తియు విషమమే.

ఉ॥ ఎలుక భక్ష్యమునం దాశచే పాములపెట్టెను గొఱికి పాముచే భక్షింపఁబడెను,

ఇష్టమగు నర్థమును గూర్చి ప్రయత్నించిన వాని కిష్టము సమకూర కుండుటే కాక యనిష్టముకలిగిన నదియు విషమమగును. ఎట్లంటే భక్ష్యము నొందఁగోరి సర్పపేటికను గొఱికి యందుఁ బ్రవేశించిన మూషకమునకు భక్ష్యము లభింపక పోవుటయేకాక తనకు హానియుఁ గలిగెను. మఱియు,

" కృష్ణ! నీవు గోపాలుఁడవు కావున కడుపునిండఁ బాలు

99. గోపాల ఇతి కృష్ణత్వం ప్రచురక్షీరవాంఛయా ।
శ్రితో మాతృస్తన క్షీర మప్యలభ్యం త్వయా కృతమ్ ॥

త్రాగఁగోరి నిన్నాశ్రయించితిని. నీవు తల్లి పాలుకూడ
లేకుండఁ జేసితివి. (ముక్తినిచ్చితివి.)

అర్థప్రాప్తిరూప మగు నిష్టార్థ ప్రయత్నమువలన నిష్టము లభింపక పోవుటలోను ననిష్టము లభించుటలోఁగూడ నిది యుదాహరణము.

అనర్థ పరిహార రూపేష్టార్థమునకై ప్రయత్నమువలన నారెంటికి నుదాహరణము.

భూమిమీఁద సైంహికేయ భయమున నాకాశమందు
చంద్రు నాశ్రయించిన శశమునకు దాని యాశ్రయమున
కును నాసైంహికేయుని (రాహు)వలన భయము సంభ
వించెను. ప్రేయసీ! చూడుము.

ఇక్కడ శశమునకు బాలసింహమువలని యనర్థపరిహారము లభింపమి మాత్రమే కాక స్వాశ్రయమగు చంద్రునకు గూడ రాహువువలన ననర్థము సంభవించెను.

వతులకు బాధకలిగించుట యనునిష్టార్థమునకుఁ బ్రయత్నముచేయు నాయుభయము కలుగుట కుదాహరణము.

రావణుఁ డాంజనేయునితోఁకను గాల్పఁగోరి దాని నంటిం
పఁగా దానివలన నిప్పుడు తనపురము మాత్రము కాలి
పోయెను.

పురముమాత్ర మను నేవకారార్థముచేఁ బరుల కనిష్టములేమి స్పష్టమయ్యెను. 'అనిష్టముయొక్క ప్రాప్తియు' నను వాక్యమునం దనిష్టప్రాప్తికను పదమునకు నవ్యర్థకమగు 'యు' శబ్దముచే గ్రహింపఁబడిన ఇష్టానవాప్తి శబ్దమునకును విషమపదముతోఁ బ్రత్యేకము నన్వయము. అట్లన్వయించుటచేఁ గేవలానిష్టప్రాప్తి కేవలేష్టానవాప్తియు నని వేర్వేఱుగ విషమాలంకారద్వయము చూపఁబడినది.

వానిలో ననిష్టప్రాప్తిమాత్ర మెట్లన

100 పద్మాతపత్ర ప్రియవగు నోతన్వీ! దిగుడు బావిలో
తామరగింజను వేయఁగోరుచుంటివా? వెఱ్ఱిదానా! ఇది
కలికాలము. లోకము కృతజ్ఞము కాదు. ఈ పద్మము
నీముఖకాంతినే హరించును.

ఇచట పద్మాతపత్రమును బొందు కోరికతో తామర విత్తనము
నాటిన యామె కాలాభ ముండనేయున్నది. అధికముగ ముఖకాంతిని
హరించుట యను ననిష్టప్రాప్తియుఁ గలిగెను.

ఇష్టానవాప్తిమాత్ర మెట్లన ?

కృష్ణ! డస్సితివి. కొండను వీడుము. మేము భరింతు
మని గోపకులు పలుకఁగా నతడు పట్టువిడువ బరువుచే
వారిబుజములు వంగి వ్యర్థముకాఁగా నవ్వుచున్న విష్ణువు
విజయము నొందుగాక.

ఇచ్చట, నాలోచింపగా గొండ మీఁద పడుట యను ననిష్టప్రాప్తి
ప్రసక్తమైనను భగవంతుని కరకమలస్పర్శ మహిమచే నది కలుగలేదు.
శైలధారణ రూపేష్టానవాప్తి మాత్రమే సంభవించెను. మఱియు,

1 ఓతన్వీ! మృగాంకుఁడు లోకమునఁదన కలంకమును
బోగొట్టుకొనుటకు నీముఖముగాఁ బుట్టెను. నీవోయు
నందును దిలకవ్యాజమునఁ గలంకమును గల్పించు
చున్నావు. స్త్రీలాశ్రితునిఁ గలంకిఁగాఁ జేయుదురుగదా!

100. పద్మాతపత్రరసికే సరసీరుహాస్యా, కిం బీజమర్పయితుమిచ్ఛసి వాపికాయాం
కాలః కలిర్జగదిదంన కృతజ్ఞమజ్ఞే, స్థిత్వాహరిష్యతి తవైవ ముఖస్యలక్ష్మీమ్॥

1. లోకే కలంకమపహాతుమయం మృగాంకో,
జాతో ముఖం తవపున స్తిలకచ్ఛలేన ।
తత్రాపి కల్పయసి తన్వి కళంకరేఖాం
నార్యస్సమాశ్రితజనంహి కళంకయంతి ॥

ఇచట ననిష్ట పరిహారరూప మగు నిష్టానవాప్తి కలిగెను. మఱియు,

> [1] పుత్త్రులులేని నాకీశాపముకూడ వరమే యగుచున్నది
> గదా ! కట్టెలతో వృద్ధినొందు దహనుఁడు కృషి కర్హ
> మగు భూమినిఁ గాల్చుచున్నను బీజాంకురములఁ గను
> దానిగాఁ జేయుచున్నాఁడు.

ఇచట, సహజముగ ననిష్టమగు మునిశాపము మహాపురుషార్థ మగు పుత్త్రలాభము తప్పక కలుగునని సూచించుటచే దానిని దశరథుఁడు వరముగనే సమర్థించుటంబట్టి, పరున కనిష్టమునొందించుట యను నిష్టము లభింపమిసిద్ధము.

ఎచట నొకానొకఁడు తనకార్యమునకై మఱొకనిఁ బంపగా నతఁడు నియోగించిన కార్యము నుపేక్షించి తనకార్యమునే సాధించుకొనునో అచట గూడ నిష్టానవాప్తి రూపవిషమాలంకారమే యగును. ఎట్లు?

> ప్రియునికొఱ కంపఁబడినదూతి యతనియందే సక్త
> యయ్యెను. సఖులారా ! నా తెలివితక్కువనుగాని
> యదృష్ట ఫలమునుగాని చూడుఁడు.

అతనియందే లగ్నయయ్యె ననుటచే నాయకునందు దూతికిఁగల స్వేచ్ఛ చూపఁబడినది. మఱియు,

> [3] నపుంసకముకదా ! యని ప్రియకై మనస్సు పంపఁబ
> డెను. ఆమన సన్ననో యామెయందే క్రీడించుచున్నది.
> పాణినిచే మనము మోసగింపఁబడితిమి.

---

1. శాపోప్యదృష్టత యానన పద్మశోభే, సానుగ్రహో భగవతా మయిపాతితోయం ।
కృష్యాం దహన్నపి ఖలు క్షితిమింధనేద్ధో, బీజప్రరోహజననీం దహనః కరోతి ॥

3 నపుంసకమితి జ్ఞాత్వా ప్రియాయై ప్రేషితం మన ॥
తత్తు తత్రైవ రమతే హతాః పాణినినా వయమ్ ॥

ఇవి యన్నివిధముల నిష్టానవాప్తి కుదాహరణములు. ఒకానొక ప్పుడు ఇష్టావాప్తితోఁగూడిన యిష్టానవాప్తి కుదాహరణము. దీక్షిత కృతవరదరాజస్తవమందు,

⁴ ఓదేవ ! సూర్యుఁడు నీచరణ కిరణకాంతియం దాసచేఁ దనకిరణ సమూహమును రాత్రులలో ప్రభాతపర్యంత మగ్నియందుకాల్చి యాకిరణ సమూహ మగ్నినుండి యెత్తగా నించుకనేపు రక్తముగ నుండుటచే నీతఁడు వీతసంతాపుఁ డగుచు నంతలో నెఱుపు తగ్గగా నను దినము సంతాపము నొందుచునే యుండెను. మఱియు,

⁵ ఓ శ్రీహరీ ! ఈచంద్రుఁ డంబుజకోశముయొక్క ముద్రా భంగముచే నధికశోభనొందిన మిత్రకరముల లాభముచే బూర్ణిమనాఁడు నీవదనసామ్యము నొందియుఁ గ్రమ ముగా క్షీణించుచు నన్యాయార్జిత విత్తమప్పుడే నశించు నని చెప్పుచున్నాఁడు.

ఇచట మొదటియుదాహరణమున సూర్యకిరణముల కగ్నిప్రవేశన మాగమసిద్ధము. సూర్యుఁడు తన కిరణములందు భగవంతుని చరణ కిరణములతో సదృశమగు నరుణిమను బొందఁగోరి వాని నగ్నియందుఁ

4. భానుర్నిశాసు భవదంఘ్రిమయూఖశోభా
లోభాత్ప్రతాప్య కిరణోత్కర మాప్రభాతమ్ ।
తత్రోద్ధృతే హుతవహా త్తరుణలుస్తరాగే
తాపం భజత్యనుదినం సహి మందతాపః ॥

5. త్వద్వక్త్రసామ్యమయ మంబుజకోశముద్రా
భంగా త్తతత్సుషమమిత్ర కరోపకప్తాః శ్రీ
లబ్ధ్వాపి పర్వణి విధుః క్రమహీయమాన
శ్శంసత్యనీత్యుపచితాం శ్రియమాశు నాశామ్ ॥

గాల్చినట్లు కల్పించి వాని కుదయకాలమందుండు నరుణిమను గాల్చి తీసిన బాణములకువలె నగ్ని సంతాపనమువలనఁ గలిగిన యరుణిమనుగాఁ గల్పించి సూర్యున కంత ప్రయత్నముచేఁగూడ దాత్కాలికేష్టప్రాప్తియే కాని సార్వకాలికేష్టప్రాప్తి లేదని చూపఁబడినది.

రెండవయుదాహరణమున భగవంతుని ముఖశోభ నొందఁగోరు చంద్రునకు మిత్రశబ్దశ్లేషచే సూర్యుని స్నేహితునిగాఁ గల్పించి సూర్యకిరణమునకు కమలకోశవికాసనమును చంద్రానుప్రవేశనమును, సుహృత్వాశ భగవంతుని ముఖసంపన్నిధాన మగు కోశగృహముయొక్క ముద్రామోచనము చేసి దానినుండి గ్రహించిన భగవంతుని ముఖకాంతితోఁ జంద్రు నలంకరించుటకై చేసిన చన్ద్ర స్పర్శ రూపమునుఁ గల్పించి, యంతగొప్పప్రయత్నము చేసినను బూర్ణిమనాడుమాత్రమే భగవంతుని ముఖసామ్యరూప మగు నిష్టావాప్తి కలుగుచున్నది కాని సార్వకాలికేష్టప్రాప్తి కలుగలేదని చూపఁబడినది.

ఒకానొకచో నిష్టావాప్తి లేకున్నను నిష్టప్రాప్తి కలుగుచున్నదను భ్రమవలనఁగూడ చమత్కారవిశేషము కలుగుచున్నది.

‘ ఓ భల్లాలభూపాల ! నీ శత్రునగరమునఁ దిరుగుచున్న భిల్లాంగన చెదరిపడిన రత్నములం దీసికొని చంద్రనిప్పులనుకొని వానిమీఁద మంచిగంధపు తునకలనుంచి కన్నులు మూసికొని యూదుచుండగా శ్వాసామోదమునకు వచ్చిన తుమ్మెదగుంపును జూచి ధూమభ్రమ నొందెను.

---

6. భల్లాలక్షోణిపాల త్వదహితనగరే సంచరంతీ కిరాతీ
రత్నాన్యాదాయ కీర్ణాన్యురుతర ఖదిరాంగార శంకాకులాంగీ ।
క్షిప్త్వా శ్రీఖండఖండం తదుపరి ముకులీ భూతనేత్రాధమంతీ
శ్వాసామోదప్రసక్తైర్మధుకరపటలైర్ధూమశంకాం కరోతి ॥

ఇచట నెక్కువగా నగ్నిని సంపాదించు ప్రయత్నమువలన నది లభింప కున్నను లభించినదను భ్రాంతి ధూమభ్రమనొందెననుటచేఁ జూపఁ బడినది.

## 39. సమాలంకారము

పరస్పరము ననురూపములగు రెండువస్తువుల సంబంధము వర్ణింపఁబడినచో సమాలంకార మగును.

ఉ॥ మంచిహారము కుచమండలమును, దనకుఁ దగిన చోటుగాఁ జేసికొనెను.

ఈసమాలంకారము ప్రథమవిషమమునకుఁ బ్రతిద్వంద్వి యగును. మఱియు,

ఓనరసరాజ ! చంద్రమండలమును గాముదివలెను, శివుని గంగవలెను, గీర్తి యనురూపుఁడవగు నిన్నాశ్రయించి ప్రకాశించుచున్నది. మఱియు,

ఇది చిత్రముచిత్రము ఆశ్చర్యమాశ్చర్యము గొప్ప చిత్రము విచిత్రము. వేపచెట్ల కాస్వాదనీయమగు ఫలసమృద్ధియు దానిందిననేర్పుగల కాకలోకమును, తగినట్లు గూర్చుటచే బ్రహ్మ దైవవశమునఁ గృతార్థుఁ డయ్యెను.

మొదటి యుదాహరణము స్తుతిలోఁ బర్యవసాన మొందును. ఇది నిందయందుఁ బర్యవసన్నమగును. ఇది భేదము

---

7. చిత్రం చిత్రం బత బత మహచ్చిత్ర మేతద్విచిత్రం
జాతో దైవాదుచితఘటనా సంవిధాతా విధాతా।
యన్నింబానాం పరిణతఫలస్ఫీతి రాస్వాదనీయా
యచ్చైతస్యాః కబళనకళాకోవిదః కాకలోకః॥

కార్యమునకు గారణముతో సమాన రూపత్వముకూడ
సమమే యగును.

ఉ॥ ఓలక్ష్మి! ఉప్పునీటిలోఁ బుట్టిన నీకు నీచాసక్తి తగినదే.

ఇది ద్వితీయవిషమము నకుఁ బ్రతిద్వంద్వి యగును. మఱియు,

కారుచిచ్చునుండి పుట్టినపొగ మబ్బై వానచేఁ గార్చిచ్చు
నార్పుచున్నది. ఇదిన్యాయమే. కానఁబుట్టినచిచ్చు
కాననమును గాల్చుటలేదా? మఱియు,

మొదట హాలాహలాగ్నిచేయూత నొంది బాల్యమున
హరునినేత్రాగ్నితో మైత్రిఁ జేసి యౌవనమున రాహు
ముఖవిషముచే నంతరంగీకృతుఁ డగు నీచంద్రుఁడు నన్ను
కిరణములచే బాధించుచున్నాఁడు. ఇది తగినదే.

మొదటి యుదాహరణమునఁ గారణ స్వభావాను రూపము
కార్యము. ఇచట కారణీభూత దుష్టసంసర్గానురూపము కార్యమని
భేదము.

ఒక కార్యమునకుఁ బ్రయత్నింప ననిష్టము లేకుండ నది
సిద్ధించినను సమమగును.

ఉ॥ వారణార్థి వగునీకు వారణలాభము యుక్తము
కాకుండునా?

ఈ సమాలంకారము ఇష్టప్రాప్తివలన, అనిష్టము సంభవింపక పోవుటం
బట్టియు, అనిష్ట ప్రాప్తియు ననుచోటి 'యు' శబ్దముచే సంగ్రహింపఁ
బడిన విషమత్రయమునకు బ్రతిద్వంద్వి. ఇచ్చట గజార్థియై రాజు
నాశ్రయించుచు, ద్వారపాలురచే వారింపఁబడు వానింగూర్చి పరిహాస

8. ఆదౌ హాలాహలహుతభుజా దత్తహస్తావలంబో
బాల్యే శంభోర్నిటలహుతాసా బద్ధమైత్రీ నిరూఢః ।
ప్రౌఢో రాహోరపి ముఖబిలే నాంతరంగీకృతోఽయ
స్సోఽయం చంద్రస్తపతి కిరణైర్మామితి ప్రాప్తమేతత్ ॥

వచన మీయుదాహరణము. ఇచట రాజద్వారమునందు క్షణమాపుట తలంపబడినదే కనుక దానినంగీకరించి ప్రవర్తించువానికి విషమోదాహరణము లందువలె తలంపకయె మహానర్థము సంభవింపక పోవుటంబట్టి, యనిష్టమగు వారణము ప్రాప్తమైనది కదా! యిది యుదాహరణ మెట్లగునని సందేహింప నవసరములేదు.

ఇంతియకాక తలంపని గొప్ప యనిష్ట ముండినను శ్లేషమహిమచే నిష్టార్థప్రాప్తి యున్నచోటను సమాలంకారము తప్పనిదే. ఎట్లన,

ఓరాజా! ఉన్నతగజములమీఁద నూరేఁగఁగోరి చిరకా
లమునుండి నిన్నాశ్రయించి యిచట నుంటిని. నీవును
నాకా 'యుచ్చాటనముఁ జేసితివి. గొప్పవారిసేవ వ్యర్థము
కాదుగదా!

---

9. ఉచ్చైర్గజైరటనమర్థయమాన ఏవ
త్వామాశ్రయన్నిహ చిరాదుషితోఽస్మి రాజన్ ।
ఉచ్చాటనం త్వమపి లంభయసే తదేవ
మామద్య నైవ విఫలా మహతాం హి సేవా ।

ఉచ్చాటనము = దూరముగ వెళ్లఁగొట్టుట, ఎత్తగు నేనుగులమీద నూరేగుట, పై విషయమున జగన్నాథుఁడిట్లు దోషమును జూపుచున్నాడు. అప్పయ దీక్షితులు 'వ్యాజస్తుతియందు స్తుతిచే నిందాభివ్యక్తి వివక్షింపగా విషమాలంకారము' అని చెప్పెను అది సరికాదు. ఎందుచేత? ఈపద్యమున వ్యాజస్తుతిలోని నిందవలన విషమాలంకారమెట్లు కలుగును? నిందామూలమున నేకదా విషమాలకారముండును. వ్యాజస్తుతిచేతనే చమత్కారము పూర్తియగుచుండెను కాని విషమాలంకారముచేత కాదు. అని,

దీనికి జవాబుగనే చంద్రికామర్మప్రకాశకర్తలు - ఉచ్చాటనశబ్దముచే దూరముగ వెళ్లఁగొట్టుటయను ననిష్టార్థమును గ్రహించినప్పుడే 'అనిష్టముయొక్క ప్రాప్తియు విషమమే' అను విషమాలంకారము తోఁచును. పిదప నిందతోఁచును. తదనంతరము వ్యాజస్తుతి యగును. ఏతంచ విషమాలంకారము వ్యాజస్తుతి కంగమగుటవలన నంగాంగిభావముచే సంకరము. దానివలన విషమాలంకారము నుండు ననిరి.

ఇచట నాలోచింపగా వ్యాజస్తుతియందు స్తుతిచే నిందాభివ్యక్తి వివక్షింపగా విషమాలంకారమయ్యు మొదటిదగు స్తుతిరూపవాచ్యమును వివక్షించినచో సమాలంకారము కాకతప్పదు.

ఇట్లే నిజమగు నిష్టప్రాప్తి యున్నను శ్లేషచే నసత్యమగు ననిష్టార్థప్రసిద్ధియున్నచోటఁగూడ సమాలంకారమునకు హానిలేదు. ఎట్లన,

[10] నఖలుశస్త్రము కర్తవ్యము. అనితండ్రిచే నియమింపఁబడి
యాశస్త్రమునే చేసెను. తండ్రియాన తప్పలేదు.

ఇచట తండ్రియాన తప్పలేదనుటచే విరోధాలంకారము వ్యక్తమగుటకై 'నఖలు' అనుచో (సంస్కృతమున న,ఖలు) పదద్వయ విభాగరూపమగు రూపాంతరముయొక్క వివక్ష యున్నను నఖమును గోయునది నఖలు అను నేకపదముచే వాస్తవికార్థాంతరము కల రూపాంతరమును గ్రహించినచో సమాలంకారము నుండనే యున్నది.

---

ఈ విషయమున దీక్షితులవారి యద్యపీత్యాది మూలవాక్యప్రభావ మిదియని తోచును.

పై పద్యవిషయమునందే విషమాలంకారముకూడ నున్నది. విరుద్ధమగు సమవిషమాలంకారముల కొక్కచోటునికి యెట్లు? అంశమాత్రమును గ్రహించి. ఆయంశ మెద్ది యన? "గొప్పవారిసేవ వ్యర్థముకాదుకదా" అను నర్థాంతరన్యాసముచే జెప్పఁబడిన వాచ్యార్థ మగుస్తుతిరూపము, దానికనుగుణముగ ఉచ్చాటనశబ్దశ్లేషచే లభించిన ఉన్నతగజాటన రూపము, నగు స్తుతిరూపార్థము. ఈయంశము సాధారముగఁగొని సమాలంకారము.

ఉన్నతగజాటనమును గోరి నిన్నాశ్రయించిన నాకుచ్చాటనము (దూరముగఁ బంపుట) నొసగితివి. నేను నీచసేవ చేసితిని. ఇసీ! అని తోచుచున్న నిందారూపార్థమునుబట్టి ఇష్టార్థమునకుద్యమించి ననిష్టప్రాప్తి రూపవిషమాలంకారము నుండును. ఈ విధముగ రెండలంకారములున్నను స్తుతిరూప వాచ్యార్థమును మాత్రము గ్రహించిన సమాలంకార ముపపన్నమగును.

10. శస్త్రం నఖలు కర్తవ్యమితి పిత్రా నియోజితః ।
తదేవ శస్త్రం కృతవాన్పితురాజ్ఞా న లంఘితా ॥

శ్లేషచేఁ బ్రాప్తమగునది, నిజముగ లేనిదియునగు నిష్టప్రాప్తి ప్రతీతి మాత్రముచేఁ గలుగు సమాలంకారమున కుదాహరణ మిదివఱకే చెప్పఁ బడినను 'వారణలాభము యుక్తమనుచో నల్పానిష్ట ప్రతీతియు' 'ఉన్నత గజముల మీఁదో అనుచో నుత్కటానిష్ట ప్రతీతియు నుండుటచే నుదాహరణాంతరమును జెప్పుచున్నాఁడు.

[11] ఓతన్వీ! తపము సుగతికి మగు ననుమాట నిజము. పద్మము నీటియందు సూర్యునిఁ జూచుచుఁ దపమొన రించి నీపాదముగఁబుట్టి యన్నికమలములకంటె సుంద రమై యుత్తమగతి ననుభవించుచున్నది.

## 40. విచిత్రాలంకారము.

తనకోరికకు విపరీతమగు ప్రయత్నము చేసినట్లు వర్ణిం చిన విచిత్రాలంకార మగును.

ఉ॥ సత్పురుషులు మూడులోకములలోని జనులకంటె నున్న తిని బొందఁగోరి యణమణఁగి యుందురు. మఱియు, దేవా! ఖలవదనమును మలినముగాఁ జేయుటకు నీకీర్తి లోకములను నిర్మలము చేయుచున్నది. మిత్రుల సంతోష పెట్టుటకు నీప్రతాపము మిత్రునిగూడ నెదుర్కొను చున్నది.

## 41. అధికాలంకారము.

విశాలమగు నాధారముకంటె నాధేయము నధికముగ వర్ణించుట యధికాలంకారము.

ఉ॥ బ్రహ్మాండనివాస మగుసముద్రమందు నీగుణము లిముడవు.

---

11. సత్యం తపస్సుగత్యై యత్త్వాంబుషు రవిప్రతీక్షం సత్ ।
అనుభవతి సుగతిమబ్జం త్వత్పదజన్మని సమస్తకమలీయమ్ ॥

ఇచట సముద్రమున ననంతబ్రహ్మాండములు బుద్బుదప్రాయములని యాధారమున కతివైశాల్యము చెప్పి యందు నీగుణము లిముడవని యాధేయములగు గుణముల కాధిక్యము వర్ణింపఁబడినది. మఱియు,

[12] ప్రలయకాలమునఁ బ్రపంచము నిముడ్చుకొన్న శ్రీకృష్ణుని శరీరమున లోకములు సవికాసముగ నుండెను. కాని యచట నారదాగమమువలనఁ గలిగినసంతోష మిముడ దాయెను. గొప్ప ఆధేయముకంటె నాధారము నెక్కువగ వర్ణించుటయు నధికమే.

ఉ॥ ఓ దేవ! ఈ నీగుణములకు విశ్రాంతిస్థానమగు వాగ్బ్రహ్మ మెంతటిదని చెప్పఁగలము?

ఇచట ఈ నీగుణములని ప్రత్యక్ష దృష్టమగు మహావైభవముతోఁ గూడినట్లు చెప్పఁబడిన గుణములకు విశ్రాంతిస్థాన మనిసుస్థితినిఁ దెల్పుటచే నాధారమగు వాగ్బ్రహ్మ కాధిక్యము వర్ణింపఁబడినది. మఱియు,

మహారాజా! త్రిభువన గర్భ మెంతవిశాలమైనది! నీకీర్తి యపరిమితమైనను నిం దిముడుచున్నదే!

ఇచట నాలోచింపగా రెండుదాహరణములందున వాగ్బ్రహ్మ మెంతటిది! త్రిభువనగర్భ మెంతవిశాలమైనది! అని ఆధారములు ప్రశంసింపఁ బడుచున్నను అల్పములుగా సిద్ధమగు శబ్దబ్రహ్మ భువనోదరములు గుణయశోరాసులకంటె గొప్పవగుటచే నధికరణములగాఁ గల్పించియు ప్రశంసించుటచే వానిప్రశంస ప్రస్తుత గుణ యశోరాశి ప్రశంసయందే పర్యవసాన మొందుచున్నది.

## 42. అల్పాలంకారము.

సూక్ష్మమగు నాధేయముకంటె నాధారము సూక్ష్మమని వర్ణించిన నల్పాలంకారము.

ఉ॥ మణిమయాంగుళీయక మిప్పుడు నీకరమున జపమాలగా నున్నది.

12. యుగాంతకాల ప్రతిసంహృతాత్మనో, జగంతి యస్యాం సవికాసమాసత ।
తనౌ మముస్తత్ర న కైటభద్విష స్తపోధనాభ్యాగమసంభవా ముదః ॥

ఇచట రత్నపుటుంగర మంగుళి మాత్రపరిమితమగుటచే సూక్ష్మము. అదియు విరహిణీకరమున కంకణమువలెఁ బ్రవేశించి జపమాలవలె వ్రేలుచున్నదనుటచే నుంగరము కంకణము గరము విరహముచేఁ గృశించి సూక్ష్మముగ నున్నదని చూపఁబడినది. మఱియు,

నీనడుము కంకణము సన్నమగు తామరదారముకూడ
నీచనుగవనడుమ నిముడకున్నది.

## 43. అన్యోన్యాలంకారము.

పరస్పర ముపకారముచేసికొన్నట్లు వర్ణించిన నన్యోన్యాలంకార మగును.

ఉ॥ రాత్రి చంద్రునిచేఁ బ్రకాశించును. చంద్రుడు రాత్రిచేఁ బ్రకాశించును. మఱియు;

[13] పాటసారి పైకిఁ (ప్రపాపాలికను) జూచుచు విరళాంగుళియై నీరు త్రాగుచున్నాఁడు. అట్లే ప్రపాపాలికయు నీటిధారను సన్నము చేయుచున్నది.

ఇచట పథికుఁడు తనయందాసక్తితోఁ బానీయదానవ్యాజముచేఁ జాలకాలము తనమోమును జూడఁగోరినకాంతకు వ్రేళ్లెడముచేసి చాలసేపు నీరుపోయుట కవకాశముఁ గలిగించుటచే నుపకారము చేసెను. అట్లే ప్రపాపాలికయు జలపానవ్యాజముతోఁ దనముఖమును జూడఁగోరు పథికునకు నీరు సన్నధారతోఁ బోసి చాలసేపు నీరు త్రాగుట కవకాశము గల్పించుటచే నుపకారము చేసెను. ఇట్లిద్దఱి కార్యముల చేతను వారివారి కుపకారమున్నను బరస్పరోపకారముఁకూడఁ దప్పింపరానిదే.

## 44 విశేషాలంకారము

ఆధారము లేకుండఁగ నాధేయ మున్నట్లు వర్ణించిన విశేషాలంకార మగును.

---

13 యథోర్ధ్వాక్షః పిబత్యంభః పథికో విరళాంగులిః
తథా ప్రపాపాలికాపి ధారాం వితనుతే తనుమ్ ॥

ఉ॥ సూర్యుఁడస్తమించినను దీపములందున్న సూర్యకిరణ ములు చీకటినిఁ బోఁగొట్టుచున్నవి. మఱియు,

[14] నీరులేనిచోట గమలము దానియందు కువలయములు ఇవన్నియును బంగారుతీగ యందునున్నవి. ఆబంగారు తీగయు సుకుమార సుందరము. ఈ యుత్పాతపరంపర యేమి? చెప్పుము.

ఇచట మొదటి యుదాహరణమునఁ బ్రసిద్ధాధారమగు సూర్యుఁడు లేకున్నను దత్కిరణములకు దీపమందునికి చెప్పఁబడినది. రెండవదాని యందుఁ బ్రసిద్ధాధారము సలిలము లేకున్నను గమల కువలయములకు నేఁటిచోటస్థితి చెప్పఁబడినది.

ఒకచోటఁ బ్రసిద్ధాధారములేనివాని కాధారాంతరము లేకయే ప్రలయ పర్యంతస్థితి వర్ణించుట కలదు. ఎట్లన,

స్వర్గమున కేఁగినయాకవుల గొప్ప కావ్యములు కల్ప పర్యంతము లోకముల సంతసింపఁ జేయుచున్నవి. అట్టి కవు లేల పూజ్యులు కాకుందురు?

ఇచట కవులు లేకున్నను వారి కావ్యముల కాధారాంతరమును జూపకయే ప్రలయపర్యంతస్థితి వర్ణింపఁబడినది.

ఒకవస్తు వనేకస్థలములందు వర్ణింపఁబడుచున్నను విశేష మగును.

ఉ॥ లోపల, వెలుపల, ముందర, వెనుక అన్ని దిక్కు లందు నాకామెయే కనఁబడుచున్నది. మఱియు,

వత్స! రామ! మనసునుండి బయటికేఁగలేదు. అన్నిదిక్కు

---

14. కమలమనంభసి కమలే కువలే ఏతాని కనకలతికాయామ్
సాచ సుకుమారసుభగేత్యుత్పాతపరంపరా కేయమ్ ॥

లందు నీవు గనఁబడుచున్నావు. నాసంతాపముచేతనే వన మునకేఁగితివని యూహింపఁ బడుచున్నావు.

మూఁడవభేదమును దెల్పుచున్నాఁడు.

ఒక కార్యమున కారంభముచేయ మఱొకయశాక్య కార్యమగునట్లు వర్ణించుటయు విశేషాలంకార మగును.

రాజ! నిన్నుఁ జూచుచున్ననాకు కల్పవృక్షము కనఁబడు చున్నది. మఱియు,

స్ఫురద్రూపము ఉత్కటప్రతాపాగ్ని నిరవద్యవిద్యయుఁ గలనిన్ను సృజించువిధిచేఁ గ్రొత్తమదనుఁడు నూతన సవిత నవగురువు సృజింపఁబడెను.

ఇచట మొదట రాజదర్శన కార్యముచేఁ గల్పవృక్షదర్శన రూపాశక్యకార్యాంతరకృతియు రెండవదానియందు రాజ సృష్టికార్యప్రారంభముచే మదనాది సృష్టి రూపాశక్య వస్త్వంతరసృష్టియు నుండుటచే విశేషాలంకారము.

## 45 వ్యాఘాతాలంకారము

ఒకకార్యమును సాధించువస్తువునే తద్విరుద్ధ కార్యమును సాధించుదానిగా వర్ణించినచోనది వ్యాఘాత మగును.

ఉ॥ ఏపుష్పములచే లోకము సంతోష పడుచున్నదో వాని చేతనే కుసుమాయుధుఁడు లోకమును బాధించు చున్నాఁడు.

ఏది లోకమున నొకదానికి సాధనముగఁ బ్రసిద్ధమగునో దాని నొకా నొకఁడు తద్విరుద్ధ సాధనముగఁ జేసినట్లు వర్ణించినచోగాని, ఒకనిచేనేది యొక కార్యమునకు సాధనముగఁ గ్రహింపఁబడెనో వానివిరోధిచే నదే

తద్విరుద్ధ కార్యసాధనముగఁ జేయఁబడినట్లు వర్ణించినచో నదిగాని వ్యాఘాతమగును. అందు మొదటి దుదాహరింపఁబడెను, రెండవదెట్లన,

[15] హరుని చూపుచేఁగాల్పఁబడిన మన్మథుని యువతులు
తమ చూపుచేతనే బ్రతికించి విరూపాక్షుని జయించిన
యావామలోచనలను స్తుతింతును.

సౌకర్యమునకై కూర్పఁబడిన క్రియ కార్యవిరుద్ధమైనను
వ్యాఘాతమే. తండ్రీ! బాలుఁడనని నాయందు దయ
యుండిన నేను విడరానివాఁడనే.

కార్యవిశేషోత్పాదకముగ నొకనిచే నూహింపఁబడినయర్థము మఱొకనిచేఁ దద్విరుద్ధక్రియాసౌకర్యముగ సమర్థింపఁబడినచో నదియు వ్యాఘాతము. కార్యవిరుద్ధక్రియయందు సౌకర్యమన? కారణమునకత్యంతమనుగుణమగుట. ఎట్లన, చైత్రయాత్ర కేఁగురాజుచే యువరాజును రాజ్యమునందుంచుటకుఁ గారణముగ నూహింపఁబడిన బాల్యము ప్రత్యుత తద్విరుద్ధముగ తనతోఁదీసికొనిపోవుటకే కారణమగుటవలన యువరాజుచేఁ బరిత్యాగ మయుక్తమని సమర్థింపఁబడుచున్నది. మఱియు,

[16] లుబ్ధుఁ డగునరుఁడు దారిద్ర్యభీతిచే ధనము వీడఁడు.
ఆభీతి చేతనేగదా! దాతయు నర్థము నిచ్చును!

ఇచట పూర్వోక్తార్థములు ఇద్దఱియొక్క పక్షప్రతిపక్ష వాక్యములు కావున లక్షణసమన్వయము. లోభి ఐహికదారిద్ర్య భీతిచేతను దాత యాముష్మికదారిద్ర్యభీతిచేతను ధనము వీడకుండుట వీడుట యను కార్యములఁ జేయుచున్నారు.

15. దృశా దగ్ధం మనసిజం జీవయంతి దృశైవయాః
విరూపాక్షస్య జయినీస్తాః స్తువే వామలోచనాః ॥

16. లుబ్ధో న విసృజత్యర్థం నరో దారిద్ర్యశంకయా ।
దాతాపి విసృజత్యర్థం తయైవ నను శంకయా ॥

## 46. కారణమాలాలంకారము

ముందు వెనుకలఁగూర్చి వెనుక ముందులు కారణములుగాఁ గూర్చుట కారణమాల యగును.

నీతిచే సంపద సంపదచే నీవి, ఈవిచే గొప్పకీర్తి, కలుగును,

ఉత్తరోత్తరములకుఁ గారణ మగు పూర్వ పూర్వవస్తువుల కూర్పుగాని పూర్వపూర్వములకుఁ గారణమగును త్తరోత్తర వస్తువులకూర్పుగాని కారణమాల యనఁబడును. మొదటిదుదాహరింపఁబడినది. రెండవ దెట్లన,

నరకము పాపమువలనఁ గలుగును, పాపము దారిద్ర్యము వలన సంభవించును. దారిద్ర్య మీాయకుండుటచే జనించును. అందుచే నీవికాఁడు కావలయును.

## 47. ఏకావళి

గృహీతముక్తరీతిచేఁ గూర్పఁబడిన యర్థపంక్తి యేకావళి యగును.

ఉ॥ ఆరాజు నేత్రములు కర్ణాంతవిశ్రాంతములు కర్ణములు భుజదండమండనములు భుజదండము లాజానులంబన మనోహరములు జానువులు రతనంపుటద్దములు.

ఉత్తరోత్తరము పూర్వపూర్వమునకు విశేషణమగుటకాని పూర్వపూర్వముత్తరోత్తరమునకు విశేషణమగుటకాని గృహీతముక్తరీతి యగును. అందు మొదటివిధముదాహరింపఁబడినది. రెండవదెట్లన,

[17] దిక్కాలాత్మ సమవిభుత్వమాకాశము, ఆకసమునవెలుగొందురవి, ఆరవికిరణముల నమృతమొసరించుచంద్రుఁడు,

---

17. దిక్కాలాత్మసమైవ యస్య విభుతా యస్తత్రవిద్యోతతే
యత్రాముష్య సుధీభవంతి కిరణా రాశేస్స యాసామభూత్ ।
యస్తత్పిత్తముషస్సు యోఽస్య హవిషే యస్తస్య జీవాతవే
వోఢా యద్గుణమేష మన్మథరిపోస్తాః పాంతు వో మూర్తయః ॥

చందురునిఁ గన్నజలము, జలపిత్తమగునగ్ని, అగ్ని కుమన్నాలందు హావిస్సనిచ్చు యజమానుఁడు, నాతనికి జీవాతువగు వాయువు, వాయువువహించుగంధమున కాశ్రయమగు పృథివి, శివుని యీ యష్టమూర్తులు నెల్ల యెడల మమ్మునోముచుండుగాత.

## 48. మాలాదీపకము

దీపకైకావళ్యలంకారముల కలయికవలన మాలాదీపక మేర్పడును.

ఉ॥ మదనునిచే నామెహృదయమున, నామెమనస్సుచే నీ యందు, నివాసము చేయఁబడెను.

ఇచట నివాసమనునొకపదమే మదనుచే నామెమనసున నివాసము చేయఁబడెను, ఆమెమనసుచే నీయందు నివాసము చేయఁబడెను, అని రెండువాక్యములం దన్వయించుచున్నది కనుక దీపకము, గృహీతము క్తరీతిం (స్మరస్థిత్యాశ్రయము హృదయము హృదాశ్రయము నీవు అని) గూర్పఁబడుటవలన నేకావళియు నుండుటచే దీపకైకావళ్యలంకారముల సంబంధ మిందున్నది. మఱియు,

[18] దేవా! యుద్ధరంగమున నున్ననీవు విల్లెక్కు పెట్టగా దేని దేనిచే నేదేది తొందరగఁ బొందఁబడినదో వినుము.

కోదండముచే శరములు శరములచే నరిశిరము దానిచే భూమండలము భూమిచే నీవు నీచే నసమకీర్తి కీర్తిచే లోక త్రయము. (పొందఁబడినది)

---

18. సంగ్రామాంగణసంగతేన భవతా చాపే సమారోపితే
దేవాకర్ణయ యేన యేన సహసా యద్యత్సమాసాదితమ్।
కోదండేన శరాశ్శరైరరిశిరస్తేనాపి భూమండలం
తేన త్వం భవతా చ కీర్తిరతులా కీర్త్యా చ లోకత్రయమ్॥

ఇచట దేనిదేనిచే నేదేది పొందఁబడిన దనుసంగ్రహ వాక్యమందున్న పొందఁబడిన దనుపదమొకటే కోదండముచే శరములు మొదలగు నాఱు వివరణవాక్యములందు వానివానికిఁదగిన లింగవచన విపరిణామముతో నన్వయించును కనుక దీపకము. శరాదులుత్తరోత్తరములకు విశేషణములగుటవలన నేకావళియు నుండుటచే దీపకైకావళీసంబంధమున్నది.

## 49. సారాలంకారము

ఒకదానికంటె నొకటి యుత్కృష్టముగ వర్ణింపఁబడిన సారాలంకారమగును.

ఉ॥ మధువు మధురము దానికంటె సుధ దానికంటెఁ గవి వాక్యము. మఱియు,

19 విష్ణుగర్భమున జగత్త్రియ మున్నది. విష్ణువు శేషునందు శయనించెను. శేషుఁడును సముద్రములో నేకదేశమున శయనించెను. దాని నగస్త్యుఁ డాచమించెను. అతఁడును నాకసమున ఖద్యోత శోభనొందెను. ఓ నరసభూప! యీ యాకసమున్ను నీకీర్తికాంత కర్ణోత్పలముగఁ బ్రకాశించుచున్నది.

ఇది శ్లాఘ్యగుణోత్కర్షను దెలుపును.

అశ్లాఘ్యగుణోత్కర్షను దెలుపున దెట్లన,

తృణముకంటె దూది దూదికంటె యాచకుఁడు లఘుతరము, కాని యాచకుఁడు గాలినర్థించు నని యది యాతనిఁ గొనిపోలేదు.

ఉభయరూప మెట్లన,

---

19. అంతర్విష్ణో స్త్రిలోకీ నివసతి ఫణినామీశ్వరే సోపి శేతే
సింధోస్సోప్యేకదేశే తమపి చులుకయాం కుంభయోనిశ్చకార।
ధత్తే ఖద్యోతలీలామయమపి నభసి శ్రీనృసింహక్షితీంద్ర
త్వత్కీర్తేః కర్ణనీలోత్పలమిదమపి చ ప్రేక్షణీయం విభాతి॥

[20] కొండ గొప్పది కొండకంటె సముద్రము సముద్రము కంటె నాకసము ఆకసముకంటె బ్రహ్మ గొప్ప, దాని కంటె నాన చాలగొప్పది.

ఇచట బ్రహ్మపర్యంతమగు వస్తువులందుండు గొప్పతనము శ్లాఘ్యగుణము, ప్రకృతార్థమగు నాశయం దశ్లాఘ్యగుణము. అందుచే నుభయము సమకూరినది.

## 50 యథాసంఖ్యాలంకారము.

క్రమముగఁ జెప్పఁబడిన పదార్థముల నాక్రమముతోడనే సమన్వయించుట యథాసంఖ్య మగును.

శత్రువును మిత్రుని ఆపదను జయింపుము సంతోషపెట్టుము పోగొట్టుము. మఱియు,

కృపణుఁడు ధనమును వీడకుండుట, తినకుండుటయు నది శరణొందెననియా ? విషమువలెఁ జంపుననియా ?

వామనాదులిది క్రమాలంకార మందురు.

## 51 పర్యాయాలంకారము

ఒకవస్తువు క్రమముగ ననేకము నాశ్రయించినట్లు వర్ణించినచోఁ బర్యాయ మగును.

ఉ॥ కామినీవదన కాంతి పద్మమును వీడి చంద్రుని పొందినది.

ఇచట నొకకామినీ వదనకాంతియే క్రమముగఁ బద్మచంద్రరూపానేకాధారముల నొందుట పర్యాయము. యద్యపి పద్మము నాశ్రయించుట

---

20. గిరిర్మహాన్ గిరేరబ్ధిర్మహా నబ్ధేర్నభో మహత్ ।
నభసోఽపి మహద్బ్రహ్మ తతో వాఞ్ఛా మహీయసీ ॥

వాచ్యము కాకున్నను పద్మమును వీడి యని పద్మ పరిత్యాగమును జెప్పుటచే మొదటి దానియాశ్రయము నూహించుటవలనఁ బర్యాయ మేర్పడు చున్నది. కావుననే,

"21 శ్రోణీబంధము కార్శ్యమును వీడుచున్నది. నడుము దానిని సేవించుచున్నది. పాదములచేఁ దరళగతులు వీడఁ

---

21 శ్రోణీబన్ధ స్త్యజతి తనుతాం సేవతే మధ్యభాగః
పద్భ్యాం ముక్తా స్తరళగతయస్సంశ్రితా లోచనాభ్యామ్ ।
ధత్తే వక్షః కుచసచివతామద్వితీయంతు వక్త్రం
తద్గాత్రాణాం గుణవినిమయః కల్పితో యౌవనేన ॥

ఈ పద్యమును కావ్యప్రకాశకారుఁడు పర్యాయాలంకారమునకు లక్ష్యముగ నొసగెను. కాని దీనిలో "కటితటి కార్శ్యమును వీడుచున్నది, పదములు తరళగతుల వీడు చున్నవి." ఇత్యాది ప్రథమ ద్వితీయ పాదములు మాత్రమే పర్యాయమునకు లక్ష్యమగునుగాని "వక్షము కుచసచివ మగుచుండెను." ఇత్యాది మూడవ పాదమున పర్యాయము లేనేలేదు. నిజమున కీ పద్యమును రచించినకవి ముఖ్యముగ నిందు కావ్యలింగమును జెప్పఁదలఁచియుండును. ఎందుచేతనన? ఈ పద్యము రాజశేఖర కవికృతమగు బాలభారత నాటకములోని ప్రథమాంకములో ద్రౌపదీస్వయంవర సమయమున ద్రుపదసభలో ద్రౌపదిని జూచిన భీముని వాక్యము. ద్రౌపదీ యౌవనప్రాదుర్భావమును వర్ణించు ప్రకరణము కావున "యౌవనముచే నామె యంగములకు గుణముల మార్పు కల్పింపబడెన"ని చెప్పఁబడినది. యౌవన మెట్లంగములకు గుణవినిమయము కలిగించెనను జిజ్ఞాస రాగా దానియర్థమును పూర్వపాదత్రయము సమర్థించుటచే కావ్యలింగము ప్రధానము. అందులోని మొదటి రెండుపాదములందు పర్యాయాలంకారమంగము. మూడవపాదమున పర్యాయ పద్ధతిని వీడి యంగములకు గుణముల మార్పుమాత్రమే చెప్పబడెను. గుణములమార్పన? గుణములవ్యత్యాసము. అవ్యత్యాస మొకవస్తువు పూర్వగుణమును వీడుటచే గాని క్రొత్తగుణమును పొందుటచే గాని కలుగును. వక్షమున పూర్వము కుచసచివత లేదు. ఇప్పుడున్నది. మోమును తొల్లి సాటిలేనిది కాదు. ఇప్పుడు సాటిలేనిది. అని చెప్పుటచే గుణవినిమయమున్ను వివరింపబడిన ట్లగును. కావ్యలింగాలంకార ముపపాదింపబడినట్లు నగును.

బడినవి. అవి కన్నులచేఁ బొందఁబడినవి. వక్షము
కుచసచివ మగుచుండెను. ముఖ మద్వితీయ మయ్యెను.
యౌవన మామెగాత్రములందు గుణవినిమయమును
గల్పించెను.

అనుచోటఁ గావ్యప్రకాశకారుఁడు పర్యాయమునుఁ జెప్పెను. అన్ని చోటుల శాబ్దపర్యాయ మెట్లన,

[22] ఓ కాలకూటమా! ఉత్తరోత్తరము ఉత్కృష్టస్థానము
నాశ్రయించు స్థితి నీ కెవ రుపదేశించిరి? మొట్టమొదట
సముద్రగర్భమునఁ నుండి, తరువాత శివుని కంఠమునఁ
బ్రవేశించితివి. ఇప్పు డన్నిటో దుష్టవాక్కుల వసించు
చున్నావు.

ఇది యంతయు సంకోచ వికాసములులేని పర్యాయము. సంకోచ పర్యాయ మెట్లన,

[23] చల్లఁదనము భూమి యందంతటను నుండి పిదప చెట్ల

---

ఇచట గుణవినిమయపదముచే రెండువస్తువులందలి గుణములమార్పు వివక్షింపఁ లేదు. అది పరివృత్త్యలంకారవిషయము. కనుకనే పరివృత్తిలక్షణమున 'అన్యోన్యము'ను పదము చొప్పింపఁబడినది. అన్యోన్యవినిమయమే వినిమయశబ్దార్థమైనచో పరివృత్తిలక్షణములో నన్యోన్యపదము వ్యర్థ మగునుగదా! ఇట్లుండ నీపద్యములో మూడవపాదమునఁ గూడ పర్యాయమే యనువారితలం పేమో తెలియరాదు.

పోనుకాని యీపద్యమున కావ్యలింగము ప్రధానమైనచో నంగమగుపర్యాయము పర్యాయోదాహరణముగ నెట్లుగైకొనెను? అన్నచో, 'త్వన్నయనసమకాంతి' ఇత్యాదియందు కావ్యలింగము ప్రధానమగుచుండినను అంగమగు ప్రతీపమును ప్రతీపోదాహరణముగ గ్రహించినట్లేయని తృప్తినొందవలెనేమో!

22. పన్థాశ్రయస్థితిరియం తవ కాలకూట కేనోత్తరోత్తర విశిష్టపదోపదిష్టా।
ప్రాగర్ణవస్యహృదయేవృషలక్ష్మణోథకంఠేఽధునావససివాచిపునఃఖలానామ్॥

23. ప్రాయశ్చరిత్వా వసుధామశేషాం ఛాయాసు విశ్రమ్య తత స్తరూణామ్॥
ప్రౌఢిం గతే సంప్రతి తిగ్మభాసా శైత్యం శనైరంతరపాయయాసీత్ ।

నీడలయందు నిలిచి యిప్పుడుష్ణరశ్మి విజృంభింపగా నీటి
లోనికి పోయి నివసించెను.

ఇచట శైత్యమున కుత్తరోత్తర మాధార సంకోచమువలన సంకోచ పర్యాయము. వికాసపర్యాయ మెట్లన,

" తన్వీ ! పూర్వము నీబింబోష్ఠముననే రాగము కనఁబడెను.
ఇప్పుడో బాలకురంగాక్షీ ! ఇది నీహృదయమునఁ గూడఁ
గనఁబడుచున్నది.

---

24. బింబోష్ఠఏవ రాగస్తే తన్వి ! పూర్వమదృశ్యత ।
అధునా హృదయే ప్యేష మృగశాబాక్షి దృశ్యతే ॥

ఈ పద్యమున పూర్వాధారమును వీడక మఱొకయాధారమునఁ బ్రవేశించుటచే వికాస పర్యాయ మని దీక్షితులువారు.

జగన్నాథపండితుఁడిచ్చోట పర్యాయముకాదని చెప్పుచున్నాఁడు. ఎందుచేత నంటే ? ఒకవస్తువు అనేక స్థలములందు క్రమముగనుండినగదా ! పర్యాయమగును ?

క్రమముగ ననుటచే మొదటిదానిసంబంధమును వీడియే మఱొకదాని సంబంధమును పొందెనని చెప్పఁదగును.

కావ్యప్రకాశమున నట్లేయున్నది. 'తటితటి కాశ్యమును వీడుచున్నది దానిని నడుము పొందుచున్నది,' ఇత్యాదియందు ·

అలంకారసర్వస్వమునఁగూడ నట్లేయున్నది. 'ముం దర్ణవమధ్యమున పిదప హరునికంఠమున ' ఇత్యాదియందు

'నీబింబోష్ఠముననే రాగము ' ఇత్యాదియం దన్ననో రాగరూప వస్తువు పూర్వాశ్రయ మగునోష్ఠమును వీడి హృదయమును బొందలేదు. రెంటను నున్నది కావున పర్యాయము కాదు. ఏకవస్తువిషయక సారాలంకార మనఁదగును. దీనినే రత్నాకరాదులు వర్ధమానాలంకారముగఁ జెప్పుదురు ! అని

మర్మప్రకాశకర్త నాగేశభట్టు జగన్నాథుఁడు చెప్పిన ట్లిది సారాలంకారమను టంతసమంజసముగఁ గనఁబడదు. ఎందుచేతనంటే ? కావ్యప్రకాశమున ఉత్తరోత్తర ముత్కర్షగ వర్ణించుట సారాలంకారమగు నని లక్షణము చెప్పి "రాజ్యమున సారము వసుధ, వసుధయందు పురము, పురమున ప్రాసాదము, దానియందు తల్పము, తల్పమున

ఇచట రాగము పూర్వాధారమును వీడకుండగనే మఱియొక యాధారమునఁ బ్రవేశించినట్లు వర్ణించుటచే నిది వికాసపర్యాయము.

---

వనంగసర్వస్వ ముత్తమాంగన " అని యుదాహరించెను. ఇందనేక వస్తువుల కుత్తరోత్తరోత్కర్ష చెప్పఁబడెను కాని యొకవస్తువునకే చెప్పలేదు.

జగన్నాథుఁడు సారము నేకవస్తువిషయకముగఁ జెప్పెను కాని ప్రాచీనులట్లన లేదు.

ఈ పర్యాయాలంకారవిషయమున కావ్యప్రకాశాదులం బరిశీలింప నేమితోచునంటే మమ్మటాదిజగన్నాథపర్యంత మగు నాలంకారికులకు రాగశబ్ద వాచ్యములగు నోష్ఠగతరక్తిమయు, హృదయగతానురాగమునకు నభేదాధ్యవసాయముచే నైక్యము సమ్మతము. అట్లు కాఁగా "ఒకవస్తు వనేకస్థలముల వర్ణింపఁబడుచున్నను విశేష మగును. ఉ॥ లోపల వెలుపల ముందు వెనుక అన్నిదిక్కులఁ నా కామెయే కనబడుచున్నది. మఱియు వత్స! రామ! మనసునుండి బయట కేగలేదు. అన్నిదిక్కులఁ గనఁబడుచున్నావు " ఇత్యాదివలె నొకవస్తు వనేక స్థలములందున్నట్లు వర్ణనరూపము ద్వితీయవిశేషమే యగును. రాగ మొక్కటే ఓష్ఠమున హృదయమున నొకప్పుడే యున్నట్లు వర్ణించుట వలన ద్వితీయ విశేషాలంకారమున నతివ్యాప్తి లేకుండుటకే కద! పర్యాయలక్షణమున 'పర్యాయముచే' ననిదీక్షితులుం జెప్పెను. మమ్మటుఁడు కావ్యప్రకాశమునఁ గూడ "క్రమమున" అనిచెప్పెను. క్రమమున:- మొదటిచోటు వీడి రెండవచోట నుండుట అందుచేతనే లక్షణమున నొకదాని కనేకస్థలములందునికి చెప్పినను నుదాహరణమున కానికనుగుణముగ పద్మము నాశ్రయించి యనక పద్మమును వీడి యని పద్మపరిత్యాగమే చెప్పఁబడెను కాని పద్మసమాశ్రయణము చెప్పఁబడలేదు.

మమ్మటుఁడును ద్వితీయవిశేషవ్యావృత్తిని క్రమపదముచేతనే చెప్పఁగోరెను. రుయ్యకుఁ డన్ననో స్పష్టముగ నాతనియలంకారసర్వస్వమున నిట్లు చెప్పెను.

"ఓయి! ఒకటి చాలచోటుల నుండుట" యను వెనుకటి లక్షణముచే విశేషాలంకారమే మరల నిచట చెప్పఁబడుచుండెనే! యెందుకిట్లు చెప్పుట? యని శంకించువాని చెప్పెను 'క్రమమున' అని.

ఇక్కడ క్రమగృహీతమగు పదమువలన, విశేషాలంకారమున కన్నిట నొకప్పుడే లోచును. అందుచేనీపర్యాయాలంకారము విశేషాలంకారముకంటె వేఱువిషయము కలదగును. అని

ఒక యాధారముననే యనేకముండినట్లు చెప్పినను బర్యాయమగును.

ఉ॥ మును పేరుపారినచోట నిప్పుడు పులినముండెను.

మఱియు,

[25] పూర్వకాలమున మనకు శరీరమొక్కటిగా నుండెడిది. తరువాతనో నీవు ప్రియుఁడవు మేమును దురదృష్టవతుల మగు ప్రియురాండ్రము. ఇప్పుడు నీవు భర్తవు మేము

---

"నీబింబోష్ఠ ఏవ రాగః" మన్నచోట నే క్రమము లేదే లేదు. క్రమ మంగీకరించినచో నధరమున రాగము లేదని యొప్పుకొనవలసి వచ్చును. వికాసపర్యాయ మున్ను కాకపోవును.

'ఇచట రాగము పూర్వాధారమును వీడక యాధారాంతరమునఁ బ్రవేశించుట'

అను దీక్షితవచన విరోధమున్ను కలుగును. అట్లు క్రమము లేక పోవుటవలన జగన్నాథుని దీక్షితదూషణము మమ్మటునికిని తగులును. జగన్నాథుఁ డిచట సారాలంకారము కాఁదగు నన్నను, ఏకవస్తువిషయక సారాలంకారమును మమ్మటాదు లెవ్వరు నుదాహరింపక పోవుటచే సారాలంకార మిచట లేదనియే తలంపఁదగును. మమ్మటోక్తరీతిగనే ద్వితీయవిశేషాలంకారోదాహరణమగుట యెట్లును తప్పనిదగుటచే పర్యాయాలంకార మనుటయు న్యాయము కాదు.

ఔను గాని యాలంకారికులందఱకు మార్గదర్శకుఁడగు మమ్మటుని దూషించుట తదనుసారులకు తగునా ? యనరాదు. విరోధము స్పష్టముగఁ గనఁబడుచుండ నెవఁ డూరకుండును ? అందుచేతనే శాస్త్రములందు ప్రాచీన నవీనమతము లుండుట, నవ్యులు ప్రాచీనులను తిరస్కరించుట, కలుగుచునే యున్నది. "ఇది పద్మము కాదు ముఖమే. తుమ్మెదలు కావు కన్నులే" అని స్పష్టముగ సాదృశ్యముండుటవలన తద్వ్యాఖ్యానోపమయగునని ప్రాచీనతముఁడగు దండి చెప్పినయుపమను, 'ఇది పద్మము కాదు' ఇత్యాది యందు భ్రాంతాపహ్నుతియే కాని యుపమ కాదు ఇత్యాదిచే దీక్షితులు చిత్రమీమాంసలో నుపమాలక్షణ ప్రకరణమున నిరాకరింపలేదా ?

25. పురాభూదస్మాకం ప్రథమ మవిభిన్నా తనురియం
తతో ను త్వం ప్రేయాన్ వయమపి హతాశాః ప్రియతమాః ।
ఇదానీం నాథ స్త్వంవయమపి కళత్రం కిమపరం
హతానాం ప్రాణానాం కులిశకఠినానాం ఫలమిదమ్ ॥

భార్యలము. ఇఁక నేమికావలెను? ఇది వజ్రకఠినము లగు ప్రాణము లున్నదానికి ఫలము.

ఇచట దంపతులకు మొదట నభేదము పిదప ప్రేయసీ ప్రియతమ భావము తరువాత భార్యాభర్తృ భావము నని యాధేయపర్యాయము చూపఁబడినది.

## 52 పరివృత్తి

న్యూనాధిక వస్తువుల నన్యోన్యము మార్చుకొనుట పరివృత్తియగును.

ఉ॥ ఆరాజు కటాక్షముతో గూడ నొకశరమును వీడి శత్రుసంపదను గ్రహించెను. మఱియు,

అతివృద్ధుఁడు స్వర్గియు నగు నాజటాయువునుగూర్చి నీకి ప్పుడు విచార మక్కరలేదు. ఎందుచేతనంటే, అతఁడు జీర్ణకళేబరము నిచ్చి శరదిందు సుందరమగు యశమును గొనెను.

## 53 పరిసంఖ్యాలంకారము

ఒకవస్తువు నొకదానియందు నిషేధించి మఱొకదాని యందు నియమించుట పరిసంఖ్య యగును.

ఉ॥ స్నేహాక్షయము దీపములందుకాని కాంతామనంబులందు లేదు. మఱియు,

[26] ఉజ్జయినియందు లీలావతుల నయనోత్పలములు మాత్రము (మనసులుకావు) శ్రుతిమార్గము నతిక్రమించు చున్నవి. అచట మహాకాలుని జటలందున్న యర్ధ చంద్రుఁ డొకఁడే వక్రిమనొందుచున్నాఁడు.

---

26. విలంఘయంతి శ్రుతివర్త్మ యస్యాం లీలావతీనాం నయనోత్పలాని।
బిభర్తి యస్యామపి వక్రిమాణ మేకో మహాకాల జటార్ధచంద్రః॥

మొదటి యుదాహరణమున నిషేధము శాబ్దము. ద్వితీయోదాహరణమునం దార్థము.

## 54 వికల్పాలంకారము

తుల్యబలములకు కర్తవ్యతావిరోధము కలుగు చుండి నచో వికల్పాలంకారమగును.

ఉ॥ రాజులప్పుడు శిరములనుగాని చాపములనుగాని వంచు దురుగాక.

ఇచట, సంధి ప్రమాణ, విగ్రహ ప్రమాణముల వలన సంభవించిన శిరోనమన చాపనమనము లొక్కమాఱు చేయసాధ్యము కానివొక్కమాఱు చేయలవసిరాగా వికల్పము కలుగును. మఱియు,

వర్షమెడతెగక కురియుచున్నది. నెమిళ్లాడు చున్నవి. ఇప్పుడు కాంతుఁడుకాని కృతాంతుఁడుకాని దుఃఖమును బోగొట్టఁగలరు.

[27] ప్రియుఁడు కలిసినమరణ మభిలషింపదగదు. మరణము సంభవించిన ప్రియసమాగమ ముండదు. కావున నారెంటిలో నొకదానికి వికల్పము.

## 55 సముచ్చయాలంకారము

ఒక్కమాటుగ జరిగిన కార్యసమాజమును వర్ణించుట సముచ్చయ మగును.

ఉ॥ నీ శత్రువులు చూచుచున్నారు, భయపడుచున్నారు. నశించుచున్నారు.

విరోధము లేకుండ నొక్కమాఱు జరిగిన దర్శనాదులకూర్పు సముచ్చయము. మఱియు,

27. ఓయి ! కాంతుఁడు కృతాంతుడు దుఃఖాంతమును గలిగింప విరోధమెల్ల విరోధము లేనిచో వికల్పాలంకార మెట్లుకలుగు ననినఁ జెప్పుచున్నాడు. "ప్రియుడు కలిసిన అని. అట్లుకాగా పరస్పరవిరుద్ధములగు ప్రియసమాగమ మరణాభిలాషలకు వికల్పము.

[28] ఓసత్పురుషుఁడా ! నీచేఁగ్రుచ్చఁబడిన ప్రేమనామక నవ శల్యమును హృదయమున భరించుచు నవశయై యానాయిక యేమిచేయుచున్నదో వినుము,

నిద్రించు చున్నది వాడు చున్నది శోషించు చున్నది
మాడుచున్నది వాగుచున్నది గంతులు వేయుచున్నది
తిరుగుచున్నది పొర్లుచున్నది జారుచున్నది మూర్ఛ
నొందుచున్నది క్షీణించుచున్నది, నందించుచున్నది.

ఇచటఁ గొన్నిక్రియలకుఁ గొంచెము కాలభేదమున్నను శతపత్ర మను పూవుయొక్క నూఱుదళము లొక్కమాఱువిదుచు న్యాయమున విరహాతిశయ ద్యోతనకై యీపద్యము వివక్షించుటచే లక్షణసమన్వయము.

నేనుముందు నేనుముం దనుగరువపు భావమ్ముకల వాని
కేక కార్యాన్వయము కలిగినను సముచ్చయమే యగును.

ఉ॥ కులము రూపము వయస్సు విద్య ధనము వీనిని గర్వింపఁ
జేయుచున్నవి.

ఎచట నొకటి కార్యసిద్ధికిఁ గారణముగ నుపక్రమించునో, ఆకార్య మందితరములు సహామహమికతో ఖలేకపోతన్యాయమున (కళ్లమునందలి పావురములరీతిగ) గార్యసిద్ధి నొనర్చుచో నదియు సముచ్చయమగును. ఎట్లు మదమున కాభిజాత్య మొక్కటే సంపూర్ణ కారణము. అట్టిదే రూపాదికముకూడ మదసాధనముగఁ దయారగుచున్నది. మఱియు,

---

౨౮. బిభ్రాణా హృదయే త్వయా వినిహితం ప్రేమాభిధానం నవం
శల్యం యద్వదధాతి సా విధురితా సాధో తదాకర్ణ్యతామ్ ।
శేతే శుష్యతి తామ్యతి ప్రలపతి ప్రమ్లాయతి ప్రేంఖతి
భ్రామ్యత్యుల్లుఠతి ప్రణశ్యతి గళత్యున్మూర్ఛతి త్రుట్యతి ॥

²⁹ దానము గుప్తము, అర్థి యింటికి రాగా సంభ్రమములో నుత్థానాదు లొనర్చుట, సంపదలున్నను గర్వింపమి, పరులలోపమును వెలిబుచ్చకుండుట, ప్రియము గావించి మానము, సభలో మిత్రకృతప్రకాశనము, వేదమందాసక్తియుఁ, బురుషునిఁ గులీనుగాఁ జెప్పుచున్నవి.

## 56. కారకదీపకము

ఏక కారకము నొందిన క్రియలకూర్పు కారకదీపక మగును.

ఉ॥ బాటసారి వెళ్లును. తిరిగి వచ్చును సాతును జూచును మార్గము నడుగును. మఱియు,

³⁰ నిద్రించుచున్నాఁడు, స్నానముచేయుచున్నాఁడు భుజించుచున్నాఁడు, పచారు చేయుచున్నాఁడు, జుట్టునార్చుకొనుచున్నాఁడు, అంతిపురమున నున్నాఁడు, జూదమాడుచున్నాఁడు, ఇప్పుడు చెప్పుటకు సమయము కాదు, తిరిగిరమ్ము పొమ్ము. అని యుద్దండులగు ద్వారపాలురచే నివారింపఁబడు నీదీనుల మమ్ము ఓలక్ష్మీ పద్మకాంతి సదృశ మగు నపాంగములతోఁ జూడుము.

---

29. ప్రదానం ప్రచ్ఛన్నం గృహముపగతే సంభ్రమవిధి
ర్నిరుత్సేకో లక్ష్మ్యామనభిభవ గంధాః పరకథాః।
ప్రియం కృత్వా మానం సదసికథనంచాప్యుపకృతేః
శ్రుతేఽత్యంతాసక్తిః పురుషమభిజాతం కథయతి॥

30 నిద్రాతి స్నాతి భుఙ్క్తే చలతి కచభరం శోషయత్యంతరాస్తే
దీవ్యత్యక్షైర్నచాయం గదితుమవసరో భూయ ఆయాహి యాహి।
ఇత్యుద్దండైః ప్రభూణామసకృదధికృతైర్వారితాన్ద్వారిదీనా
నస్మాన్పశ్యాబ్ధికన్యే సరసిరుహరుచా మంతరంగైరపాంగైః॥

మొదటి యుదాహరణమున వాచ్యము బాటసారి యగు కర్తృ కారకమున కొక్కదానికే గమనాదులం దన్వయము. రెండవ యుదాహరణమున నధ్యాహృతమగు ప్రభురూప కర్తృకారకమున కొక్కదానికి నిద్రాదులం దన్వయము కావున నొక్కదాని కనేక వాక్యార్థములతో నన్వయముండుటచే దీపక సాదృశ్యలాభమున కారక దీపకము. ఇది మొదటి సముచ్చయమునకు విపరీతము.

## 57. సమాధి

> వేఱుకారణము లభించుటచేఁ గార్యమునకు సౌకర్యము కలిగినచో సమాధ్యలంకారమగును.

ఉ॥ తరుణికి నాయకునికడ కరుగుటకు వేడుక కలిగెను. సూర్యుఁడు నస్తమించెను. మఱియు,

ఈమె కోపమును బోగొట్టఁ బాదములందు పడఁబోవు చున్న నా కుపకారమునకై భాగ్యవశమున మేఘుఁ డుఱిమెను.

కనిచే నారంభింపఁబడిన కార్యమునకు గారణాంతర సమావేశము వలన సౌ[illegible]ర్యము చక్కఁగఁ గలిగినచో సమాధ్యలంకారము. ఈసమాధి రెండవ సముచ్చయమునకు విపరీతము. ఈ సముచ్చయమందుఁ బ్రత్యేకము సమర్థమగు ననేకము లొక్కమాఱు ఖలేకపోత న్యాయముగ సంసిద్ధమగునుగదా! సమాధి యందన్ననో ఒకదానిచే గార్యమారంభింపబడగా మఱొకచోటఁ గాకతాలీయముగ వచ్చినది యాకార్యమునకు సౌకర్యమును గలిగించునది మాత్ర మగును.

ఇచట నుదాహరణము 'తరుణికి' అనునది.

యువతులకు గాలనియమము లేకయే కోరిక కలుగుచుండును కనుక, ప్రియాభిసరణమున నుత్కంఠయే సంపూర్ణ కారణము. అది చీక

టిని గోరదు. వచ్చిన యంధకారము కార్యమునకు సౌకర్యమునే కలిగించెను. ఇట్లే రెండవ యుదాహరణమునఁ గూడ నన్వయించు కొనవలెను.

## 58. ప్రత్యనీకాలంకారము

బలవంతుఁడగు శత్రువునకు సంబంధి యైన వారియందు పరాక్రమము చూపుట ప్రత్యనీకాలంకారము.

ఉ॥ జయశీలములగు కన్నుల ననుసరించు కర్ణము లుత్పల ములచే నధఃకరింపఁబడినవి. మఱియు,

[31] నారూపకీర్తుల హరించిన వానియం దీమె యనురక్త యని నీయందలి మత్సరముచేఁ గాబోలును! మదనుఁడు

31. మమ రూపకీర్తి మహరద్భువి య స్తదనుప్రవిష్ట హృదయేయమితి ।
త్వయి మత్సరాదివ నిరస్తదయ స్సతరాం క్షిణోతి ఖలు తాం మదనః ॥

ఈ పద్యవిషయమున జగన్నాథుఁ డిట్లాక్షేపించు చున్నాడు.

ఈ పద్యమున నీ యందు మత్సరమువలనఁగాబోలు ననుచోట పంచమ్యంతమగు మత్సరశబ్దముచే మత్సరరూపకారణము తెలుపఁ బడినది. కాబోలునను పదముచే నుత్ప్రేక్ష చెప్పబడెను. అందువలన నిచట హేతూత్ప్రేక్ష స్పష్టము. పూర్వార్థ మంతయు మాత్సర్య బోధనపరము. దానివలన శత్రువునకు ప్రాబల్యము తనకుదార్బల్యము తెలియుచున్నది. కాని యంత మాత్రమున ప్రత్యనీకము కాదు. హేతూత్ప్రేక్షయే యగునని.

దీనికి చంద్రికాకర్త సమాధానమిది.

ఇచట నీయందు మత్సరమునఁ గాబోలునని హేత్వంశమున నుత్ప్రేక్ష యున్నను ఆమాత్సర్యకారణముచే శత్రుసంబంధులను బాధించుట ప్రత్యనీకాలంకారమునకు ప్రత్యేకవిషయముగ నెఱుంగవలెను. అందుచేతనే మమ్మటభట్టుకూడ తనకావ్యప్రకాశమున,

నిర్దయుఁడై యామె నెక్కువగ క్షీణింపఁ జేయు చున్నాఁడు.

---

త్వంవినిర్జిత మనోభవ రూప స్సాచసుందర ! భవత్యనురక్తా ।
పంచభిర్యుగపదేవ శరైస్తాం తాపయత్యనుశయాదివకామః ॥

నీవు వినిర్జిత మన్మథ రూపుఁడవు, ఆమెయునో సుందర ! నీయం దనురక్త. నీమీఁద ద్వేషముచేతనేమో కాముఁ డామెనైదుబాణము లతో నొక్కమాఱుగొట్టు చున్నాఁడు.

అని యుదాహరించెను. కావున హేతూత్ప్రేక్షచే గతార్థ మగుటవలన ప్రత్యనీకమునకు నవకాశములేదన్న జగన్నాథునిమాట గ్రహింపరాదని.

నాగేశభట్టుకూడ హేతూత్ప్రేక్షయున్నను బ్రతిపక్షులనుబాధిం చుట ప్రత్యనీకవిషయమగుటవలన జగన్నాథోక్తి చింత్యమేయనెను. వైద్యనాథ నాగేశుల భావమేమి యన: —

నీయందు మత్సరముచేఁగాబోలు నన్నచో నుత్ప్రేక్ష యున్నను నారూపకీర్తుల నిత్యాదిభాగమందు నాయకుఁడు మదనునికంటె ప్రబలు డనియు, దుర్బలుఁడగు మదనుఁడు నాయక సంబంధిని యగు నాయికను బాధించుచు పరాక్రమము చూపుచుండుటచే ప్రత్యనీకము కూడనున్న దని సమన్వయించిరి. వైద్యనాథుఁడు తన సమన్వయమునకు మమ్మట భట్టు నంగీకారమును గూడఁ జూపియున్నాఁడు. కాని దీక్షిత మమ్మటో దాహరణములు స్థూలదృష్టితోఁజూడ నొకటిగాఁగనఁబడినను సూక్ష్మే క్షికంజూడ నొకటి కాదని బాగుగఁ దెలియును. చాలవ్యత్యాస మున్నది. ఎట్లన: —

కావ్యప్రకాశోదాహరణమున 'నీవు వినిర్జిత మన్మథ రూపుఁడవు' అనుచో వినిర్జిత పదముచే మదనుని నాయకుఁడు జయించుట, నాయకు

ఇట్లు బలవంతుఁడగు శత్రువునకుఁ బ్రతిక్రియ చేయలేక వాని సంబంధులను బాధించుట ప్రత్యనీకమని చెప్పుచుండగా సాక్షాచ్ఛత్రువునందుఁ బరాక్రమించుట ప్రత్యనీకమని కైముతిక న్యాయముచే సిద్ధించుచున్నది.

---

నకు ప్రబలత్వము, శత్రుత్వము స్పష్టమే. ఆమెయు నోసుందర! నీయందనురక్తయనుటచే నాయిక నాయకు నకు సంబంధించిన దగుట చెప్పఁబడెను. నీమీఁది ద్వేషముచేఁ గాఁబోలు నిత్యాదిచే శత్రుసంబంధియందు పరాక్రమము వివరింపఁబడినది. కావున ప్రత్యనీకాలంకారము తగును. దీక్షితో దాహరణమునఁ జూడుడు.

నారూపకీర్తులహరించెననుచో నాయకునకు దొంగతనము చెప్పఁబడినదేకాని సామర్థ్యముకాదు. తదనుప్రవిష్టహృదయ యను పదము వలన దొంగ యితరుల సొత్తును దొంగిలించి రహస్యముగ నొకచోదాగినట్లు ఈనాయకుఁడు మన్మథుని రూపకీర్తు లపహరించి నాయికమనమున రహస్యముగ నున్నట్లే తెలియుచున్నది కాని నాయకునకు సంబంధించిన దని తెలియఁజేయు అనురక్తేత్యాది పదమేమియుఁజెప్పలేదు. నీయందు ద్వేషముచేఁ గాఁబోలు నామెను క్షీణింపఁజేయుచున్నాఁడు. వేటకానిచేఁ దరుమబడిన మృగము పొదలోదూరగా దానింగొట్టుటకు పొదమీద బాణమువేసినట్లు నాయకుని బాధించు తలంపుతో నాయికను బాధించుచున్నాడు కాని నాయికను బాధించు తలంపుతోఁగాదు. అందుచేతనే నిరస్తదయుఁడని మదన విశేషణము. యశస్వియగు మదనుఁడతి సుకుమారయగు నబలంగొట్టుట తగదని దయగలిగియు దయనువీడి యామెలోనున్న నాయకునందలి మత్సరమున నామెను గొట్టుచున్నాడని యా విశేషణాభిప్రాయము.

ఏతావతా పద్యమున శత్రువు చెప్పఁబడలేదు. శత్రువునకు బలము కలిగినట్లు చెప్పలేదు. శత్రువునకు సంబంధిని, చెప్పలేదు. ఈ మూటినిఁ జెప్పకపోవుటచే ప్రత్యనీకములేనేలేదు. హేతూత్ప్రేక్షయే యుచటఁ జెప్పఁదగును.

[32] మధువ్రతములు తమ మధుప్రపలగు పద్మములను మూయుటచేఁ గోపగించి చంద్రబింబమును బలాత్కారముగ

---

32 మధువ్రతౌఘః కుపిత స్స్వకీయ మధుప్రపా పద్మనిమీలనేన।
బింబం సమాక్రమ్య బలాత్సుధాంశోః కళంకమంకే ధ్రువమాతనోతి॥

ఇట్లు బలవంతుఁడగు శత్రువుయొక్క పక్షమందున్న వానిని పరాక్రమించుట ప్రత్యనీకమని లక్షణము చెప్పి కైముతికన్యాయలబ్ధమగుటచే శత్రువునెడల పరాక్రమించుటకూడ ప్రత్యనీకమేయని చెప్పుచు నీపద్యము నుదాహరించెను. ఇందేయలంకారము వాచ్యము ? ఏది వ్యంగ్యము ? అంగమేది ? అంగియేది ? యని విచారింపవలెను. తుమ్మెదగుంపు తమ పానీయశాలలగు పద్మముల మూసి వేయుటచే కోపగించి చంద్రబింబమును బలాత్కారముగ నాక్రమించుకొని దానిని మలినముగఁ జేయుచున్నది. ధ్రువము,

ఇచటమాలిన్యము విషయము, తుమ్మెదగుంపు విషయినైల్యము నిమిత్తమగుధర్మము, ధ్రువమనునది వాచకశబ్దము, కాగానుక్తవిషయ వస్తూత్ప్రేక్షయని తేలినది. మలినము చేయుటకు కారణము తమ పానీయ శాలలగు పద్మములను మూసివేయుట వలని కోపము.

తుమ్మెదలకు మధుప్రపలు పద్మములే. వానిని మూసి వేయుటచే కోపగించినవై మధుపములు లాప్రపను మూసిన చంద్రుని కలంకి (నిందుతుని) గాఁజేసెను.

లోకమున ధర్మాత్ములు చలిపందిళ్ల నేర్పరతురు. దాని నాపి వేసినవారు కలంకము నొందుదురు. అట్లు మధుపముల ప్రపను మూయుటచే చంద్రుఁడు కళంకియయ్యెనని భావము. ఇత్థంచ ఉక్త విషయ వస్తూత్ప్రేక్ష యంగి, వాచ్యము. చంద్ర మధ్యమున నున్నది కలంకము కాదు కోపగించిన తుమ్మెదగుంపే యని వ్యంగమగు నపహ్నవాలంకారమంగము.

న్నాక్రమించి మధ్యభాగమును మలినముగఁ జేయుచుం డెను, ధ్రువము.

## 59. కావ్యార్థాపత్తి

కైముత్యన్యాయముచే నర్థసిద్ధియైనట్లు వర్ణించినఁ గావ్యార్థాపత్తి యగును. కావ్యమందలంకారరూపమగు నర్థాపత్తి కావునఁ గావ్యార్థాపత్తి.

ఉ॥ ఆ చంద్రుఁడు నీముఖముచే జయింపఁబడెను. పద్మములఁగూర్చి చెప్పనేల ?

---

ఇచట తుమ్మెదగుంపుతో చంద్రునకు ప్రబల శత్రుత్వమును జెప్పలేదు. తుమ్మెదలు చంద్రునందు పరాక్రమము చూపినట్లును జెప్పలేదు. ఇఁకనేమంటే చంద్రుఁడు తన తప్పుచే కలంకి యయ్యెనని మాత్రమే చెప్పుటచే ప్రత్యనీకము లేనే లేదు.

ఒకవేళ తమ కపకారము చేయుటచే చంద్రునందు శత్రుత్వము, పద్మనిమీలన మనివార్యమగుటచే ప్రబలత్వము, బలాత్కారముగ నాక్రమించుటచే పరాక్రమించుట అనియే కవి భావమన్నచో అప్పటికిని 'బలవంతుడగు శత్రువునకు సంబంధించిన వారియందు పరాక్రమము చూపుట' యని యాలంకారికులందఱును తానును జెప్పిన లక్షణమిచట నెట్లు సమన్వితమగును ? ఈపద్యమున ప్రబల శత్రువునందే పరాక్రమము చూపినట్లున్నది కాని వారి చుట్టములందు పరాక్రమించినట్లు లేదే ! అట్లున్నను ప్రత్యనీకమిష్టమన్నచో రెండవ ప్రత్యనీకముగ 'బలవంతుఁడగు శత్రువు నెదుర్కొని ప్రరాక్రమించుట' యని లక్షణము చెప్పి దీని నుదాహరించిన నింతకంటె నెంతో బాగుండెడిదేమో ! కాని యిప్పుడీ పద్యమునందు ప్రత్యనీకాలంకారము తోచుటకేమియు నవకాశము కనఁబడుట లేదు.

ఇచట అ యను శబ్దముచేఁ బద్మము లెవనిచే జయింపఁబడెనో వాఁడని వివక్షింపఁబడినది. అందుచే నా చంద్రుఁడు దేనిచే జయింపఁబడెనో దానిచేఁ బద్మములు జయింపఁబడె నని చెప్పనేల ? యని దండికాపూప న్యాయముచేఁ బద్మజయ మను నర్థము సిద్ధించుటచే నిది కావ్యార్థాపత్తి. తాంత్రికార్థాపత్తి లక్ష్యము కాకుండుటకై కావ్యవిశేషణము. మఱియు,

33 బంధుజీవ ప్రభాహారమగు నీ చంచలాక్షియధర మన్యజీవప్రభాహారమగుటలో నేమివింత? తన హృదయమును భేదించుకొని వచ్చిన యీకుచములు కితరులగుండె చెదరఁగొట్టుటలో నేమి దయయుండును ?

## 60. కావ్యలింగము.

సమర్థింపవలయు నర్థమును సమర్థించుట కావ్యలింగము.

ఉ॥ ఓ మందకందర్ప ! నామనసున ముక్కంటి యుండుటచే నీవు జయింపఁబడితివి.

ఇచట మన్మథ జయోపన్యాసము దుష్కరవిషయ మగుట వలన సమర్థనాపేక్ష కలిగియున్నది. దానికి నాచిత్తమున ముక్కంటియున్నాఁడని స్వాంతఃకరణమున శివసన్నిధానమును జూపి సమర్థించుట కావ్యలింగము.

వ్యాప్తిపక్షధర్మతలతోఁ గూడిన నైయాయిక లింగము లక్ష్యము కాదనుటకుఁ గావ్య విశేషణము. ఇది వాక్యార్థహేతుక కావ్యలింగము.

---

33 అధరశ్చటులదృశో రస్యాబంధుజీవప్రభాహరః ।
అన్యజీవప్రభాం హంత హరతీతి కిమద్భుతమ్ ॥
స్వకీయం హృదయం భిత్వా నిర్గతౌ యౌ పయోధరౌ ।
హృదయస్యాన్యదీయస్య భేదనే కా కృపా తయోః ॥

పదార్థహేతుక కావ్యలింగ మెట్లన,

[34] ఓ భస్మపు పూతా ! నీకు భద్రమగుగాక. రుద్రాక్ష మాల ! నీకు శుభము. శివభవనాలంకారమగు సోపాన పంక్తి ! ఎంతకష్టము ! మాపూజకు సంతసించిన శివుడు మీసేవాసుఖములేకుండ మోక్ష మను మహా మోహ మందణచివేసెను.

ఇచట మోక్షము మహా మోహమగుట అప్రసిద్ధము కావున దానిని సమర్థించుటకు మీసేవా సుఖములేమియను పదార్థము హేతువు.

ఒకానొకచోఁ బదార్థవాక్యార్థములు పరస్పర సాపేక్షములై హేతు వులగుచున్నవి. మఱియు,

[35] విదుషి యాదమయంతి ధరించు కేశపాశమునకు పశువు చేతను బురస్కరింపఁబడని చామరముతోఁ బోలిక నెవఁడు కోరును ?

ఇచట చామరమునకు దమయంతీ కుంతల భారముతో సామ్యము లేమికి 'విదుషి యాదమయంతి ధరించు కేశపాశమున' కనువాక్యార్థము 'పశువుచేతను బురస్కరింపఁబడని' యను పదార్థము నీ యుభయము చేరి కారణమగును.

సమర్థింపఁదగిన యర్థమును సమర్థించుటే ప్రయోజనము గాఁగల వాక్యార్థమందు పదార్థము హేతువగున దెట్లన?

---

34. భస్మోద్ధూళన ! భద్రమస్తు భవతే రుద్రాక్ష మాలే శుభమ్
హా ! సోపానపరంపరే గిరిసుతా కాంతాల యాలంకృతే ।
అద్యారాధనతోషితేన విభునా యుష్మత్సపర్యాసుఖా
లోకోచ్ఛేదిని మోక్షనామని మహామోహే నిలీయామహే ॥

35 చికురప్రకరా జయంతి తే విదుషీమూర్ధని యాన్బిభర్తి సా ।
పశునాప్యపురస్కృతేన తత్తులనామిచ్ఛతు చామరేణ కః ॥

[36] ఓ పురహరా ! పూర్వజన్మమున నెప్పుడు నిన్ను నమ
స్కరింపలే దనుసంగతి శకీరినగుట వలన నూహింపఁ
బడినది. ఇప్పుడు నమస్కరించుచు ముక్తుఁడనై, తను
రహితుఁడనగుటచే ముందుకూడ నమస్కరింపని వాఁడ
నగుదును. శివా ? ఈ రెండు తప్పులు మన్నింపవలెను.

ఇచట కారణము స్పష్టము కాకపోవుటవలన నపరాధ ద్వయము సమర్థింపఁ దగియున్నది. ఆసమర్థనముగూడ వాక్యార్థము లగు పూర్వ పరజన్మసంబంధ్యనుమానములచే జేయఁబడు చున్నది. ఈ రెండు వాక్యార్థములలో రెండవదగు 'ముందుగూడ నమస్కరింపనివాఁడనగుదు' నను వాక్యార్థమునకు తనురహితుఁడ నను నొక పదార్థము హేతువు. తను రాహిత్యమునకు నిప్పుడు నమస్కరించుచు ముక్తుఁడనగుదు నను వాక్యార్థముకాని యనేక పదార్థముకాని హేతువు.

ఒకానొకచోఁ బరస్పర విరుద్ధములు సమర్థనీయములు నగు రెంటికి క్రమముగ రెండును గారణము లగుచున్నవి.

[37] గౌరీ సమాలాపరసికుడు గౌరి తపఃకాఠిన్యమున
కోర్వనివాడు నగుటచే బ్రహ్మచారివేషమున వేడుకయు
దానిని వీడుటలో త్వరయు నొక్కమాటే కలిగిన మద
నారి మనకు ముదమునొసగుగాక.

---

36. వపుః ప్రాదుర్భావాదనుమిత మిదం జన్మని పురా
పురారే నక్వాపి క్వచిదపి భవంతం ప్రణతవా న్।
నమన్ముక్తస్సంప్రత్యహ మతనురగ్రేఽప్యనతి మా
నిశ క్షంతవ్యం తదిద మపరాధ ద్వయమపి ॥

37. అసోఢా తత్కాలోల్లసదసహభావస్య తపసః
కథా నాంవిస్రంభేవ్యథచరసిక శ్శైలదుహితుః।
ప్రమోదం వోదిశ్యాత్కపటవటువేషాపనయనే
త్వరాశైథిల్యాభ్యాం యుగపదభియుక్తస్స్మరహరః ॥

ఇచట శివుని కొక్కమారే కృత్తిమ బ్రహ్మచర్యవేషము ననుసరించుటలో వేడుక, దానిని వీడుటలో త్వరయునను నీరెండు విరుద్ధకార్యములకుఁ గ్రమముగ గౌరితో సల్లాపము లాడుటలో వేడుక, గౌరితపఃకాఠిన్యము నోర్వలేమియు నను నీరెండు విషయములు కారణములుగఁ గూర్పఁబడినవి.

ఒకానొకచోఁ బరస్పరవిరుద్ధములు సమర్థనీయములుగు రెంటి కొక్కటే కారణమగును.

రమాఽధర రసాస్వాది యగునీ మురారి సముద్రమథన
క్లేశమును సఫలముగను విఫలముగను దలంచుచు విజ
యము నొందుఁగాక.

ఇచట సఫలముగను విఫలముగను దలంచుట యను రెండు విరుద్ధకార్యములకు నంబుధి తనయాఽధర రసాస్వాద మొక్కటే కారణము.

ఈ కావ్యలింగము హేత్వలంకారమని కొంద ఱనిరి.

[38] ఓ గోదావరీ ! నీ తీరమున గళింగ కవి బహుదోషదర్శన
సహయగు వాగ్దేవిని వీడి విరక్తుఁడయ్యెను. ఈమెను
అంబుధి మధ్యమున పండుకొను నారాయణుని నాభీసరోజాంత
మందున్న బ్రహ్మకుఁ జేర్పుము. భూమిమీఁద నీమె
యొంటరిగ నెట్లుండఁగలదు ?

ఇచట సరస్వతిని బ్రహ్మకుఁ జేర్చుట గోదావరిచే నెట్లగు నను సంభావనీయార్థము నుపపాదించు ‘అంబుధి మధ్య’ ఇత్యాది బ్రహ్మ

38. హే గోదావరి ! తావక తటోద్దేశే కలింగః కవి
ర్వాగ్దేవీం బహుదోషదర్శనవతీం త్యక్త్వా గతః కిం తతః
ఏతాం మధ్యసముద్ర సుప్తమురజిన్నాభీసరోజోదర
బ్రహ్మాణం గమయాంచకార కథమేషా తే కాంక్షే స్థాస్యతి ॥

విశేషణమునుంచుట శ్లేష యనుగుణము అని, కూర్పరాని యర్థమును కూర్చినట్లు వర్ణించుట శ్లేష లక్షణమనియు జయదేవుఁడు చెప్పెను. వస్తుతః కావ్యలింగముకంటె నిందు భేదములేకపోవుట వలన నిది పదార్థ హేతుక కావ్యలింగమే యగును.

ఓయి ! సాభిప్రాయములగు పదార్థ వాక్యార్థముల నుపన్యసించుట రూపమగు పరికరముకంటె కావ్యలింగమునకు భేదమేమి ? అన్నచోఁ జెప్పుచున్నాఁడు. పరికరమునఁ బదార్థముల బలమువలనఁ బ్రతీయమానము లగు నర్థములు వాచ్యమునకు శోభాకరము లగును. కావ్యలింగము నందన్ననో ! పదార్థ వాక్యార్థములే వాచ్యమునకు కారణములగును.

ఓయి ! యాలోచింపగా 'మీసేవాసుఖము లేకుండ' నిత్యాది పదార్థ హేతుక కావ్యలింగోదాహరణమున, 'ముందుకూడ నమస్కరింపని వాఁడ నగుదును' ఇత్యాది వాక్యార్థ హేతుక కావ్యలింగోదాహరణము నను బదార్థ వాక్యార్థములే హేతువులగుచున్నను 'పశువుచేతను నాద రింపబడని' యను పదార్థ హేతుక కావ్యలింగోదాహరణమున, 'నా మనసున ముక్కంటి యున్నాఁడు' అను వాక్యార్థ హేతుక కావ్యలింగో దాహరణమునను వ్యంగ్యార్థమునకుఁగూడ హేతుకోటిలోఁ బ్రవేశమున్నది. విదుషియను దానికిఁ బ్రతిద్వంద్విగాఁ జెప్పఁబడుటచేఁ బశువుచే ననునది యవివేకిత్వాభిప్రాయమును సూచించునుగదా ! ముక్కంటి యను నదియుఁగందర్పుని కాల్చుట కుపయోగించుటచే నతనింగాల్చుమూఁడవ కన్ను ఉన్నది అనునభిప్రాయమును సూచించును నిజమే అట్లయ్యువాని యందుఁ పరికరాలంకారము మాత్రమే కాదు. వ్యంగ్యమగు నవి వేకిత్వముతోఁగూడిన పశువుచేతను నాదరింపఁబడని యనువాచ్యమే యగు ననేక పదార్థము, ప్రతీయ మానమగు కందర్పునిఁగాల్చు మూఁడవ కన్నుతో గూడిన శివుడు చిత్తమునందున్నా డనువాచ్యమే యగు వాక్యార్థ

మున్ను, హేతువులగుటచే పరికరోత్థాపిత మగు కావ్యలింగము కూడ నున్నది.

'సర్వాశుచినిధానము' ఇత్యాది పదార్థ పరికరోదాహరణము నందు సర్వాశుచినిధానము ఇత్యాద్యనేక పదార్థములచేఁ బ్రతీయమాన మగు శరీరానంరక్షణీయత్వమువలెను, వాక్యార్థపరికరోదాహరణము నందును పర్యాయోక్త రీతిగా నాయావాక్యార్థముచేఁ బ్రతీయమానమగు 'నేను వ్యాసుఁడఁగాను' ఇత్యాది వలెను, అవాచ్యములగు పదార్థ వాక్యార్థములు హేతువులగుటలో మధ్య వానిచేఁ బ్రతీయ మానమగు నపివేకిత్వాదిక మపేక్షితముకాదు. కావున పశువుచే ననుచోటను ముక్కంటి యనుచోటను నుండు వ్యంగ్యము వాచ్యమే యగు పదార్థ మునకు వాక్యార్థమునకు హేతుభావము నుపపాదించుటచేఁ గావ్యలింగ మున కంగమే యగును.

నీ నేత్రసమానకాంతి యగునిందీవరములునీట మునిగినవి. అను ననేకవాక్యార్థహేతుక కావ్యలింగోదా హరణమున నీనేత్రసమానకాంతి ఇత్యాదికములగు నిందీవర శశి హంస విశేషణములు ఆవాక్యార్థములకు హేతుత్వమునుపపాదించు నవగుటచే నచట వాక్యార్థ హేతుక కావ్య లింగమునకుఁ బదార్థహేతుక కావ్యలింగ మంగము కావున పశువు చేతను నపురస్కృతము, నామనసున ముక్కంటియున్నాఁడు ఇత్యాదులు గావ్య లింగోదాహరణము లగుటలో నేబాధయులేదు.

## 61. అర్థాంతరన్యాసము.

సామాన్య విశేషములను జెప్పుట యర్థాంతర న్యాస మగును.

ఉ॥ హనుమంతుఁ డబ్ధిని దాటెను. మహాత్ములక సాధ్య మెద్ది ? గుణితోఁ గూడిన యల్పుఁడును గౌరవము నొందును. పూలమాలతో గూడినదారముకూడ శిరమున ధరింపఁబడు చున్నదికదా.

సామాన్య విశేషములరెంటినిఁ జెప్పుట యర్థాంతరన్యాసము. అందొకటి ప్రస్తుతము. మఱొకటి యప్రస్తుతము నగును. విశేషము ప్రస్తుతము కాఁగా దానితోఁగూడ నప్రస్తుత సామాన్యరూపమగు నర్థాంతరమునుగాని, సామాన్యము ప్రస్తుతమగుచుండ నప్రస్తుత విశేషరూపమగు నర్థాంతరమునుగాని చెప్పుట యర్థాంతరన్యాసమని చెప్పఁబడు చున్నది. అందు మొదటిదానికి రెండవవాక్య ముదాహరణము. రెండవదానికి రెండవ శ్లోకములోని 'గుణితోఁగూడిన' యను విషయ ముదాహరణము.

ఓయి! ఇది కావ్యలింగముకంటె వేఱుకాదు.

ఎట్లన రెండుదాహరణములందు నప్రస్తుతములగు సామాన్య విశేషములను జెప్పుట ప్రస్తుతములగు విశేషసామాన్యముల కెట్లుపకరించు నని చర్చింపవలసి యున్నది. ప్రస్తుతముతో నన్వయింపని యప్రస్తుతమును జెప్పుట యెప్పుడును కుదురదుకదా!

ఇందు ప్రస్తుతములగు విశేషసామాన్యములు గూడ వాచ్యములగుటచే నిచ్చటి యప్రస్తుతాభిధాన మప్రస్తుత ప్రశంస యందువలెఁ బ్రస్తుతవ్యంజకముకాదు. ఇచట వ్యాప్తిపక్షధర్మతలు లేకపోవుట వలన నయ్యది యనుమానాలంకారమువలెఁ బ్రస్తుత ప్రతీతి జనకముకాదు.

[39] సింగపు నిద్రనుహరించిన గజకృత వనతరు భంగధ్వని
వలె ఖలునివిశ్వాసఘాతదోషము వీరునికిఁ గోపము
కలిగించి ఖలుని వధకు గారణ మగును.

ఇత్యాదులలో సామాన్యమందు విశేష ముపమానమైనను విశేషమునందు సామాన్య మెంచటను నుపమానముగఁ గనబడక పోవుటవలన,

---

39. విస్రబ్ధఘాతదోష స్స్వవధాయ ఖలస్యవీరకోపకరః ।
వన తరుభంగధ్వని రివ హరినిద్రా తస్కరః కరిణః ॥

'మహాపురుషుల యాకృతివలె నితని యీ యాకృతి గంభీర' మన్నచో నదియున్నను నందుద్దేశము లేకపోవుటచే ఉపమానముగ నన్వయించుట సమంజసముగ దోపక పోవుటవలనను దృష్టాంతాలంకారమువలె నుపమానముగను బ్రస్తుతముతో నన్వయింపదు.

కాఁబట్టి కావ్యలింగమునందు వలెనే యర్థాంతరన్యాసమందును నప్రస్తుతమునకుఁ బ్రస్తుతమును సమర్థించు టే ప్రయోజన మనవలెను. అందువలన నిచటను వాక్యార్థ హేతుక కావ్యలింగమే యగును గాని వే అలంకారమున కవకాశము లేదన్నచో నిచటఁగొందఱు సమర్థనాపేక్ష కల యర్థమును సమర్థించిన కావ్యలింగమనియు, సమర్థనాపేక్ష లేని దానిని ప్రబలప్రతీతి వశమున సమర్థించిన నర్థాంతరన్యాసమనియుఁ జెప్పుదురు. నీనేత్ర సమానకాంతి ఇత్యాది కావ్యలింగోదాహరణము లందువలె,

[40] శరదచే శశాంకుఁడాలింగితుఁడు కాఁగా శాంత తటి
త్కటాక్షయై ప్రావృష పయనమయ్యెను. పతితపయో
ధరలగు నేయంగనల సౌభాగ్య మడుగంట కుండును ?

[41] హిమవంతుఁడు దివాభీతము వలె తన గుహాలలోనణగి
యున్నచీకటిని సూర్యుని నుండి కాపాడుచున్నాఁడు.
శరణొందిన నీచునందును నుత్తమునందు వలె నున్నతుల
కెక్కువ మక్కువ యుండును నిజము.

ఇత్యాద్యర్థాంతర న్యాసోదాహరణములందుఁ బ్రస్తుతమునకు సమర్థనాపేక్ష లేదు కదా !

---

40. అథోపగూఢే శరదా శశాంకే ప్రావృడ్యయౌ శాంత తటిత్కటాక్షా ।
కాసాం న సౌభాగ్యగుణోఽంగనానాం నష్టః పరిభ్రష్ట పయోధరాణామ్ ॥

41. దివాకరాద్రక్షతి యో గుహాసు లీనం దివాభీతమి వాంధకారం ।
క్షుద్రేపినూనం శరణం ప్రపన్నే మమత్వముచ్చైశ్శిరసాం సతీవ ॥

నిజమున కిది తరచుగ నగుననికాని తప్పని దని చెప్పరాదు. అర్థాంతర న్యాసమున విశేషమునకు సామాన్యసమర్థనాపేక్ష లేకున్నను 'విశేషములేని సామాన్యముండ' దను న్యాయముచే

'సారములేని యనేక వస్తువుల కలియిక కార్యసాధకము'

ఇత్యాదిసామాన్యము.

తృణములతోఁ గూర్పఁబడిన రజ్జువుచే నేనుఁగు కూడఁ గట్టఁ బడుచున్నది.

ఇత్యాదిప్రసిద్ధ విశేషోపన్యాసము లేకుండ బుద్ధి కెక్కక పోవుట వలన సామాన్యము విశేషముచే సమర్థనము నపేక్షింపనే యపేక్షించును.

ఇచటి సామాన్యము కూడ 'పతిత పయోధరలగు నేయంగనల సౌభాగ్యమడుగంటకుండును?' ఇత్యాది విశేషసమర్థక సామాన్యము వలెనే లోకప్రసిద్ధ మగుటచే విశేషోపన్యాసము లేకయే బుద్ధి కెక్కును గావున శ్లోకార్థమునఁ దృణములతోఁ గూర్పఁబడిన ఇత్యాది విశేషో పన్యాస మపేక్షితముకాదు అనరాదు. సామాన్యము సర్వత్ర లోక ప్రసిద్ధమగు నను నియమము లేదుకదా!

పొగయున్నచోటులం దెల్ల నగ్నియుండును అను వ్యాప్తిరూప సామాన్యము లోకప్రసిద్ధమగుటచే మహానసమువలె నను విశేష రూప దృష్టాంతమును గ్రహింప నవసరము లేనంతమాత్రమున నప్రసిద్ధ వ్యాప్తి రూప సామాన్యమును జెప్పినప్పుడును విశేష రూప దృష్టాంత కథనాపేక్ష కలుగకపోవునా?

ఇట్లే సామాన్యముచే విశేషమును సమర్థించుచోఁ గూడ నొకచోట నావిశేషసమర్థక సామాన్యము లోకప్రసిద్ధము కాకపోవుటచే నది తెలి యుట కింకొక విశేషము నుంపవలసి వచ్చునే? యనరాదు. ఈ సందర్భ ములోనే వికస్వరాలంకారము వెంటనే చెప్పఁబడు చుండుటవలన నది యిష్టమే.

[41] ఇంతియకాదు. కావ్యలింగమునను నంతట సమర్థనాపేక్ష కల దను నియమములేదు. 'విదుషి యా దమయంతి కేశపాశము' అనుచో సమర్థనము లేకపోవుటవలన, ఉపమానవస్తువులందు వర్ణనీయ కేశపాశ సామ్యము లేకపోవుటచే నింద కవికుల ప్రసిద్ధము కావున సమర్థనాపేక్ష లేకపోవుట వలనను 'శరత్కాలమునందలి పూర్ణచంద్రుఁడు నలముఖ దాస్యమునకును దగఁడు' ఇత్యాదులందు సమర్థన మావసరమున్నను గనఁబడదు కదా! విషముతోఁగాని, శస్త్రముతోఁగాని, యగ్నితోఁగాని, మృత్యువుతోఁగాని స్త్రీలు నిర్మింపఁబడలేదు. అప్రతీకార పారుష్యలు స్త్రీలుస్త్రీలతో నిర్మింపఁబడిరి. ఇత్యాది కావ్యలింగోదాహరణములందు సమర్థనాపేక్షలేకున్నను 'అప్రతీకార పారుష్యలు' ఇత్యాదిచే సమర్థనము కనఁబడుట వలనను, అచట స్త్రీలు విషాదులతో నిర్మింపఁబడలేదని తెలుపుట, ప్రసిద్ధ మగుటచే సమర్థనాపేక్ష లేనేలేదు. అందువలన నన్వయవ్యతిరేక వ్యభిచారములచే (అపేక్షయున్నను సమర్థనము లేకుం డుట, అపేక్షలేకున్నను సమర్థనముండుట) సమర్థనాపేక్షయున్నచో సమర్థించుట కావ్యలింగము, సమర్థనాపేక్ష లేకున్నచో సమర్థించుట యర్థాంతరన్యాసము, అను విభాగము లేదు. ఇఁకనేమంటే సమర్థ్య సమర్థకములకు సామాన్య విశేష సంబంధ ముండిన నర్థాంతరన్యాసము, వేఱు సంబంధ ముండిన కావ్యలింగము ననువ్యవస్థ నెఱుంగవలెను. విశేషము చిత్రమీమాంసలోఁ జూడఁదగును. ఇట్లప్రకృతముచే బ్రకృత సమర్థన ముదాహరింపఁబడినది.

ప్రకృతముచే నప్రకృత సమర్థన మెట్లన,

---

41. ఇంతకు నర్థాంతరన్యాసమునకు సమర్థన మవసరమని తేలినది. ఓయి! అర్థాంతరన్యాసమున కెక్కడో సమర్థనాపేక్ష కావ్యలింగమున నన్నియెడ నంతట సమర్థనాపేక్ష. ఇదియే యీరెంటికి భేద మనఁగూడదా యన్నచోఁ జెప్పుచున్నాఁడు.

[42] ఓ పార్వతీ! రూపమున్నచో పాపవ్యవహారముండదు. అను మాట నిజము. నీనడవడి మునులకును నుపదేశకము కదా! మఱియు,

దాత దానమిచ్చుచుండినను నతడు జలములచే న్యాక్రమింపఁబడఁగా సగతికుఁ డెవఁడచట నుండుట కుత్సహించును? మునుఁగఁగోరినదంతికటలటలమునుండి తుమ్మెద గుంపెగిరి పోవుటలేదా?

## 62. వికస్వరాలంకారము.

ఏ వాక్యమున విశేష సామాన్య విశేషములు గూర్పఁబడునో యచట వికస్వరముండును. ఆరాజు శత్రువులచే జయింపఁబడలేదు. గొప్పవారు సాగరములవలె లోఁబడని వారుకదా!

ఎచట నొకవిశేషమును సమర్థించుటకు సామాన్యమునుంచి దాని ప్రసిద్ధికి దృష్టినొందక కవి యాసామాన్యమును సమర్థింప మఱొక విశేషము నుపమానరీతిగనో యర్థాంతన్యాస విధముననో చెప్పిన నచట వికస్వరాలంకారము. రెండవవాక్యము కష్టమునీఁద నుదాహరణ మగును. ఇది స్పష్టమగు నుదాహరణము.

[43] అనంతరత్నములకు హేతువగు హిమవంతుని సౌభాగ్యమును మంచొక్కటి తగ్గించలేదు. గుణసముదాయము నందు దోష మొక్కటి చంద్రుని కిరణము లందంకమువలె నణగిపోవుచున్నది కదా!

42. యదుచ్యతే పార్వతి పాపవృత్తయే నరూపమిత్యవ్యభిచారి తద్వచః।
తథాహి తేశీల ముదారదర్శనే తపస్వినామ ప్యుపదేశతాంగతః॥

43. అనంతరత్న ప్రభవస్యయస్యహిమం నసౌభాగ్య విలోపి జాతమ్।
ఏకోహిదోషోగుణ సన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః॥

ఇది యుపమాన రీతిగ విశేషము చెప్పుటలో నుదాహరణము.

అర్థాంతరన్యాసవిధముగ నెట్లన,

" ఓ కాకమ ! శ్రోత్రపీడాకరమగు శబ్దమును వీడి మకరంద యుక్తమగు మాకందము నాశ్రయింపుము. నిన్ను కోకిల మను కొందురు. స్థానమహిమచేఁ గొన్ని ధన్యములగును. నేపాలభూపాలుని ఫాలమందుఁబడిన పంకమును గస్తూరిగా నెవఁడు తలంపఁడు ? మఱియు,

" భ్రమరకళంకములు పద్మచంద్రులకు మాలిన్యమును గలిగించును. నీ కన్ననో ! మోమునందు తిలకశోభను, గన్నులందుఁ గాటుక కాంతిని నిచ్చును. దోషములొక ప్పుడు సంసర్గమువలన గుణములగును, వక్తృవాక్యమున భ్రమప్రతారణములు గుణములే యగుచున్నవి కదా? వక్త ఘటమున్న చోట నది లేదనుకొని వంచనకై ఘటమున్న దన్న వాక్కు నిజమగుచుండలేదా ?

## 63. ప్రౌఢోక్తి

ఉత్కర్షకుఁగారణము కానిదానియం దుత్కర్షహేతుత్వమును గల్పించుట ప్రౌఢోక్తి.

---

44. కర్ణారుంతుద మంతరేణ రణితం గాహస్వ కాక స్వయం
మాకందం మకరందశాలిన మిహ త్వాం మన్మహే కోకిలమ్ ।
ధన్యాని స్థలవైభవేన కతిచిద్వస్తూని కస్తూరికాం
నేపాలక్షితిపాల ఫాలపతితే పంకే న శంకేత కః ॥

45. మాలిన్యమబ్జశశినోర్భ్రమరిట్కలంకౌ
ధత్తో ముఖేతు తవదృక్తిలకాంజనాభ్యామ్ ।
దోషావితః క్వచన మేళనతో గుణత్వం
వక్తుర్గుణౌ హి వచనే భ్రమవిప్రలంభౌ ॥

ఉ॥ కచములు కాళిందీతట తమాలశ్యాములు.

కార్యాతిశయమునకుఁ గారణముకాని దానియందు గార్యోత్కర్షకై కారణత్వమును కల్పించుట ప్రౌఢోక్తి యగును. తమాలములందలి నైల్యాతిశయమునకుఁ గారణముకాని కాళిందీతటోత్పత్తికిఁ దత్కారణత్వమును గల్పించినట్లే మఱియు,

[46] ఈ రాజు కల్పవృక్షపురజముతోడను గామధేనువు పాల
తోను జింతామణి తేజముతోను గుబేరుని శ్వాసము
తోడను శంఖమందలియాకసముతోడను రచింపఁబడెను.

కల్పవృక్షాదులలో నొక్కొక్కదాని వితరణము నతిశయించిన ప్రకృత రాజవితరణమునకుఁ గారణముకాని కల్పవృక్షపు రజము మున్నగు పంచభూతములతో నిర్మితుఁడగుటే రాజ వితరణాతిశయమునకు కారణమని కల్పించుట ప్రౌఢోక్తి.

## 64. సంభావనాలంకారము.

ఇట్లయినచో నీ కార్యము సిద్ధించునని యూహించుట
సంభావన యగును,

చెప్పువాఁడు శేషుఁడైనచో నీగుణములు చెప్పనగును.
మఱియు,

[47] నేను విధినైనచో కస్తూరి మృగముల యండమునుండి
గంధము నంతనుదీసి ఖలజిహ్వా యం దుంతును.

అయినచో అనునర్థము చెప్పినప్పుడు నూహా కల్పింపఁబడినచో నతిశయోక్తివిశేషమేయగునని మమ్మటుఁడనెను.

---

46. కల్పతరుకామదోగ్ధ్రీ చింతామణి ధనద శంఖానాం ।
రచితో రజోభర పయస్తేజ శ్శ్వాసాంతరాంబరై రేషః ॥

47. కస్తూరికామృగాణా మండాద్గంధ గుణమఖిలమాదాయ ।
యదిపు నరహాం విధిస్స్యాంఖల జిహ్వాయాం నివేశయిష్యామి ॥

## 65. మిథ్యాధ్యవసిత్యలంకారము.

ఒక టసత్యమని స్థిరముచేయుటకు వేఱొక యసత్యార్థమును గల్పించుట మిథ్యాధ్యవసితి యగును.

గగన కుసుమమాలను ధరించి వేశ్యను వశమొనరించుకొనవచ్చును.

ఇచట వేశ్యను లోఁబఱచుకొను టసంభవమని స్థిరపఱచుటకు గగన కుసుమ మాలికా ధారణ మను నర్థాంతర కల్పనము మిథ్యాధ్యవసితి యగును. మఱియు,

"[48] ఓ కచ్ఛపీ! పరార్థాధిక సంఖ్యతోఁగూడి అంధునిచేఁ జూడఁ బడినవి, బధిరులచేవినఁదగినవియునగు ఈ రాజున పకీర్తులు వంధ్యకుఁబుట్టిన మూఁక ప్రకరముచేఁ బాల సముద్రపు టొడ్డున నష్టమస్వరముతో గానము చేయఁ బడుచుండెనఁట!

ఇచట మొదటి యుదాహరణము నిదర్శనతోఁ గూడినది. రెండవది శుద్ధము.

సంబంధములేనిచోట సంబంధమును గల్పించు నతిశయోక్తి కంటె మిథ్యాధ్యవసితికి నొకయర్థముయొక్క లేమి సిద్ధించుటకు మఱొక లేని వస్తువును గల్పించుట యను విచ్ఛిత్తి విశేషముండుటే భేదము.

## 66. లలితాలంకారము.

ప్రకృత విశేష్యమందు ప్రకృత వాక్యార్థమును బోలిన వాక్యార్థమును వర్ణించుట లలిత మగును.

ఈమె నీరు పోయినపిమ్మట గట్టువేయఁ గోరుచున్నది.

---

48 అస్యక్షోణిపతేః పరార్థపరయా లక్షీకృతాస్సంఖ్యయా
ప్రజ్ఞాచక్షురవేక్ష్యమాణ బధిరశ్రావ్యాః కిలాకీర్తయః।
గీయంతే స్వర మష్టమం కలయతాజాతేన వంధ్యోదరా
న్మూకానాంప్రకరేణ కూర్మ రమణీదుగ్ధోదధే రోధసి॥

ప్రస్తుత విశేష్యమందు చెప్పఁదగిన విషయమును చెప్పక దాని ప్రతిబింబమువంటి యప్రస్తుత విషయము నొకదానిని వర్ణించుట లలిత మనఁబడును. అను రాగము లేకున్నను మొగమాటముచే వచ్చి తిరస్కరింపఁబడి మఱియొక నాయికయందాసక్తితో నేఁగిన నాయకుని తీసికొని వచ్చుటకు దూతి నంపఁగోరుచున్న నాయిక నుద్దేశించి సఖవచనముచే నా వ్యాపారమునకు సరియగు గతజలసేతు బంధనమును వర్ణించుట లలితము.

లలితము ప్రస్తుత ధర్మికమగుటంబట్టి, యిది యప్రస్తుత ప్రశంస యనరాదు. ప్రస్తుత వృత్తాంతమును వర్ణించుచుండ విశేషణసాధారణ్యముచేఁగాని సారూప్యముచేఁగాని యప్రస్తుత వృత్తాంతము తోఁపకుండుటే కాక సరూపమగు నప్రస్తుత వృత్తాంతమువలననే ప్రస్తుత వృత్తాంతము గమ్యమగుటంబట్టి సమాసోక్తియు కాదు. వాచ్యములగు ప్రస్తుతాప్రస్తుత వృత్తాంతముల కైక్యారోపమున్ననే నిదర్శన విలసిల్లుటవలన నిది నిదర్శనయుఁగాదు. ప్రస్తుతా ప్రస్తుత వృత్తాంతములు వాచ్యములగుచుండిననే ప్రవర్తించు నలంకారము అప్రస్తుతము మాత్రము వాచ్యమగు నపుడును నున్నచో రూపకమునందే, 'భేదమున్నను నభేదరూపమగు నతిశయోక్తి' యంతర్భవింపవలయును గదా! ఓయి! అట్లయిన నీలలితమునఁ బ్రస్తుతమగు నాయకాది నిగరణముచే వాచ్యమగు నప్రస్తునీరాదికముతో నభేదాధ్యవసాయము చేయుటచే నిది భేదమున్నను నభేదరూపాతిశయోక్తి యగుఁగాక యన్నచో సారూప్యనిబంధనా ప్రస్తుత ప్రశంసా (శకుంతములలో చాతక మొక్కటి ధన్యము) విషయమునను నీయతిశయోక్తియే కావలసి వచ్చును. అప్రస్తుత ధర్మికముకావున నతిశయోక్తి కాదు. అన్నచో నచటి యప్రస్తుత ధర్మివాచక పదము కూడ బ్రసిద్ధాతిశయోక్త్యుదాహరణము (వాపీకాపీత్యాదు) లందువలెఁ బ్రకృత ధర్మిలక్షక మగుటంబట్టి యతిశయోక్తి కావచ్చును. ఓయి!

అప్రస్తుత ప్రశంసలో సరూపమగు నప్రస్తుతవాక్యార్థమువలనఁ బ్రస్తుత వాక్యార్థము తోఁచును. కాని యతిశయోక్తిలోవలె విషయివాచకములగు నాయాపదములచే నాయావిషయము లూహింపఁ బడవు కావున నిది భేదము అన్నచో నీలలితమునను బ్రస్తుతగతము నప్రస్తుత వృత్తాంత రూపము నగు వాక్యార్థమువలన, ప్రస్తుతగతమగు ప్రస్తుతవృత్తాంతరూప వాక్యార్థము తోఁచు ననునదే యతిశయోక్తికంటె భేదమగును. నిజమునకు ప్రస్తుత ప్రశంస యందొక్కచోట ప్రస్తుతా ప్రస్తుతముల కభేదమును దలంచుటయు నప్రస్తుతవాక్యార్థముతోఁచునపుడు కనబడును కాని లలిత మందెచ్చటను బొత్తిగా నతిశయోక్తితో భేదమే కనబడదు. అన్నచో జెప్పుచున్నాడు.

" ఓ భ్రమరమా ! ఆ, యపూర్వ రసనావిపర్యయము,
ఆకర్ణచాపలము, మదముచే స్వపరదిక్కుల నెఱుంగని
యాదృష్టి, వేయేల ? వారణముయొక్క శూన్యకరసేవ
నెఱింగియు భ్రాంతుఁడవై చేయుచుంటివి ఏమి యీ
పట్టుదల ?

ఇత్యాద్యప్రస్తుత ప్రశంసోదాహరణమందును వారణము భ్రమరమున కసేవ్యమను నప్రస్తుతమందుఁ గర్ణచాపలము మాత్రము భ్రమరమును దరిమి వేయుటలోఁ గారణమైనను రసనావిపర్యయ శూన్యకరత్వములు కారణములు కాకపోవుటచేతను, ప్రత్యుత మదము సేవించుటకే కారణమగుట చేతను, రసనా విపర్యయాదులు భ్రమరాసేవ్యత్వమునకుఁ గారణములుగ నన్వయించుటకై వారణ పదమునకు దుష్ప్రభురూప విషయముతో నభేదాధ్యవసాయముచేతనే ప్రవృత్తి చెప్పఁదగిన దగుటచేతను, ప్రథమ ప్రతీతమగు నప్రస్తుత వాక్యార్థము వలనఁ బ్రస్తుత వాక్యార్థా వగమనము కలుగు నన్నమాట కుదురదు.

---

౪౩. సోఽపూర్వోరసనా విపర్యయ విధిస్తత్కర్ణయోశ్చాపలం
దృష్టిస్సామదవిస్మృత స్వపరదిక్కింభూయసోక్తేనవా।
పూర్వంనిశ్చితవానసి భ్రమర హే యద్వారణోద్యాప్యసా
వంతశ్శూన్యకరో నిషేవ్యత ఇతి భ్రాంతః కిమేవాగ్రహః॥

ఇట్లున్నను అప్రస్తుత సంబోధనాది చమత్కార విశేషమువలన నప్రస్తుత ప్రశంస కతిశయోక్తికంటె భేదము కుదిరినచో నప్పుడీ లలిత మందును బ్రస్తుత ధర్మిని నాధర్మి వాచకపదముతోఁజెప్పి యందప్రస్తుత వర్ణనరూపవిచ్ఛిత్తి విశేషము చూపుటవలన నాలలితమున కతిశయోక్తి కంటె భేదము తప్పక కుదరును.

'నల్లకలువలజంటనుండి వాడి బాణములు వెడలుచున్నవి.' 'ఆకస మున నొకదిగుడు బావియున్నది దానిమీఁద నొక సన్న నిమార్గమున్నది.' ఇత్యాదులందన్నచో ప్రస్తుతమగు నేధర్మిని నాధర్మివాచక పదముతోఁ జెప్పకపోవుటచే నతిశయోక్తియే యుండును. ఇట్లు చెప్పుటచే గత జలసేతుబంధన వర్ణనాదులందు సంబంధము లేకున్నను సంబంధ మున్నట్లు చెప్పు నతిశయోక్తి యుండునను శంకయు పోయినది.

అట్లుండ 'ఓయి! నీవెవఁడవు' ఇత్యాది యందును సంబోధ్యత్వ, ఉచ్చారయితృత్వముల సంబంధము లేకున్నను నున్నట్లు వర్ణించుట వలన నతిశయోక్తి చెప్పవలె నను నాపత్తిరాగా సారూప్యనిబంధనమగు ప్రస్తుత వాక్యార్థావగతి రూప చమత్కార విశేషముచే నలంకారాం తరము (అప్రస్తుతప్రశంస) ను గల్పించు టవసరమన్నచో నీయుదాహరణ మందును నాయలంకారాంతర (లలిత) కల్పనావసరము తుల్యము. అందువలన నన్ని యలంకారములకంటె నీలలితము వేఱు. మఱియు,

> సూర్యవంశమెక్కడ? అల్పమును గ్రహించు నాబుద్ధి యెక్కడ? అజ్ఞానమువలన తెప్పతో సముద్రమును దాటఁగోరుచున్నాను.

అనుచోటఁ గూడ అల్పవిషయ యగు బుద్ధిచే సూర్యవంశమును వర్ణింపఁగోరు నేను' అని ప్రస్తుత వృత్తాంతమును వర్ణింపక పోవుట చేతను, బ్రస్తుత వృత్తాంత ప్రతిబింబ రూపమగు 'తెప్పతో సముద్రము

దాటఁగోరితి' నను నప్రస్తుత వృత్తాంతమును వర్ణించుటచేతను, తొలుదట విషమాలంకార విన్యాసముచేతను, నచట నల్పమతిని సాధనముగాఁ జేసికొని సూర్యవంశ వర్ణనేచ్ఛాభిప్రాయము మాత్రమే గమ్యమగుటం బట్టియు లలితమేయగును కాని నిదర్శన యని భ్రాంతిపడరాదు. మఱియు,

" ఓనల! యిప్పు డేదేశము వసంతుఁడు వీడిన వనదశను
నీచేనొందింపఁ బడెనో, నీయందు సంకేతిత మగుటచే
గృతార్థ మగు నామ మిా నాకు శ్రావ్యము కాదా?

ఇచట నేదేశము నీచే వీడఁబడినది అని ప్రస్తుతార్థము నుపన్యసింపక 'ఏదేశమును వసంతుఁడు వీడిన వనదశను పొందించితి' వని దాని ప్రతిబింబ మగు నర్థమునుమాత్ర ముపన్యసించుటచే లలితాలంకారము.

## 67. ప్రహర్షణాలంకారము

ప్రయత్నమక్కఱలేకయే యుత్కంఠితార్థము సిద్ధించుట
ప్రహర్షణ మగును.
తానెల్లపుడు దలంచుచున్న తన్వియే తనకడకు స్వయం
దూతియై యరుదెంచెను.

ఉత్కంఠయన నొకవిధమగు కోరిక.

ఎందు సర్వేంద్రియ సుఖాస్వాద మున్నదని తలంపఁ
బడునో దానినిఁ బొందవలెనను దృఢసంకల్పముతోడి
వేగిరపాటు నుత్కంఠనుగాఁ గవు లెఱుంగుదురు.

అను లక్షణముండుటవలన నట్టి యుత్కంఠావిషయ మగు నర్థము నప్రయత్నముగనే పొందుట ప్రహర్షణము. ఉదాహరణము స్పష్టము. మఱియు,

---

50. అహాయిదేశః కతమ స్త్వయాద్య వసంతముక్తస్య దశాంవనస్య।
త్వయా త్తసంకేతతయాకృతార్థా శ్రావ్యాపినామైవ జనేన సంజ్ఞా ॥

51 ఆకసము మబ్బులతో నిండినది. వనభూములు తమాల వృక్షములచేఁ జీఁకటి క్రమ్మియున్నవి. రాత్రియం దితఁడు పిఱికివాఁడు. అందుచే రాధా! నీవే వీని నింటికిఁ గొనిపొమ్ము. ఇట్లు నందుని సెలవుగైకొని బయలు దేఱిన రాధా మాధవులకు యమునాతీరమున దారిలోఁ బ్రతి కుంజముదగ్గఱ ప్రతిచెట్టుక్రింద రతి కేళు లధికముగ వర్ధిల్లుచుండెను.

రాధా మాధవులు పరస్పర ముత్కంఠితులగు టతిప్రసిద్ధము. ఘుండు గీతగోవిందకారునిచే నిది కూర్పఁబడినది కావున నిచటి యుదాహరణమున లక్షణసమన్వయము.

కోరినదానికంటె నధికము సిద్ధించుటయుఁ బ్రహర్షణమే. దీపముఁ బెద్దఁజేయఁ దలంచునంతలో సూర్యుఁడుదయించెను. స్పష్టము. మఱియు,

చాతకము దప్పిచే నాలు గయిదు నీటిబిందువులను మేఘునిఁగోరుచుండెను. మేఘుఁడును బ్రపంచమును నీటితో నింపెను. గొప్పవారి యౌదార్యము చెప్ప తరము గాదుగదా!

ఫలోపాయసిద్ధికొఱకు జేయు ప్రయత్నమువలన సాక్షాత్ఫల లాభముకలిగిన నదియుఁ బ్రహర్షణమగును.

నిధి దర్శన సాధనమగు నంజనమున కోషధీమూలమును ద్రవ్వువానికి నిధి దొరకెను.

---

51. మేఘైర్మేదురమంబరం వనభువశ్శ్యామా స్తమాలద్రుమైః
నక్తం భీరు రయం త్వమేవ తదిమం రాధే గృహం ప్రాపయ।
ఇత్థం నంద నిదేశతశ్చలితయోః ప్రత్యధ్వకుంజద్రుమం
రాధామాధవయోర్జయంతి యమునాకూలే రహః కేళయః॥

ఫలోపాయసిద్ధికిఁ బ్రయత్నించుచుండ నుపాయసిద్ధి లేకుండ సాక్షాత్ఫలమే లభించుటకూడ బ్రహర్షణమగును. నిధి దర్శనసాధనాంజన సిద్ధికై మూలికను ద్రవ్వువాని కచటనే నిధి లభించినట్లు. మఱియు,

రాలినపువ్వుల విడిచి కొమ్మ నున్న పువ్వులంగోనఁగోరిన
కోమలి చెట్టెక్కుటకు చెట్టుమీఁద కాలుపెట్టెను.
ఆపాదన్యాసముచే నా యశోక మామూలము తిరిగి
పుష్పించెను.

ఇచట, పుష్పగ్రహణమున కుపాయము చెట్టెక్కుట. అది సిద్ధించుటకై చెట్టుమీఁదఁ గాలుపెట్టగా నచటనే పుష్పములు లభించెను.

## 68. విషాదనాలంకారము

కోరికకు విరుద్ధ మగు కార్యము జరుగుట విషాదనము.
దీపము పెద్దఁజేయఁ దలంచునంతలో నది యారిపోయెను.
మఱియు,

[54] "రాత్రి గడచును తెల్లవారును సూర్యుఁ డుదయించునుపద్మములు వికసించును. అని పద్మపుమొగ్గలో నున్న తుమ్మెద తలంచుచుండగనే గజము తామర కాడను లాగివేసెను. ఎంతకష్టమెంతకష్టము!

## 69. ఉల్లాసాలంకారము

ఒకని గుణదోషములవలన మఱొకని కాగుణదోషములు కలిగినచో నుల్లాసమగును. పతివ్రత స్నానముచేసి నన్ను పవిత్రముచేయుగాక యని గంగ కోరుచున్నది.

---

54. రాత్రిర్గమిష్యతి భవిష్యతి చ ప్రభాతం
భాస్వానుదేష్యతి హసిష్యతి పంకజశ్రీః ।
ఇత్థంవిచింతయతి కోశగతే ద్విరేఫే
హా హంత హంత నళినీం గజ ఉజ్జహార ॥

రాజ! నీదండయాత్రలందుఁ బరుగిడుచున్న శత్రుకాంతలు
కుచములందలి కాఠిన్యమును పాదపద్మములందు కోరుచు
ధాతను నిందించుచున్నారు.

ధనము సజ్జను నాశ్రయింపమి దాని దౌర్భాగ్యమే.
భూపతీ! నీసేవకులకుఁ జావు తప్పుటే మహాలాభము.

ఎచట నొకనిగుణముచే మఱొకనికి గుణము, దోషముచే దోషము, గుణముచే దోషము, దోషముచే గుణము, గాని వర్ణింపఁబడిన నదియు నుల్లాసాలంకారమగును. పతివ్రత యను రెండవవాక్యము మొదటి దానికుదాహరణము. అందుఁ బతివ్రతామహిమగుణముచే, నామె స్నానమువలన గంగకు పావనత్వగుణము వర్ణింపఁబడినది.

'రాజ! నీదండయాత్రలందు' అను వాక్యము రెండవదాని కుదాహరణము. అచట రాజు దండెత్తునపుడు వనములఁ బారిపోవు శత్రువనితలపాదములందు పరిగిడుటకుఁ బ్రతిబంధకమగు మార్దవదోషముచేఁ బాదములందు కాఠిన్యముంచక వ్యర్థముగఁ గుచములందుఁ గాఠిన్యముంచిన ధాతకు నింద్యత్వ దోషము వర్ణింపఁబడినది. 'ధనము' 'భూపతీ!' ఇత్యాది మూఁడవ శ్లోకవిషయము మూఁడునాలుగుల కుదాహరణము. అందు సజ్జనమహిమగుణముచే ధనము వారినాశ్రయింపమి దోషము గాను, భూపతి క్రౌర్యదోషముచే నాతఁడు సేవకులను జంపకుండ విడిచి పెట్టుట గుణముగను, వర్ణింపఁబడినది. ఈక్రమముననే యుదాహరణాంతరములీఁబడు చున్నవి.

[58] రథ చలనమునఁ బ్రేయసి (ఊర్వశి) భుజము నాబుజము
నకుఁ దగులుటచే నాబుజ మొక్కటే ధన్యము. తక్కిన
శరీరము భూభారమే.

---

58. యదయం రథసంక్షోభాదంసే నాంసో నిపీడితః ।
ఏకః కృతీ మదంగేషు శేష మంగంభువో భరః ॥

ఇచట నాయికా సౌందర్య గుణముచే నూర్వశి బుజమునకుఁ దగిలిన తన భుజము ధన్యమైనట్లు వర్ణింపఁబడినది.

[54] లోకము నానందింపఁజేయు చందనతరు మిత్రమా! ఈవనమున నుండకుము. ఈవనము కఠినములు నంతస్సారశూన్యములు నగుదుర్వంశములతో నిండియున్నది. అవి యన్యోన్యసంఘర్షణమున జనించిన యగ్నిజ్వాలలతో వానికులమునే కాక యీవనము నంతను గాల్చును.

ఇచట వేణువుల రాయిడినుండి పుట్టిన చిచ్చుతోఁ గూడుట యను దోషముచే వననాశ మను దోషము వర్ణింపఁబడినది.

మదమును గోరి వచ్చిన మధుకరములను గజేంద్రము తెలివితక్కువచేఁ జెవులతో దూరముగాఁ దరిమివేయుట దానిగండము లందలంకారమునకే లోపము. తుమ్మెదల కేమి ? అవి హాయిగా ఫుల్లారవింద వనమందు సంచరించును.

ఇచట భ్రమరముల యలంకరణత్వ గుణముచే భ్రమరములందరిమివేయుట గజదోషముగ వర్ణింపఁబడినది.

[55] ఓ రత్నమా ! వానరము నిన్ను వాసనచూచి ముద్దిడి రుచిచూచి నమిలి, నిరుత్సాహముతో విడిచినదని బెంగ

---

54. లోకానందన చందన ద్రుమసఖే నాస్మిన్వనే స్థీయతాం
దుర్వంశైః పరుషై రసారహృదయై రాక్రాంత మేతద్వనమ్ ।
తేహ్యన్యోన్యనిఘర్ష జాత దహనజ్వాలావళీసంకులా
న స్వాన్యేవ కులాని కేవలమిదం సర్వం దహేయుర్వనమ్ ॥

55. ఆఘ్రాతం పరిచుంబితం పరిముహుర్లీఢం పునశ్చర్వితం ।
త్యక్తంవా భువినీరసేన మనసా తత్ర వ్యథాం మాకృథాః ।
హే సద్రత్న తవైతదేవ కుశలం యద్వానరేణాదరా
దంతస్సార విలోకన వ్యసనినా చూర్ణీకృతం నాశ్మనా ॥

పెట్టుకోకు. ఇది నీకు మేలే. లోపల గుంజున్న దేమో!
యనితాలితోఁ జూర్ణము చేయలేదు.

వానరము చపలతాదోషముచే రత్నమును జూర్ణము చేయకుండుట గుణముగ వర్ణింపఁబడినది. వీనిలో మొదటియుదాహరణమున, నాలవ యుదాహరణమున నుల్లాసము సార్థకము. మధ్యమోదాహరణములందు [56] ఛత్రిన్యాయముచే లాక్షణికము.

## 70 అవజ్ఞాలంకారము

ఒకని గుణదోషములవలన నితరుల కాగుణదోషము లంటనిచో నది యవజ్ఞయగును. సంద్రమునొందియుఁ గుంచము కొంచెము నీటినే పొందుచున్నది.

పద్మములు ముకుళించినచోఁ జంద్రునకేమి లోపము ?

ఇచట నొకని గుణముచే నితరునకు గుణములేకుండుటలో రెండవ వాక్య ముదాహరణము. దోషముచే దోషమురాకుండుటలో మూఁడవ వాక్య ముదాహరణము. మఱియు,

[57] నాకవిత విద్వాంసుని కమృతమై యాతని మనసుమెప్పించెనా! రసహీనుని యనాదరముచే దీనికేమి లోపము ?

---

56. గొడుగులుకలవారు, గొడుగులులేనివారును గలసి వెళ్ళుచున్న గుంపును జూచి "గొడుగులవారేగుచున్నారు" అనుచోఁ గొడుగులవారు అనుపదము గొడుగులు లేని వారినిగూడఁ జెప్పును. స్వార్థమును విడక యితరార్థములను గూడ గ్రహించుటచే దీనిని 'అజహల్లక్షణ' అందురు. ఛత్రిన్యాయ మన్నను నిదియే.

57. మదుక్తిశ్చే దంతర్మదయతి సుధీభూయ సుధియః
కిమస్యా నామ స్యాదరసపురుషానాదరభరైః ।
యథాయూనస్తద్వత్పరమరమణీయాపి రమణీ
కుమారాణామంతః కరణహరణం నైవ కురుతే ॥

చక్కనికాంత యువజనమనోహర మైనట్లు బాలకుల మనసు నాకర్షింపనేలేదు.

" ఓ శివ ! నీవు వృషభము నెక్కి తిరిగినంతమాత్రమున దిగ్గజముల కేమి లోపము ? పాములఁగంకణములుగాఁ జేసి కొన్నచో బంగారమున కేమికొదువ ? జలాంశువును శిరోభూషణముగఁ జేసిన లోకత్రయీ దీపమగు పద్మబాంధవునకుఁ బరాభవమేమి ? లోకముల కధిపతివి. ఏమి చెప్పము !

వీనిలో మొదటిభాగమందుఁ గవితారమణీ గుణములచే నరసిక, బాలకుల హృదయములం దుల్లాస గుణములేమి వర్ణింపఁబడెను. రెండవభాగమున పరమేశ్వరుఁ డంగీకరింపకుండుట యనుదోషముచే దిగ్గజాదులకు లాఘువాది దోషాభావము వర్ణింపఁబడెను.

## 71 అనుజాలంకారము

దోషమునందే గుణముండుటచే దోషమును గోరుట యనుజ్ఞాలంకారమగును. ఆపదలందే హరి తలంపఁబడును గాన మాకెల్లప్పు డాపదలే కలుగుగాక. మఱియు,

" ఓ హనుమ ! నీయుపకారము నాయందే జీర్ణమగు గాక. నరుఁడు ప్రత్యుపకారార్థియై యాపదను గోరుచున్నాఁడు. ఇది రాముఁడు హనుమంతునకుఁ జెప్పినమాట.

---

58. త్వం చేత్సంచరసే వృషేణ లఘుతా కా నామ దిగ్దంతినాం
వ్యాళైః కంకణ భూషణాని కురుషే హానిర్న హేమ్నామపి ।
మూర్ధన్యంకురుషే సుధాంశు మయశః కిం నామ లోకత్రయీ
దీపస్యాంబుజ బాంధవస్య జగతామీశోఽసి కిం బ్రూమహే ॥

59. మయ్యేవ జీర్ణతాం యాతు యత్త్వయోపకృతం హరే ।
నరః ప్రత్యుపకారార్థీ విపత్తి మభికాంక్షతి ॥

ఇచట ప్రత్యుపకారాభావము దోషము. దానిం గోరుటకు హేతు వగు గుణము విపత్తిని గోరకుండుటే. అదియు వ్యతిరేక రూపముగ సామాన్యముచే విశేష సమర్థన రూప మగు నర్థాంతరన్యాసముచేఁ జూపఁబడినది. మఱియు,

ఓ ప్రమథనాథా ! పిశాచరూపముఁ బొందినవైన నీ దగ్గర నుందుము. మా కమరసంపద లేల ? ఇంద్రాదులును నీ యింటి ముందర వక్రతుండాదులచే దండింపఁ బడుచుందురే !

## 72. లేశాలంకారము,

దోష గుణములందు గుణదోషములను గల్పించుట లేశాలంకారము. పక్షులన్నియు స్వేచ్ఛగ సంచరించుచుండ శుకమ ! పంజరబంధము నీ మధురవాక్కులకు ఫలమా ? ఎంతకష్టము !

దోషమును గుణముగను గుణమును దోషముగను గల్పించి చెప్పుట లేశాలంకారము. రాజున కభిమతుఁడు, విద్వాంసుఁడునగు పుత్త్రుఁడు చాలకాలమునుండి రాజనగరమున వసించుచుండఁ గొమరునిం జూడఁ గోరి యింటియందున్న తండ్రి చెప్పిన వాక్య మప్రస్తుతప్రశంసారూపము ఉదాహరణము. అందు రెండవవాక్యపు మొదటిభాగమందు ఇతర విహంగములు మాటలాడలేని దోషము స్వేచ్ఛాసంచారమున కనుకూల మగుటచే గుణముగఁ జెప్పఁబడినది. రెండవభాగమందు మధురముగ మాటలాడుట యనుగుణము పంజర బంధమునకుఁ గారణమగుటచే దోషముగఁ జెప్పఁబడినది.

ఇచట వ్యాజస్తుతి యని శంకింపరాదు. ఇందితర విహంగములకు స్తుతివ్యాజముచే నిందయుండుగాని శుకమునకు నిందావ్యాజముచే

స్తుతియందుగాని యభిప్రాయములేదు. కాని పుత్త్రోత్కర్షోత్కంఠితుఁ డగు తండ్రికి దోషమందు గుణత్వాభిమానమే యీ వాక్యమునఁ గూర్పబడినది. మఱియు,

[60] సత్పురుషులు మంచినడవడిని వృద్ధి పొందించు కొనఁగోరి స్వేచ్ఛాచరణము మాని జనాపవాదమునకు భయపడుచు నన్నివిషయములందు నెప్పుడు దుఃఖముతో జీవించు చున్నారు. తెలివిలేనివాఁడు తానుజేసిన సత్కార్యమునకుగాని యసత్కార్యమునకుగాని కలఁతఁ జెందఁడు. యుక్తాయుక్తము తెలియంగనినీచు ధన్యుఁడు.

ఈ లేశాలంకారమునకు దండి దీని నుదాహరించెను.

1. కామోత్సవముకంటెను రణోత్సవమందు వేడుక కలుగుటచే బలవంతుఁడు గుణవంతుఁడు నగు నీరాజు నీకుఁ దగినపతి.

2. సఖ ! తప్పు కప్పిపుచ్చుటకుఁ జాటువులునేర్చిన యీతఁడు చపలుఁడు నిర్దయుఁడు. ఇతనితో నాకేమిలాభము !

మొదటివాక్యమున రాజపరాక్రమస్తుతి నిరంతరము సంభోగమును గోరు కన్యకు దోషముగఁ గనఁబడుగాక యను భావముతో విదగ్ధయగు సఖచే రాజునకుఁ గోపము రాకుండుటకై యీ కామోత్సవానభిలాష గుణముగ వర్ణింపఁబడినది.

రెండవవాక్యమున సఖులు భర్తమీఁదఁ గోపగింపుమని బోధించిరి. నాయిక కోపగింపలేనిదయ్యు వారిదగ్గర దానికియ్యకొని మానమును

---

60. సంతస్సచ్చరితోదయవ్యసనినః ప్రాదుర్భవద్యంత్రణాః
సర్వత్రైవజనాపవాదచకితా జీవంతి దుఃఖంసదా
అవ్యుత్పన్నమతిఃకృతేన న సతా నైవాసతా వ్యాకులో
యుక్తాయుక్తవివేకశూన్యహృదయో ధన్యోజనః ప్రాకృతః ॥

నిర్వహింపలేక సఖుల నిందను బరిహరింపఁ గోరి నాయకుని ప్రియోక్తు లనుగుణమును దోషముగఁ జెప్పినది.

రాజకోపమును సఖ్యుపహాసమును బరిహరించుటకై నిందాస్తుతుల నితరులకుఁ దెలియకుండగ స్వల్పముగనే ప్రకటించుటచే నీ లేశమందు వ్యాజస్తుతికంటె భేదముండుటంబట్టి మొదటివాక్యమున స్తుతి నిందగాను రెండవ వాక్యమున నింద స్తుతిగాను బర్యవసన్నమగుటచే వ్యాజస్తుతియని శంకింపరాదు. వస్తుతః ఇచట వ్యాజస్తుతి యున్నను దోషములేదు. వ్యాజస్తుతి లేని లేశోదాహరణములుకూడ (పతుల న్నియునిత్యాది) చూపఁబడుటంబట్టి యిచట వ్యాజస్తుతి యున్నంత మాత్రముచే లేశోదాహరణములన్నియు వ్యాజస్తుతిలో నంతర్భవింపవు.

భిన్నవిషయ వ్యాజస్తుత్యుదాహరణములగు 'వానరమా ! నీ వెవఁడవు ? రామమందిరమున సందేశహారుఁడను' 'ఓ కురంగమ ! మాటి మాటికి ధనికుల మోముచూడవు' ఇత్యాదులందు దోషమును గుణముగఁజేయుట, గుణమును దోషముగఁ జేయుటయు లేకపోవుటంబట్టి, వానిలో నొకని గుణదోషములంబట్టి, యింకొకనిగుణదోషములే తోచు చుండుటవలనను, వ్యాజస్తుతులన్నియు లేశములో నంతర్భవించు ననుటకును వీలులేదు.

ఏకవిషయక వ్యాజస్తుతియు లేశముకంటె వేఱేయగును.

చంద్రుని కళంకము, నీలకంఠుని కంఠము, కృష్ణుఁడు,
మదజల మసుమసితోఁగూడిన దిగ్గజముల గండములు,
నిప్పటికి నల్లగనే కనఁబడుచున్నవి. ఓ రాజ ! వీనిని
నీకీర్తిచేఁ దెల్లగఁ జేసితివాయేమి ? చెప్పుము.

ఇత్యాద్యుదాహరణములందు లేశము లేనేలేదు. ఇచటఁజంద్ర కళంకాదులను దెల్లగఁ జేయకపోవుటయను దోషమే గుణముగఁ బర్య

వనన్నముకాలేదుకదా! ఇఁక నేమియుంటే పరిశేష న్యాయముచే తక్కిన వన్నియుఁ జెల్లగఁ జేయబడిన వనువేఱుగుణము తోఁచుచున్నది. ఒకా నొకచో వ్యాజస్తుత్యుదాహరణమునందు గుణమును దోషముగఁ జెప్పుట యున్నను స్తుతికి విషయాంతరముకూడ కనఁబడుచున్నది. ఎట్లన,

ఓ రాజ! ఎల్లప్పుడు నన్నిటిని నిచ్చుచున్నావని విద్వాం సులచే ననత్యముగ స్తుతింపఁబడుచున్నావు. శత్రువులకు నీ వెన్ను నీయలేదు. పరస్త్రీలకు నీవక్షము నియ్యలేదు.

ఇచట వాచ్యమగు నిందచే పరిశేషన్యాయమున వానిందప్ప నర్థులకు నభిమత మగు దీనారాదికమును సర్వము నిచ్చుచున్నాఁడని స్తుత్యంత రము కూడఁ దోఁచుచున్నది. ఓ రాజ! నీశౌర్యమదమేమి? ఇత్యాద్యు దాహరణములలో గుణదోషకరణాదికనే వ్యాజస్తుతి రూపముగ నున్న చోట లేశ వ్యాజస్తుతులకు సంకరముండుగాక. ఇట్లే పూర్వమందు వ్యాజస్తు త్యప్రస్తుతప్రశంసలకును సంకరము చెప్పఁబడినదిగదా!

## 73. ముద్రాలంకారము.

ప్రకృతార్థపరములగు పదములచే సూచింపఁదగిన యర్థ మును సూచించుట ముద్రాలంకారము.

ఆతరుణి నితంబగుర్వియు దృగ్యుగ్మ విపులయు నగును.

ఇందు నాయికావర్ణన పరమగు యుగ్మవిపులశబ్దముచే మూలము నందలి యీ యనుష్టుప్ శ్లోకమునకు యుగ్మ విపులానామమును సూచిం చుట ముద్రాలంకారము. యద్యపి యీ గ్రంథమందు వృత్తనామము సూచ్యార్థము కాకున్నను నీ మూలశ్లోకములోని యుత్తరార్థము లక్ష్య లక్షణములతోఁ గూడిన ఛందశ్శాస్త్ర మధ్యమందుండుటచే నది సూచ్యార్థమను నభిప్రాయముతో లక్షణము యోజించు కొనఁదగును.

ఇట్లే నవరత్నమాలయం దాయాగత్నినామనములఁ జెప్పుటచే నాయా రత్నముల జాతిని సూచించుట. నక్షత్రమాలయం దశ్విన్యాది దేవతా నామములతో నక్షత్రమును సూచించుట మొదలగు చోటులందు నీయ లంకారమే యుండును.

ఇట్లే నాటకములలో వక్ష్యమాణార్థ సూచనములందును ముద్రాలం కారమే యుండును.

## 74 రత్నావళ్యలంకారము

ప్రకృతార్థములను ప్రసిద్ధక్రమానుసారముగఁ బ్రతిపా దించుట రత్నావళియగును.

ఓ భూపతీ ! నీవు చతురాస్యుఁడవు లక్ష్మీపతివి సర్వజ్ఞుఁ డవు నగుదువు.

ఇచట చతురాస్యాది పదములచే వర్ణింపదగిన రాజు బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపుఁడగుట తోఁచుచున్నది. కావున బ్రసిద్ధులగు బ్రహ్మాదులను గ్రమముగఁ జెప్పుట రత్నావళ్యలంకారము. మఱియు,

"[61] రత్యాప్త ప్రియలాంఛనము కఠినతావాసము రసాలింగి తము ప్రహ్లాదైకరసము క్రమోపచితము భూభృద్గుర

---

61. రత్యాప్త ప్రియలాంఛనే కఠినతావాసే రసాలింగితే
ప్రహ్లాదైకరసే క్రమాదుపచితే భూభృద్గురుత్వాపహే
లోకస్పర్ధిని భోగభాజి జనితానంగే ఖలీనోన్ముఖే
భాతి శ్రీరమణావతారదశకం బాలే భవత్యాః స్తనే॥

ముగ్ధా కుచమునందవతార దశకమును జూపుచున్నాడు. రత్యాప్తప్రియలాం ఛనము—రతియందు పొందబడిన ప్రియుని నఖక్షతాదులు కలది, (కుచము) రత్యాప్తప్రి ప్రియాలాంఛనము (మత్స్యము) కఠినతావాసము—కఠినముగనున్నది, (కుచము, కూర్మము) రసాలింగితము—అనురాగముతో కౌగిలింపబడినది, (కుచము) భూమిచే కౌగిలింప బడినది, (వరాహము) ప్రహ్లాదైకరసము—అధిక సంతోషమందు రసము నిచ్చునది,

వాపహాము లోకస్పర్ధియు భోగభాజనము జనితానంగము
ఖలినోన్ముఖమునగు నీకుచమునందో బాలా! శ్రీరమణా
వతార దశకము భాసిల్లుచున్నది. మఱియు,

“ ఈయువతియొక్క కనులపోగ లీలాకమలములకుఁ బత్ర
మొసంగెను. కుచయుగము ఏనుఁగు కుంభములను
బూర్వపక్షము చేసెను. భ్రూవిభ్రమము మదనధనుర్వి
భ్రమము ననువదించెను. ముఖకాంతి చంద్రకాంతిని
దూషించెను.

ఇచట పత్రము నిచ్చుట పూర్వపక్షముచేయుట అనువదించుట దూషించుట ఇవి బుధ జన ప్రసిద్ధక్రమముగఁ జెప్పఁబడినవి.

ప్రసిద్ధ సహపాఠులకుఁ బ్రసిద్ధమగు క్రమము ననుసరింపకున్నను నీయలంకారమే యుండును. మఱియు,

ఈ రాజు ప్రతాపము నిహతశత్రువుల యంతఃపురములలో
హృదయములందగ్నిగను లోచనములందు జలముగను

---

(కుచము) ప్రహ్లాదునందెక్కువ ప్రీతికలది (నరసింహ) క్రమోచ్చదిశము బదరాఫలకాదిక్రమమున వృద్ధినందినది (కుచము) ‘ఇంతింతై వటుఁడింతయై’ యను క్రమమున పాదవిక్షేపముచే పెరిగినది (వామనము) భూభృద్దోరవాపహాము = కొండను తిరస్కరించునది, (కుచము) రాజుల గోరముసూడ్చినది, (పరశురామ) కోకస్పర్ధి = చక్రవాకసదృశము (కుచము) సీతావియోగకాలమున చక్రవాకములకు శాపమునిచ్చినది, (శ్రీరామ) భోగ భాజనము = సుఖము నొందునది (కుచము) శేషావతారమున పడగనొందినది (బలరామ) జనితానంగము = మన్మథోద్రేకమును గలిగించునది, (కుచము) శరీరవిరుద్ధమగు మానము, భోగత్యాగము, సమాధి మున్నగు ధర్మములుకలది (బుద్ధ) (లేక) అనంగజనకము = మన్మథుని తండ్రి (కృష్ణ) ఖలినోన్ముఖము = వియోగాసక్తుల అభిలాషకలది (కుచము) కల్కిని ముఖమందున్నది (గుఱ్ఱము)

62. లీలాబ్జానాం నయనయుగళద్రాఘిమా దత్తపత్రః
కుంభావైభాకుచపరిసరః పూర్వపక్షీచకార ।
భ్రూవిభ్రాంతిర్మదనధనుషో విభ్రమానన్వవాదీ
ద్వక్త్రజ్యోత్స్నా శశధరరుచిం దూషయామాస యస్యాః ॥

నూర్పులందు వాయువుగను నంగములందు క్షమ (పృథివి) గను మనసులందాకసముగను నుండి పంచమహాభూతముల రూపము మూర్తీభవించెనా ? యనఁగనఁబడెను.

ఇట్లష్టలోకపాల నవగ్రహాదులను ప్రసిద్ధ సహపాఠులను ప్రకృతోపమానములుగనో ప్రకృత రూపకములుగనో చెప్పుట రత్నావళి.

ప్రకృతాన్వయము లేకుండఁ గ్రమముగ నాయా నామములను శ్లేష రీతిగఁ జెప్పుటయందును క్రమప్రసిద్ధిలేని ప్రసిద్ధ సహపాఠులగు నవరత్నములఁ జెప్పుటయందును నీయలంకారమేయని యెఱుంగవలెను.

(ప్రసిద్ధ సహపాఠములగు నర్థములనుజెప్పుట రత్నావళియని సామాన్య లక్షణము. సక్రమాక్రమములు వాని భేదములు)

## 75. తద్గుణాలంకారము

తనగుణమునువీడి యన్యోత్కృష్టగుణమును గ్రహించుట తద్గుణ మగును.

నాసామౌక్తిక మధరకాంతిచేఁ బద్మరాగముగానున్నది. మఱియు,

ఓ వీరుఁడా ! నీ శత్రుకాంత వనభూములం బల్లవములను బరిధానముగాఁజేయ వానిఁజేతఁబట్టఁబోయి తననఖకాంతితోఁ గూడుటచేఁ బాండు పత్రములను గొని గ్రహింప లేదు.

## 76 పూర్వరూపాలంకారము

తిరిగి తన రూపముఁబొందుట పూర్వరూపము.

శేషుఁడు శివకంఠకాంతిచే నీలుఁడయ్యు నీకీర్తిచే దెల్ల బడెను. మఱియు,

అరుణునిచే నెఱ్ఱవారిన సూర్యాశ్వములు రైవతకాద్రి యందు వంశికరీరనీలములగు రత్నముల కాంతిచేఁ దిగిరి తమకాంతినొందింపబడినవి.

ఇదే తద్గుణాలంకారమని కొందఱువ్యవహించిరి.

వస్తువులేకున్న నున్నట్లుండుటయుఁ బూర్వ రూపమే యగును.

దీపమార్పఁబడినను గాంచీరత్నములకాంతిచే గొప్ప వెలుగుండెను. మఱియు,

[68] ఓ మహారాజ ! నీ శత్రుమందిరము శూన్యమయ్యు ద్వారము ఖడ్గులతోడను బహిర్ద్వారము మదగజముల తోను నంతఃపురము కంచుకులతోను శయనము మహిషులతోడనువ్యాప్తమై రాజ్యమర్యాద పూర్వమువలెనే యుండెను.

## 77 అతద్గుణాలంకారము

ఇతరగుణ సంబంధమున్నను దానినంటమి యతద్గుణ మగును. రక్తమగు నాచిత్తమునఁ జిరకాలముంపఁబడియు నీవు రక్తుఁడవు కాలేదు. మఱియు,

ఓ నరనరాజా! దిక్కులందువ్యాపించు నీ కీర్తి దిగ్గజముల మదమలినగండముల విహరించుచున్నను, వైరివనితల

---

68. ద్వారం ఖడ్గిభిరావృతం బహిరపి ప్రస్విన్నగండైర్గజై
రంతః కంచుకిభిస్స్ఫురన్మణిధరైరధ్యాసితా భూమయః ।
ఆక్రాంతం మహిషీభిరేవ శయనం త్వద్విద్విషాం మందిరే
రాజన్ సైవ చిరంతనప్రణయినీ శూన్యేపి రాజ్యస్థితిః ॥

ఖడ్గులు=ఖడ్గములధరించిన సేవకులు 'ఖడ్గమృగములు' కంచుకులు=అంగీలు ధరించిన సేవకులు, సర్పములు. మహిషులు=రాజభార్యలు, ఎనుములు.

కనుగవలందుండు కాటుకను దుడుచుచున్నను శ్వేతకరుని
కిరణకాంతి నోడించుచున్నది.

ఓయి! ఒక దానిగుణముచే మఱొకదానికి గుణోదయానుదయ రూపము లగు నుల్లా సావజ్ఞాలంకారములకంటెఁ దద్గు ణాతద్గుణములకు భేద మేమనఁ జెప్పుచున్నాఁడు. ఉల్లా సావజ్ఞాలక్షణములలోని గుణ శబ్దము దోషవ్యతిరిక్తమగు సద్గుణమును జెప్పును. ఒకదాని గుణముచే వేఱొకచో గుణోదయానుదయములున్ను ఆగుణమే సంక్రమించుట సంక్రమింపకుండుటకాదు. ఇఁక నేమంటే సద్గురూపదేశముచే సదసచ్ఛిష్యులకు జ్ఞానోత్పత్త్యనుత్పత్తులవలెఁ దద్గుణ జన్యములుగ సంభావింపఁబడిన మఱొక గుణముల యుత్పత్త్యనుత్పత్తులే. తద్గుణాలంకారములందలి గుణశబ్దమన్ననో! రూపరసాదిగుణములను జెప్పునది. అచటి యితరుని గుణ గ్రహణాగ్రహణములున్ను, "రక్తస్ఫటిక, వస్త్రమాలిన్యాది న్యాయముచే నితరవస్తుగుణముచేతనే ప్రకాశములుగ వివక్షింపఁబడినవి. అట్లే యుదాహరణములున్ను చూపఁబడెను.

యద్యపి అవజ్ఞా అతద్గుణాలంకారములు 'పుష్కలకారణమున్నను గార్యము పుట్టకుండుట విశేషోక్తి' యను సామాన్య లక్షణముతోఁ గూడి యుండుటంబట్టి విశేషోక్తి భేదములే. అట్లయ్యు నుల్లాస తద్గుణ ప్రతిద్వంద్వియగు విశేషాకారముచే నలంకారాంతరములుగా పరిగణింపఁబడెనని యెఱుంగవలెను,

---

24. స్ఫటికముకాని వస్త్రముకాని రక్తవర్ణమును, మాలిన్యమును గలిగియుండవు. రక్తవస్త్రము మీదగాని రక్తపుష్పముమీదగాని స్ఫటికమునుంచిన ఆస్ఫటికము రక్తస్ఫటికమువలెనుండును. సహజ శుద్ధమగు వస్త్రమునకు ముఱికితగిలిన నావస్త్రమునకు మాలిన్యము కలుగును. ఇదియే రక్తస్ఫటిక, వస్త్రమాలిన్య న్యాయము.

## 78 అనుగుణాలంకారము

ఇతర సంపర్కమువలనఁ దనపూర్వగుణ ముత్కర్ష నొందుట అనుగుణము.

నీలోత్పలములు కలికి చూపులచే నతినీలము లగుచున్నవి. మఱియు,

అసలే కోఁతి. కల్లుద్రాగి మత్తెక్కెను. అదిచాలక తేలు కుట్టెను. ఇంకను బిశాచగ్రస్త మాయెను. దానివికారము నేమిచెప్పము !

## 79 మీలనాలంకారము

సాదృశ్యమువలన భేదమే కనఁబడక పోయినచో మీలన మగును సహజారుణమగు చరణమున లత్తుకరంగు కనఁబడలేదు. మఱియు,

మల్లెదండల ధరించినవారు శరీరమందంతయుఁ జందనము నలందికొనినవారు దుకూలధారిణులు నగుటచే నభిసారికలు వెన్నెలలోఁ గనఁబడ కున్నారు.

ఇందు మొదటి యుదాహరణమునఁ జరణమునకు లత్తుకరంగునకు నరుణగుణసామ్యమువలన భేదము తోఁపకుండుట, రెండవయుదాహరణమున చంద్రి కాభిసారికలకు ధవళగుణసామ్యమువలన భేదము తోఁపకుండుట స్పష్టము.

## 80 సామాన్యాలంకారము

సాదృశ్యముచే భేదము కనఁబడకపోయినచో సామాన్యమగును.

పద్మాకరమున దిగిన పడతులమోములు కనఁబడుటలేదు మఱియు,

కొలువుకూటమునందు రత్నస్తంభము లందలి ప్రతిబింబ
ములతోఁగూడియున్న రావణుఁడు అంగదునకుఁ దెలియ
లేదు.

మీలనాలంకారమున నొకదానితో మఱొకటి వేఱుగాఁ గనఁబడక పోవుట యను కనుమాత్ర కలుగుచున్నది. సామాన్యాలంకారమున నన్ననో ముఖపద్మములు వేఱుగాఁగనఁబడుచున్నను ఇదిమోము ఇది పద్మము అని తెలుపు వ్యావర్తకము కనఁబడకపోవుట భేదము.

మీలితోదాహరణమునఁ జరణముల సహజారుణ్యముకంటె నొకం తుకమగు లాక్షారాగము వేఱుగ నగఁబడుటలేదుకదా ! సామాన్యోదాహరణమునఁ బద్మముఖములు వేఱువ్యక్తులు గనఁబడుచునే యున్నవి. అట్లే రావణ దేహము దాని ప్రతిబింబమున్ను. కాని యిది పద్మము ఇది ముఖము ఇది బింబము ఇది ప్రతిబింబము అని భేదము మాత్రము కనఁబడుటలేదు. అందుచేతనే భేదమును గప్పివేయుటచే మీలితము. భేదమును గప్పిపుచ్చుకున్నను పోలికచే గుఱుతు కనఁబడకపోవుటచే సామాన్యము నని రెండును నన్వర్థకములు.

మమ్మటాదులు కొందఱు వస్తుద్వయమునకు లక్షణసామ్యమువలన వానిలోఁ బ్రబలమగు నొకదానిచే రెండవదాని స్వరూపము కప్పఁబడినచో మీలితమని, స్వరూపము తోఁచుచున్నను గుణసామ్యముచే భేదమును గప్పిపుచ్చినచో సామాన్యమనియు నిర్వచించుటచే,

[1] కన్నులు చంచలాపాంగములు, మాటలు వక్రోక్తిగర్భ
ములు, నడక విలాసభారముచే మంథరము, ముఖ మతి

---

1 అపాంగతరళే దృశౌ తరళవక్ర వర్ణాగిరో
విలాసభర మంథరా గతి రతీవకాంతం ముఖమ్ ।
ఇతి స్ఫురితమంగకే మృగదృశాం స్వతోలీలయా
త దత్ర న మదోదయః కృతపదోపి సంలక్ష్యతే ।

మనోహరము, ఇట్లు మృగాక్షుల యవయవములందు
సహజముగ లీల ప్రకట మగుటచే నంగములందు మదో
దయమైనను గనఁబడుటలేదు.

అనుచోట మీలితాలంకారము.

ఇచట దృక్తారళ్యాదులు నారీశరీరమునకు సహజధర్మము లగుటవలన, మదోత్పత్తి కార్యములగుటవలనను, ఆ రెంటికి సాధారణ మగుటచే నధిక తారళ్యాదికముతోఁ గూడిన శరీరముచే, కారణము సమానమగుట వలన దానిని దెలిసికొన నుపాయము లేకపోవుటంబట్టి, మదోత్పత్తి స్వరూపమే కప్పబడుచున్నది.

మల్లెదండల ధరించినవారు ఇత్యాదులందన్నో సామాన్యాలంకార మందురు. వారిమతమున పద్మాకరమున దిగిన, ఇత్యాదులందు భేదాధ్యవసాయ మున్నను వ్యావర్తకము ప్రకటము కాకపోవుటచే వేఱలంకారము కాఁదగును. చంద్రాలోకకారుని మతమున స్వరూప తిరోధానముచే "కన్నులు చంచలాపాంగములు" ఇత్యాది స్థలమున వే అలంకారము కాఁదగును. మీలి తావాంతర భేదమైనఁ గాఁదగును.

## 81, 82. ఉన్మీలిత విశేషకాలంకారములు

భేదాభేదములు తోఁచుచుండిన నున్మీలిత విశేషకము
లగును నీకీర్తిలో నణగియున్న హిమాద్రినిఁ జల్లదనముచే
దేవతలు తెలిసికొనుచున్నారు.

చంద్రుఁ డుదయింపఁ బద్మములు ముఖములు వేఱుగాఁ
దెలియుచున్నవి.

మీలితరీతిచే అభేదజ్ఞానము కలుగఁగా నొకానొక కారణముచే భేదము ప్రకటమైనపుడు మీలితమునకుఁ బ్రతిద్వంద్వియగు నున్మీలితమగును. అట్లే సామాన్యాలంకారరీతిగ విశేషము స్ఫురింప నప్పుడొకానొక కారణముచే విజాతీయత స్ఫురింపగా సామాన్యప్రతిద్వంద్వి యగు విశేషక

మగును. క్రమముగ రెండుదాహరణములు చెప్పఁబడెను. తద్గుణరీతిచే భేదాధ్యవసాయము ప్రాప్తించినను నున్మీలితమగుచున్నది. ఎట్లన,

[2] నరసరాజా! నటించుచున్న శివుని యట్టహాస సదృశ మగు నీయశముచే నుల్లోకములు ధవళితములు కాఁగాఁ గీర్తిసదృశుఁడీకమలాకాముకుఁడు నాభీకమల గంధము నొందనియెడల దేవత లితని నెఱుంగ లేకపోదురు.

కాకి నలుపు కోయిలయు నలుపు. ఈరెంటికి భేదమేమి? వసంతకాలమురాఁగాఁ గాకము కాకమే. పికము పికమే.

ఇది విశేషకమున కుదాహరణము.

ఇచట ద్వితీయ కాక పికశబ్దములు కాకముగఁ దెలియఁబడినది, పికముగఁ దెలియఁబడినది యని యర్థాంతర సంక్రమిత వాచ్యములు. మఱియు,

కాశీపట్టణమందుండు వారికి శివలాంఛనములు తుల్యము లయ్యు పార్థుని దెబ్బ మచ్చగల శిర మీశునిఁ దెలుపు చున్నది.

## 83. ఉత్తరాలంకారము.

సాభిప్రాయము గూఢము నగు నుత్తర ముత్తరాలంకార మగును.

ఓ తెరువరీ! వేతసీకుంజ మున్నచోట నీనది సుఖముగ దాటనగును.

---

2. నృత్యద్భర్గాట్టహాస ప్రసనసహచరై స్తావకీ నైర్యశోభి ర్ధావళ్యంనీయమానే త్రిజగతి పరితః శ్రీనృసింహక్షితీంద్ర। నద్యగ్య ద్యేష నాభీకమల పరిమళ ప్రౌఢిమా సాదయిష్య ద్దేవానాం నాభవిష్యత్కథమపి కమలాకాముక స్యావబోధః॥

ఇది నదినిదాటుమార్గము నడుగువానిం గామించుదానియు త్తరము. వేతసీకుంజమున స్వేచ్ఛావిహారము సలుపవచ్చు నను నభిప్రాయముతోఁ గూడినది. మఱియు,

> తెరువరీ ! పాషాణ ప్రాయమగు నీగ్రామమున నేమియు నుండదు. పయోధరోన్నతిని జూచి యుండఁగోరిన నుండుము.

ఇది ఆ స్తరణాదికము నడుగు పాంథునిగూర్చి చెప్పినమాట. వలుద చనుఁగవఁగాంచి రమింపఁ గోరిన నుండుము మూఢజనమయమగు నీగ్రామమున నెవఁడైన నెఱుంగఁగలఁ డను భయ మేమియు లేదని భావము

ఇది కల్పితప్రశ్న మగు న త్తరమున కుదాహరణము. నిబద్ధప్రశ్నో త్తరమున కుదాహరణమెట్లన,

> ఆమెకుఁగుశలమా ? జీవించియున్నది. కుశలము నడుగు చున్నాను. జీవించియున్నదని చెప్పితిని. మరల నదే చెప్పుచున్నావు. ఊపిరితోనున్నదానిని మృతినొందిన దానిఁగా నెట్లు చెప్పను ?

ఈర్ష్యాహేతుక మాన ముడిగి పశ్చాత్తప్త యగునాయికసఖ రాఁగా నామెనుగూర్చి నాయికకుఁ గుశలమా ? యని నాయకునిప్రశ్న. జీవించి యున్నదని సఖ సమాధానము. జీవించి యున్నదానికిఁ గుశల మెట్లని దాని భావము. అడుగునదొకటి చెప్పున దొకటియని కుశలము నడుగుచుంటి నని తిరిగి నాయకుని ప్రశ్నము. అడిగినదానికే చెప్పితినను భావముతో జీవించియున్నదని చెప్పితినని సఖ వాక్యము. సఖవచన భావమును వెల్లడింపఁ జేయుటకు మరలదానినే చెప్పుచుంటి వని నాయ కుని యాక్షేపము. ఊపిరితో నున్నదానిని మృతినొందిన దానినిగా నెట్ల

చెప్ప నని సఖి తనభావమును వెల్లడించుచు, మరణించినగదా! యామెకుఁ గుశలమగును! నే వచ్చునపుడును నూర్పులు వచ్చుచుండ మరణించిన దని యెట్లు చెప్పఁగలనని యభిప్రాయము.

> ప్రశ్నోత్తర గర్భితమగు నుత్తరము చిత్ర మనఁబడును. ‘ కే, దారపోషణరతాః? ’ ఎవరు దారపోషణరతు లని ప్రశ్నము. కేదార పోషణరతులనియే సమాధానము. పరిపాలనమును బోషించుటలో నాసక్తులు ‘ కే, ఖేటాః? ’ ‘ కిం,చలం? ’ ఆకాశమున సంచరించునవేవి? చంచలముగున దేది? అని ప్రశ్నము. ‘వయః’ అని సమాధానము. వయః—పక్షులు, వయస్సు. ‘ ఎద్దీశ్వరుని వాహనము ’ వంటివి.

వే ఉదాహరణములు నేర్పరులవలన నెఱుంగదగినవి.

## 84. సూక్ష్మాలంకారము

> పరునిభావ మెఱింగిన యితరుని సాభిప్రాయ చేష్టితము సూక్ష్మ మనఁబడును. నేను ఆమెను జూచుచుండఁగా నామె కేశములతో సీమంతమణిని గప్పెను.

కాముకునిచూపుచే సంకేత మెప్పు డను ప్రశ్నాభిప్రాయమెఱింగిన నాయికచేష్ట యిది. సూర్యుఁ డస్తమించినపిమ్మట సంకేతకాల మను భావముకలది. మఱియు,

> విటుని సంకేతకాలమెఱుంగఁగోరువానిగాఁ దెలిసికొని విదగ్ధయగునాయిక తన లీలాకమలమును గన్నులందుంచుకొనునట్లుగా ముడిచివేసెను,

## 85 పిహితాలంకారము.

పరునిచరిత మెఱింగినవాని సాభిప్రాయచేష్టితము పిహిత మగును. ప్రభాతమునఁ బ్రియు డింటికి రాఁగాఁ గాంత తల్పమును గల్పించెను.

రాత్రి సవతియింట నిద్రలేక యలసితి వని తల్పమును గల్పించుటకు భావము. మఱియు,

[3] చెమట నీటితో మోమునుండి జారి కంఠము నందున్న కుంకుమరేఖను జూచి సఖి యొకచెలి తన్వీపుంభావమును బ్రకటించుచు నామెచేత ఖడ్గాకారమును వ్రాసెను.

ఇందు స్వేదముచే నూహింపఁబడిన పురుషాయితము పురుషునకుఁ దగిన ఖడ్గరేఖను వ్రాయుటచేఁ బ్రకటింపబడినది.

## 86 వ్యాజోక్తి

వేఱు కారణముఁజెప్పి యాకారమును గప్పిపుచ్చుట వ్యాజోక్తియగును.

సఖి ! చూడుము పెరటితోఁటలోని పరాగముచే ధూసర వర్ణము కలదాన నైతిని.

ఇచట చౌర్యసంభోగమున సంకేతభూమియందు పృష్ఠలుంఠనముచేఁ గలిగిన దుమ్మును దాచిపెట్టుట. మఱియు,

---

3. వక్త్రస్యంది స్వేదబిందు ప్రబంధైర్దృష్ట్వాభిన్నంకుంకుమం కాపికంఠే ।
పుంస్త్వం తన్వ్యావ్యంజయంతీ వయస్యాస్మిత్వాపాణౌ ఖడ్గరేఖాంలిలేఖ ॥

సూక్ష్మాలంకారమునఁ బరుని భావ మెఱింగి సాభిప్రాయ చేష్టితముచే నుత్తర మిచ్చుట, పిహితాలంకారమందు రహస్యమగు పరచరితము నెఱింగి సాభిప్రాయ చేష్టితముచే దానిని వెల్లడించుట యను భేదము నెఱుంగవలెను.

[4] గాయపడిన ప్రేయసియధరమును జూచిన నెవనికిఁగోపము
రాదు? నే నిప్పుడు వద్దనుచున్నను, తుమ్మెదతోఁగూడిన
పద్మము నాఘ్రాణించితివి.

జారునిచే దష్టాధరయగు నాయికదగ్గరకు వచ్చుచున్న ప్రియునిఁ జూడ నట్లు నటించు సఖచే నాయికకు హితోపదేశ వ్యాజముతో నాయకుని దగ్గర నాయిక తప్పును గప్పిపుచ్చుట.

ఛేకాపహ్నుతిలో వాక్యమునకు వేఱర్థముచెప్పి కప్పిపుచ్చుట, ఈ వ్యాజోక్తిలోఁ గారణాంతరమును జెప్పి యాకారమును గప్పిపుచ్చుట యని ఛేకాపహ్నుతికి నీవ్యాజోక్తికిని భేదము. లక్షణమున లక్ష్యానామమున నుక్తిపదగ్రహణము ఆకారగోపనమునకు హేత్వంతరమును దోఁగఁ జేయు క్రియా మాత్రమున కుపలక్షణము. మఱియు,

[5] వీధిలోనొక భాను వచ్చుచున్న హారినిఁజూచి సఖ యెదుట
రోమాంచ కంపాదులతోఁ దెలుపఁబడిన యనురాగము
నాహారికి నమస్కరించుచుఁ గప్పివేసెను.

అనుచోటను వ్యాజోక్తియే, ఇచట ననురాగ నిమిత్తమగు రోమాంచాద్యాకారమునకు భక్తి రూపకారణాంతరమును దోఁగఁజేయు ప్రణామముచే నాయాకారము కప్పిపుచ్చఁబడెను.

సూక్ష్మ పిహితాలంకారములలోఁగూడ చేష్టిత పదగ్రహణము ఉక్తి సాధారణమగు క్రియామాత్రమునకు నుపలక్షణము. అట్లనుటచే

4. కస్యవా నభవేద్రోషః ప్రియాయాస్సవ్రణేఽధరే।
సభృంగం పద్మమాఘ్రాసీర్వారితాపిమయాధునా॥
5. ఆయాంతమాలోక్య హరింప్రతోళ్యామూళ్యాః పురస్తాదనురాగమేకా।
రోమాంచ కంపాదిభి రుచ్యమానంభామాజుగూహ ప్రణవంత్యథైనమ్॥

> తామరాకునందు బెగ్గురుపక్షి మరకత పాత్రమున శుక్తి
> వలెఁ గనఁబడుచున్నది. అని నానంకేతస్థాన భావము
> నెఱింగిన నాయిక సఖితోననెను.

ఇత్యాదులందును సూక్ష్మాలంకార ముండును. మనకు సంకేతస్థానమే దని కాముకుడు ప్రశ్నాభిప్రాయమును సూచింపగా విదగ్ధయగు నాయికచే నప్పుడు సఖితో సాకూతముగఁ జెప్పఁబడినది కనుక పై వాక్యమున సూక్ష్మాలంకారముండును. ఇచట బెగ్గురుపక్షికి మరకతపాత్ర మందున్న శుక్తితో సాదృశ్యమున బలాకాంగనకు నిశ్చలస్థితి యెందు వలనఁ గలిగెనో దానిచే నాప్రదేశము జనశూన్యము కావున నదియే మనకు సంకేతస్థాన మని కాముకునకు సూచనమని యూహింపఁ బడుచున్నది.

దూరముగా నూహింపఁబడుచున్నను సంకేతస్థానప్రశ్న కుత్తరము స్వోక్తిచేతనే ప్రకటింపఁబడుటంబట్టి యిచట ధ్వని యని శంకింపరాదు. ఇట్లే పిహితాలంకారమందు నుదాహరింపఁ దగినది. ఇచట మఱొక్కటి గ్రహింపవలెను.

'తెరువరీ ! వేతసీకుంజ మున్నచోట' ఇత్యాదులగు గూఢోత్తర సూక్ష్మ పిహితవ్యాజోక్త్యుదాహరణము లందు భావము స్వోక్తిచే వెల్లడింపఁబడక వస్తుసౌందర్యబలమునను వక్తృబోద్ధవ్య విశేషాదుల వలనను గమ్యమగు నట్టిచోటనే ధ్వనికిస్థానమగుటంబట్టి వాస్తవముగ నలంకారత్వ ముండదు. ప్రాచీనులు స్వోక్త్యావిష్కరణ మున్నచో నలంకార ముండునని యుదాహరించుటచే మేమును నుదాహరించితిమి.

> తెరువరీ ! వేతసీకుంజ మున్నచోట నది సుఖముగ దాట
> నగునని దారి నడుగువానికి కామిని సాభిప్రాయముతోఁ
> జెప్పెను.

అని యర్థాంతరమును గల్పించిన భావప్రకటనము శక్యమగునుగదా !

కావున "ఇటుని సంకేతకాలమెఱుఁగఁ గోరువానిగా," "తన్వి పుంభావమును బ్రకటించుచు" "వీధిలో నొకభామ......కప్పివేసెను" ఇత్యాదులగు నే పూర్వోక్తోదాహరణములందు భావప్రకటన ముండునో వానియందే ఆయా యలంకారము లుండును.

## 87 గూఢోక్తి

ఒకని నుద్దేశించి మఱొకనితోఁ జెప్పుట గూఢోక్తి యగును.

వృషభమా! పరక్షేత్రమునుండి తప్పుకొనుము క్షేత్రపతి వచ్చుచున్నాఁడు.

ఒకని గూర్చి చెప్పవలసిన దాని నితరు లెఱుంగకుండ మఱొకనితో శ్లేషగాఁ జెప్పినచో నది గూఢోక్తి.

'వృషభమ!' ఇత్యాది ఉదాహరణము. ఇచట పరకళత్రముతో రమించు కాముకునితోఁ జెప్పఁదగిన దానిని సమీపమునఁ బరునిక్షేత్రమున సస్యములందినుచున్న వృషభమును గూర్చి చెప్పుచున్నాఁడు

కార్యకారణాదులందు వ్యంగ్యము లేకపోవుటంబట్టి యిది యప్రస్తుత ప్రశంస యనరాదు. అప్రకృతార్థము ప్రకృతార్థాన్వయిగా వివక్షింపఁ బడకపోవుటంబట్టి శ్లేషమాత్రము కూడకాదు. ఆ యప్రకృతార్థ మితర వంచనమునకు మాత్రమే చెప్పఁబడుటచే విచ్ఛిత్తి విశేష ముండుటవలన వేఱలంకారమే యగును. మఱియు,

6 భర్త బజారునకేఁగెను. ఈసవతియు నన్ను జూడదు. రజస్వల నని యత్తమామ లంతర్గృహమున కేఁగిరి. పరిజన

6. నాథో మే విపణిం గతో న గణయత్యేషా సపత్నీ చ మాం
త్యక్త్వా మామిహ పుష్పిణీతి గురవః ప్రాప్తా గృహాభ్యంతరమ్ ।
శయ్యామాత్రసహాయినీం పరిజనః క్లాంతో న మాం సేవతే
స్వామిన్నాగమలాలసీయ రజనీం క్షేత్రపతే రక్షమామ్ ॥

మలసి వెళ్లి పోయెను. శయ్యామాత్రము సహాయ మున్నది.
స్వామి! లక్ష్మీపతీ! ఆగమలాలనీయ నన్ను రక్షింపుము,

ఇచట లక్ష్మీపతియను జారునిరాకను గోరు జారిణి తటస్థుల వంచనకై భగవంతుని గూర్చిన యాక్రోశమును దోఁగఁ జేయుట.

## 88 వివృతోక్తి

శ్లేషచే గుప్తమగు దానిని కవి ప్రకటించినచో వివృతోక్తి యగును. వృషభమా! పరక్షేత్రమునుండి తొలఁగుమని సాభిప్రాయముగఁ జెప్పుచున్నాఁడు.

శ్లేషచే గుప్తమగు వస్తువు నెట్లో కవి వివరించినచో వివృతోక్తి. 'వృషభమ!'ఇత్యాద్యుదాహరణమునఁ బూర్వమువలె గుప్తమగు వస్తువును సాభిప్రాయముగ నని కవి ప్రకటించెను. మఱియు,

బిడ్డా! విషాద గామినివి కాకుము ఊర్ధ్వప్రవృత్త శ్వాసానుగమనమును వీడుము. నీకీగురుకంపభజనమేల ?
బలభేది (జృంభితము) చేనేమి? యీతని యొద్ద (శ్రీహరి సన్నిధి) కేఁగుమని భయము పోఁగొట్టుమిషచే సురల విడిపించి, పయోధి మంథముగ్ధయగులక్ష్మి నెవనికోఁసగె నాహరి మీపాపమును బరిహరించుఁగాక.

ఇది పరవంచనకు గుప్తమగు దానిని ప్రకటించుట.
లజ్జచే గుప్తమగు దానినావిష్కరించుట యెట్లన?

---

7. వత్సేమాగావిషాదం శ్వసనమురుజవం సంత్యజోర్ధ్వప్రవృత్తం
కంపః కోవాగురుస్తేకి మిహబలభిదాజృంభితే నాత్రయాహి ।
ప్రత్యాఖ్యానం సురాణామితిభయశమనచ్ఛద్మనాకారయిత్వా
యస్మైలక్ష్మీమదాద్వస్సదహతు దురితం మంథముగ్ధాంపయోధిః ॥

[8] కేశవ! గోపరాగహృతమగు దృష్టిచే నాకేమియుఁగనఁబడుట లేదు. అందుచే నిచట స్ఖలిత నైతిని. నాథ! పతితకేల చేయూత నొసఁగవు? విషమ(బాణ) ఖిన్నమనస్కలగు సర్వాబలలకు నీవొకఁడవే గతియని గోష్ఠమున గోపికచే సాభిప్రాయముగఁ బ్రార్థింపఁబడుచున్న హరి మిమ్ములను రక్షించుగాక.

ఇందు కృష్ణుని ముందర విషమములో స్ఖలనమును జెప్పుచు నతనిఁ గామించు గోపిక వాక్యమందు విషమమార్గమున స్ఖలన పతనములనుండి రక్షణప్రార్థనారూపము, శీఘ్రముగఁ దోచునదియు నగునర్థముచే గుప్తమగు వివక్షితార్థము సాభిప్రాయ మనుదానిచే వివరింపఁబడినది. ఇట్లే నైషధాది కావ్యములందు.

[9] "నాచిత్తము లంకను గోరుట లేదు. నలుని గోరుచున్నది. వేఱుచోట నెచ్చటను నభిలాషతో గూడినది కాదు."

అను దమయంతీ వాక్యాదికముకూడ నుదాహరణ మగును. ఇది శబ్దశక్తి మూలముగ గుప్తమగు దానినావిష్కరించుట.

అర్థశక్తిమూలముగ గుప్తమగుదాని నావిష్కరించుటెట్లన?

[10] ఓయొదనచ్యుతా! నీదర్శనమాత్రముచేనేమి తృప్తికలుగును? ఇంతియకాక విజనస్థలమందున్న మనల నీపాడు లోకము వేఱుగాఁ దలంచును. అచ్యుత! యనిపిలుచు

---

8. దృష్ట్యా కేశవ గోపరాగహృతయా కించిన్న దృష్టం మయా
తేనేహ స్ఖలితాస్మి నాథ పతితాం కిం నామ నాలంబసే।
ఏకస్త్వం విషమేషు ఖిన్నమనసాం సర్వాబలానాం గతి
ర్గోప్యైవం గదితస్సలేశమవతాద్గోష్ఠే హరిర్వశ్చిరమ్॥

9. చేతో నలం కామయతే మదీయం।
నాన్యత్ర కుత్రాపి చ సాభిలాషమ్॥

రీతిచే సూచింపఁబడిన వృథాస్థితి ఖేదముచే నలసయగు గోపి నాలింగనము చేసికొనుచు పులకాంచితతనువగు హరి మనలరక్షించుగాక.

ఇచట నచ్యుత! యను నామంత్రణముచే నీతో రమించుట కింత కాలముంటిని. అది లభింపలేదు. అని అర్థశక్తిచే లభించిన వస్తువు విలుచురీతిచే నిత్యాదివాక్యముచే నావిష్కరింపఁబడినది. ఇందతయు కవి నిబద్ధవక్తృ గుప్తావిష్కరణమున కుదాహరణము. కవి గుప్తావిష్కరణ మెట్లన

11 సుభ్రూ! నీవు కుపితవగుటచే భోజనము విడిచితిని. స్త్రీ ప్రసంగముల విడనాడితిని. గంధమాల్యాదికము లసలే లేవు. రాగిని నమ్రుఁడ నగు నామీఁద గోపమును వీడుము. దృష్టిప్రసాదింపుము. నిక్కము. నీవులేక పోవుటచే నాకు సర్వము లే నట్లున్నది.

ఇచట మానకలుషితను బ్రసన్నను గాఁ జేసికొనుపని తోచుచున్నది. దృష్టిరోగార్తుఁడు దృష్టినిగూర్చి యాక్రోశించుట వివక్షితార్థము. అది 'దృష్టి' యను పదమును ప్లుత స్వరముతో నుచ్చరించి సంబోధనము చేసికొనుటచే నావిష్కరింపఁ బడినది. కవినిబద్ధవక్తృగుప్తము పరవంచనమునకు, కవిగుప్తము ప్రౌఢముగఁ జెప్పుటకు, నని భేదము.

---

10. గచ్ఛామ్యచ్యుత ! దర్శనేన భవతః కిం తృప్తిరుత్పద్యతే
కిం చైవం విజనస్థయోర్హతజనస్సంభావయత్యన్యథా
ఇత్యామంత్రణభంగిసూచిత వృథావస్థానఖేదాలసా
మాశ్లిష్యన్ పులకోత్కరాంచితతనుర్గోపీంహరిః పాతువః ।

అచ్యుత—నాయందు చలింపనివాఁడా ! అని గోపి భావము

11. సుభ్రు ! త్వం కుపితేత్యపాస్తమశనంత్యక్తాః కథా యోషితాం
దూరాదేవవివర్జితాస్సురభయస్స్రగ్గంధధూపాదయః ।
కోపం రాగిణి ముంచమయ్యవనతే దృష్టేప్రసీదాధునా
సత్యంత్వద్విరహాద్భవంతిదయితే సర్వామమాంధాదిశః ॥

## 89 యుక్త్యలంకారము.

రహస్యమును దాచుటకుఁ గ్రియచేఁ బరుని వంచించుట యుక్తి యగును.

నిన్ను వ్రాయుచు నితరునిఁజూచి చేతి యందుఁ బూవిం టిని లిఖించెను.

ఇచట పూవింటిని వ్రాయుటచే మన్మథుఁడు నాచే వ్రాయఁ బడెనను భ్రాంతిని గలిగించి స్వానురాగరూప మర్మగోపనమునకై పరవంచనము వివక్షింపఁబడినది. ఇది నాయకునికి దూతి చెప్పినమాట మఱియు,

[12] పెంపుడు చిలుక రాత్రి దంపతుల స్వేచ్ఛా సంభాషణ మును విని యుదయమున నత్తమామలు వినునట్లామాట లనుచుండఁ గోడలు సిగ్గుపడి చెవియందలి పద్మరాగపు తునుకను దాడిమబీజ మనుమిషతోఁ జిలుకముక్కు నందుంచి వాగ్బంధన మొనరించుచున్నది.

ఇచట శుక వాగ్బంధముద్వారా తన రహస్యమును విను నత్తమామల వంచించెను. వ్యాజోక్తిలో నాకారగోపనము నిచట భావగోపనము నని భేదము లేదా! వ్యాజోక్తిలో నుక్తిచే గోపనము యుక్తిలోఁ గ్రియచే గోపనము నని భేదము ఇట్లనుటచే 'వీథిలో వచ్చుచున్న హరిని జూచి' యనుచోటను యుక్త్యలంకారమే యగును.

## 90 లోకోక్తి

లోకప్రవాదము ననుకరించుట లోకోక్తి యగును.

---

12. దంపత్యోర్నిశిజల్పతోర్గృహశుకేనాకర్ణితంయద్వచ
స్తత్ప్రాతర్గురుసన్నిధౌ నిగదత స్తస్యాతిమాత్రంవధూః ।
కర్ణాలంబితపద్మరాగశకలంవిన్యస్యచంచూపుటే
వ్రీడార్తావిదధాతి దాడిమఫలవ్యాజేనవాగ్బంధనమ్ ॥

'కన్నులు మూసికొని' కొన్ని మాసములు గడుపుము

ఇచట 'కన్నులుమూసికొని' యనునది లోక ప్రవా దానుకరణము. మఱియు, అప్పయ్యదీక్షితుని వరదరాజ స్తవమున,

> ఓవరద ! నీపేరే కోరినదాని నిచ్చువాఁ డనుభావమును జెప్పుచున్నది. కనుకనే నీవు వరదాన ముద్రను వహింప లేదు. జగమెఱిఁగిన బాపనికి జందెమేల ?

ఇచట నుత్తర వాక్యము లోకవా దాను కరణము.

## 91 ఛేకోక్తి.

> లోకోక్తి యర్థాంతర గర్భితమైనచో ఛేకోక్తి యగును.
> భుజంగిపాదములు భుజంగమునకే తెలియును.

ఒకఁడొకని సంగతి యడుగ నడిగినవానికి దగ్గరనున్న మఱొకనిఁ జూపి యితఁడే వానిసంగతి నెఱుఁగునని తెల్పునదీ (పాముపాదములు పామునకే తెలియును) లోక వాదాను కరణము. ఇచట వీరిద్దఱు ధనసంపాదనాది వ్యాపారమున సహచారులని లోకవిదితమగుటచే లోకోక్త్యను వాదమునకుఁ బ్రయోజనముండగా రహస్యమగు విటవ్యాపార మందును వాని కితఁడు సహచరుఁడను మర్మోద్ఘాటన మందు గర్భితమై యున్నది. మఱియు,

> మలయమారుతము లేఁగినవి. వికసిత మల్లికా పరిమళ భరిత మగు గ్రీష్మము గడచినది. ఘనుఁడా ! నీవు స్నేహ శూన్యుఁడగు నాతని నాచెలికిఁ గూర్ప నుత్సహించినఁ గూర్పుము. మాకేమి కొదువ ? గోవుల మరలింపఁగల వాఁడే ధనంజయుఁడు.

ఇచట ధనాశచే బ్రోషితుఁడగువాని భార్యయొక్క చెలి చెప్పిన మాట యందీయాంధ్రజాతి ప్రసిద్ధలోకవాదానుకార మున్నది. సౌందర్యవతి యగునాచెలిని వీడి ధనాశచే నేఁగినవాఁ డరసికుఁ డగుటచే గోప్రాయుఁడే. ధనరక్తుని ధనవిరక్తునిగాఁ జేయుట కతఁడే సమర్థుఁ డగుటవలన వానిని మల్లించువాఁడు, ధనమును జయించినవాఁడే యను నర్థాంతరము గూడ నందు గర్భితమై యున్నది

## 92. వక్రోక్తి

శ్లేషచేఁగాని కాకువుచేఁగాని వే ఱర్థమును గల్పించుట వక్రోక్తి యగును.

మానమును వీడుము ఉదయమగుచున్నది. (ముంచ మానందినం ప్రాప్తం) దొరకిన నందిని వీడకు. ఇచట నందిలేదు. హారునిదగ్గరనున్నది.

అను నీ మూలమునకు "దొరికిన నందిని వీడకు" అని శ్లేషచే వే ఱర్థమును గల్పించి హారునిదగ్గరకాని యిచట నందిలేదని సమాధానము చెప్పెను. మఱియు,

నీ కీదారుణ మగు బుద్ధి నెవరు గఱపిరి ? దీనిమూలమునకు (అహో కేనేదృశీబుద్ధి ర్దారుణాతవ నిర్మితా) నీ బుద్ధియే కఱ్ఱతోఁ జేయఁబడిన దను వేఱర్థమును శ్లేషచేఁ గల్పించి బుద్ధి త్రిగుణాత్మకమై యున్నదికాని యెచ్చటను దారు మయముగలేదు. అని సమాధానము చెప్పెను.

ఇది యవికృతశ్లేష వక్రోక్తి కుదాహరణము.

వికృతశ్లేష వక్రోక్తి కెట్లన,

[13] సుదతీ ! యిప్పుడు త్రిదశవదన గ్లాని కాఁగలదు. సీరా

13. భవిత్రీరంభోరుత్రిదశవదనగ్లానిరధునా
సతేరామస్స్థాతానయుధి పురతో లక్ష్మణసఖః ।
ఇయంయాస్యత్యుచ్చైర్విపద మధునావానరచమూ
ర్లఘిష్ఠేదంషష్ఠాక్షరపరవిలోపాత్పఠకృతః ॥

మూఁడు చివ్వ నస్థిరుఁడై లక్ష్మణసఖుఁ డున్నాఁడు.
కపిదళ ముచ్చ విపదము నిప్పుడొందఁగలదు. ఓ
యల్పుఁడా! ఈ వాక్యత్రయము నాలుగ్నోకటవ యక్ష
రము లేకుండ చదువుకొనుము.

ఇదంతయు శబ్దశ్లేషమూలమున వక్రోక్తి కుదాహరణము. ఇందు పై మూఁడువాక్యములు రావణుఁడు సీతతోఁజెప్పినవి. నాలవవాక్యము రావణునితో సీతచెప్పినది.

అర్థశ్లేషమూల వక్రోక్తి యెట్లన,

[14] అభిక్షుకుఁడెక్కడ? బలిచక్రవర్తి యాగమున నున్నాఁడు.
కల్యాణీ! ఇప్పుడు తాండవ మెక్కడ? బృందావన మధ్య
మున ననుకొందును. మృగశిశు వెక్కడ? పందిపిల్ల నెవరె
ఱుంగుదురు? మసిలెద్దును జూడలేద? దానిని గోపుఁడె
ఱుంగును. ఇట్లు రమాపార్వతుల లీలాసల్లాపము
మనలఁ గాపాడుగాక.

ఇందు శివునిగూర్చి ప్రశ్న ము విష్ణునిఁగూర్చి సమాధానము కాకువెట్లన,

విచారింపక నీకీ కోపము తగదు. అని బోధింపఁబడినదై
తగదూ? అని యాతనిని మాలతోఁ గొట్టెను.

ఇచట తగదూ! అను కాకుస్వరముచేఁ దగినదే యను నర్థాంతరమును గల్పించుట.

---

14. భిక్షార్థీసక్వయాతస్సుతనుబలిమఖే తాండవంక్వాద్యభద్రే
మన్యేబృందావనాంతే క్వనుసమృగశిశుర్నైవజానే వరాహః।
బాలే కచ్చిన్న దృష్టోజరఠవృషపతిర్గోపఏవాస్య వేత్తా
లీలాసల్లాప ఇత్థం జలనిధి హిమవత్కన్యయోస్త్రాయతాంనః॥

## 93. స్వభావోక్తి

జాతిక్రియాదుల స్వభావమును వర్ణించుట స్వభావోక్తి. చలించుకన్నులు, నిక్కువీనులు, కల కురంగములచేఁ జూడఁ బడుచున్నది. మఱియు,

15 గురువులదగ్గర నావధూవరు లెదురు కాఁగా నొకరొకరికి దారినిచ్చు తొందరలో మాటి మాటికి నా యిద్దఱు నొకదిక్కునకే తలవంపుతోఁ మఱలుచు దప్పుకొనిరి.

(పూర్వోదాహరణమున కురంగజాతి స్వభావవర్ణనము, నిందు సత్వర సలజ్జ క్రియాస్వభావ వర్ణనము ననిభేదము)

## 94. భావికాలంకారము

భూతభవిష్యత్కార్యముల నవ్వుడు ప్రత్యక్షముగ జరుగుచున్నట్లు వర్ణించుట భావికము. దేవదానవు లిప్పుడును నిచట యుద్ధముచేయుచున్నట్లు నాకుఁగనఁబడుచున్నది.

ఇది స్థానము భయంకరముగ నున్నదనుటను దెలుపును.

16 స్తనతటమునుండి జారిన పైటను ధరింపఁ బోవుయువతి

15. తాసంముఖం ప్రచలితా పథి గురూణాం
మార్గప్రదానరభసస్ఖలితావధానా ।
ప్రాగ్వ్యేవ సర్వ్యణముఖావపిభిన్నదిక్కం
కృత్వామహానుకృతానుపాసరతాం సలజ్జః ॥

16. అద్యాపితిష్ఠతిదృశోరిదమత్తరీయం
ధర్తుంపురస్తనతటాత్పతితంప్రవృత్తే ।
వాచంనిశమ్యనయనం నయనంమమేతి
కించిత్తదా యదకరోత్స్మితమాయతాక్షీ ॥

నేత్రము నేత్రమను నామాటను వినినప్పుడు నవ్విన చిఱు
నగ విప్పుడును నాకన్నులకుఁ గట్టిన ట్లున్నది.

## 95. ఉదాత్తాలంకారము

సమృద్ధిని వర్ణించుటగాని ఇతరమున కంగమగు శ్లాఘ్య
చరిత్రను వర్ణించుటకాని ఉదాత్తాలంకారము.

ఏకొండ చరియయందు ధూర్జటి కిరీటులకు యుద్ధము
జరిగెనో. ఆకొండ యిది.

శ్లాఘ్య చరిత మితరమున కంగ మగుటలో నిది యుదాహరణము. ఋద్ధికుదాహరణ మెట్లన,

[17] ఆవిదర్భానగరమున చెట్లకుదుళ్లు చంద్రకాంతమణులతోఁ గట్టఁబడినవి కాఁబట్టి చంద్రకిరణములు తగులగనే కరిగిన నీళ్లతోనిండి జలసేకమక్కరలేని దమయంతీవన మా హంస నాకర్షించెను.

రతనపు కంబములందలివేలకొలంది ప్రతిబింబములతోఁ గూడిన రావణుని హనుమంతుఁ డతికష్టమున నెఱింగెను.

---

16. ఏకాంతమందున్న యొకానొక నాయిక చనుగవనుండి జారిన పైట నెఱుంగక స్వేచ్ఛగనుండి, హఠాత్తుగవచ్చిన నాయకునింగాంచి సిగ్గుతో పైట సర్దుకొను చుండెను. అంతలో కుచమండలముం జూచు నాయకుఁ డతిత్వరగ నాదరాతిశయముతో రెండుమారులుచ్చరించిన "నీ పైటలో నలనున్న నాకన్నును విడుమని చెప్పనారంభించి, నేత్రము నేత్రమన్న" సగముమాటను విని యాతురంగాక్షి మందహాస మొనరించెను.

17. విధుకరపరిరంభాదాత్త నిష్యందపూర్ణైః
శశిదృషదుపక్లృప్తైరాలవాలైస్తరూణామ్ ।
విఫలితజలసేకప్రక్రియాగౌరవేణ
వ్యరచి స హృతచిత్తస్తత్ర భైమీవనేన ॥

## 96. అత్యుక్తి

అద్భుతానత్యములగు శౌర్యౌదార్యాదుల వర్ణించుట అత్యుక్తి.

రాజేంద్ర ! నీవు దాతవు కాగా యాచకులు కల్పవృక్షము కలవారైరి.

ఇది యౌదార్యాత్యుక్తి. శౌర్యాత్యుక్తి యెట్లన,

నృప ! సప్తసముద్రములు నీప్రతాపాగ్నిచే నింకింపఁ బడినను నీవైరి వనితల బాష్పపూరముచేఁ దిరిగి నింపఁబడినవి.

సంప దత్యుక్తి యుదాత్తమనియు శౌర్యాత్యుక్తి అత్యుక్తి యనియుఁ గొందఱందురు సత్యవిషయికమైనచో నుదాత్తమనియు నసత్యవిషయకమైన నత్యుక్తియునని దీక్షితులవారందురు.

శోభనాంగీ ! వర్ధమానంబులగు నీ స్తనముల కీబాహు లతా మధ్యమునఁ జోటు చాలదు.

నీ స్తనజృంభణ మిట్లగునని యాలోచింపక వేధ యల్ప మగు నవకాశమును నిర్మించెను.

అను అసదుక్తి అత్యంతాసదుక్తి తారతమ్యమే యతిశయోక్తి యత్యుక్తులకు భేదము. రెంటిలో మొదటి దతిశయోక్తి రెండవది యత్యుక్తి.

## 97. నిరుక్తి

వ్యుత్పత్తివలన నామములకు వేఱర్థము కల్పించుట నిరుక్తి.

ఇట్టి చరితములచే నీవు నిజముగ దోషాకరుఁడ వని తెలిసి కొనుచున్నాను. మఱియు,

పూర్వము కవులను లెక్కించునపుడు కనిష్ఠిక అధిష్ఠిత కాళిదాస యయ్యెను. ఇప్పటికి నాతనికి సరికవి లేక పోవుటచే అనామిక యర్థవతి యయ్యెను.

## 98. ప్రతిషేధాలంకారము

ప్రసిద్ధమగు నిషేధమును జెప్పుట ప్రతిషేధము.

జూదరి! ఇది వాడితూపుల నాడుటకాని జూదము కాదు.

బాగుగఁ దెలిసిన నిషేధము సహజముగ ననుపయుక్తమై యర్థాంతరము తోఁగఁజేయును. అందుచే నీ ప్రతిషేధాలంకారము చమత్కార జనకము. ఉదాహరణము రణరంగమున నున్న శకునింగూర్చి నేర్పరి నకులుఁడు చెప్పిన మాట. ఆ వాక్యమందు యుద్ధ మక్షద్యూతము కామి తెలిసినను జెప్పఁబడి యందే నీకు నైపుణ్యముకాని యుద్ధమందేమియుఁ దెలివి లేదను పరిహాసమును దెలుపుచున్నది. అదియు జూదరీ! యని సంబోధించుటచేఁ బ్రకటింపఁబడినది. మఱియు,

> విషముతోఁ గాని, శస్త్రములతోఁ గాని, యగ్నితోఁ గాని, స్త్రీలుచేయఁబడలేదు. అప్రతీకార పారుష్యాలు స్త్రీలు స్త్రీలతోఁ జేయఁబడిరి.

ఇచట స్త్రీలు విషాది నిర్మితలు కాకుండుట ప్రసిద్ధమే యయ్యుఁజెప్పుటచే స్త్రీలకు విషాదులమించిన క్రౌర్యమున్నదను నర్థము స్పష్టమగుచున్నది. అదియుఁ బ్రతీకారముకల విషాదులకంటె వారి కాధిక్యమును జూపు నప్రతీకార పారుష్య లనువిశేషణముచే వెల్లడింపఁబడినది.

## 99 విధ్యలంకారము

సిద్ధమగుదానిని విధించిన విధ్యలంకారమగును.

> పంచమస్వరము నావిష్కరించు కాలమునఁ గోకిలము కోకిల మగును.

బాగుగఁ దెలిసినదానిని విధించు టుపయోగము లేక బాధితమై

యర్థాంతరమును స్ఫురింపఁ జేయుటచే నతిసుందరము కావున దానిని విధ్యలంకార మందురు. ఉదాహరణమున కోకిలమును గోకిల మను టుపయోగము లేనిదై యతి మధురమగు పంచమధ్వనితోఁ గూడుటచే సకలజన హృద్యత్వమును దెలుపుచున్నది. అదియు 'పంచమస్వరము నావిష్కరించు' అను కాలవిశేషణముచేఁ బ్రకటింపఁబడినది. మఱియు,

[18] ఓ దక్షిణహస్తమా! మృతుఁడగు ద్విజబాలకుఁడు జీవించుటకై శూద్ర మునిని ఖడ్గమున నేయుము. నిండు చూలాలు సీత నడవి కంపఁగలిగిన రామునియొక్క శరీర మైతివే! నీకుఁగరుణ యేమి?

ఇచట రాముఁడు తనహస్తమును గూర్చి రామునియొక్క శరీర మైతివే యను వచన మనుపయుక్తమై రామునియొక్క అనుటచే తన కత్యంతము కరుణ లేమి తెలియుచున్నది. అదియు నిండు చూలాలు ఇత్యాది విశేషణముచేఁ బ్రకటింపఁబడినది.

యద్యపి యీవిధినిషేధోదాహరణములం దున్న వ్యంగ్యము లర్థాంతర సంక్రమిత వాచ్యరూపము లయ్యును నవి కవిచేతనే వ్యంగ్య విశేషము ప్రకటింపఁబడుటంబట్టి ధ్వనిప్రయోజకములు కావు. వ్యంగ్యమును వెల్లడించినచో నలంకారమేయని పూర్వము ప్రస్తుతాంకుర ప్రకరణముననే నిరూపితము కదా! అక్షేపాలంకార ప్రకరణమున బాధితములగు ('నేను దూతినికాను' 'కాంత! నీవేగు మేగినచో' నిత్యాది) విధిప్రతిషేధము లాక్షేపాలంకారములుగఁ జెప్పఁబడినవి. ఇచట నన్నచో

18. రే హస్త దక్షిణ మృతస్యశిశోర్ద్విజస్య
జీవాతవేవిసృజ శూద్రమునౌ కృపాణమ్।
రామస్యగాత్రమసినిర్భరగర్భఖిన్న
సీతావివాసనపటోః కరుణాకుత స్తే॥

ప్రసిద్ధములగు విధిప్రతిషేధములు బాధితమునకు ప్రతిద్వంద్వులగు విధి ప్రతిషేధాలంకారములుగ వర్ణింపఁబడినవి.

## 100. హేత్వలంకారము

కార్యముతోఁగూడ కారణమును వర్ణించుట హేత్వలంకారమగును. యువతుల యీర్ష్యామానము నపనయింప నిదిగో చంద్రుఁ డుదయించుచున్నాఁడు. మఱియు,

19 తన్వీ! నీయధరము విద్రుమచ్ఛాయ మగుచు మరుమార్గమువలె నెవని మనమును దప్పిఁగొన్నదానినిగాఁ జేయదు! మఱియు,

20 మాన మిష్టపడకున్నను శాంతి వారించుచున్నను సిగ్గు నేలను వ్రాయుచున్నను స్వాతంత్ర్యము పెడమొగము పెట్టినను ధైర్యము చేతులు విదుపుకొని పోయినను ఓ యాశాపిశాచమా! నిన్ననుసరించిన నాకింతగతి పట్టినది. కాలిచేతను నంటరానివాని పాదములంటఁ బోయినను వా డంగీకరించుటలేదు.

(ఇచట నాశారూపకారణము దాని కార్యమగు మాననాశాదికము స్పష్టము)

కార్యకారణముల కైక్యముచెప్పుటకూడ హేతువుగఁ జెప్పుచున్నారు. వేంకటేశుని కటాక్షములు విద్వాంసులకు లక్ష్మీవిలాసములు.

---

19. ఏష తే విద్రుమచ్ఛాయో మరుమార్గ ఇవాధరః।
కస్య నో తనుతే తన్వి పిపాసాకులితం మనః॥

20. మానే నేచ్ఛతి వారయత్యుపశమే క్ష్మామాలిఖంత్యాం హ్రియాం
స్వాతంత్ర్యే పరివృత్య తిష్ఠతి కరౌ వ్యాధూయ ధైర్యే గతే।
తృష్ణే త్వామనుబధ్నతా ఫలమియత్ప్రాప్తం జనేనామునా
యః స్పృష్టో న పదా స ఏవ చరణౌ స్ప్రష్టుం న సంమన్యతే॥

ఇచట కార్యకారణముల కభేదకథనము కార్య మవశ్యము నగుటను శీఘ్రముగ నగుటను దెలుపుటకే. రూపకమున సాదృశ్యముచే నభేదముఁ జెప్పుట, యిచట కార్యకారణభావముచే నభేదకథనము నని భేదము.

[21] దానమున కాయువు, అణగిమణగి యుండు రాజుల
కాకారము దాల్చిన విశ్వాసము, కాంతలకుఁ గన్నుల
పండువు, కీర్తి కుత్కృష్టప్రకాశము, విబుధుల కానంద
రూపము, వీరలక్ష్మికి జీవితము, ధర్మమున కిల్లు నగు
నీ వీరకళింగుఁడు విజయము నొందుఁగాక.

ఇచట దానాదుల కాయురాదికారకుఁడగు రాజు నాయురాదికముగఁ జెప్పుట.

ఇట్లు ప్రాచీన నవీనమతముల నన్నివిధముల నాలోచించి నూఱలంకారములకు లక్షణములం జెప్పి యుదాహరించితిమి.

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః.

శ్రీ గురుత్రయ కరుణాకటాక్షలబ్ధ న్యాయ సాహిత్య వ్యాకరణ విద్యా
వినీత ఉభయభాషాప్రవీణ, గోదావరీ మండలాంతర్గత వైనతేయ
నదీతీర దొడ్డవరవాసి, సాహిత్యాచార్య కంబముపాట్యన్వయ
శ్రీసూర్యనారాయణశాస్త్రి వేంకమాంబాప్రియతనూజ
సుబ్రహ్మణ్యశాస్త్రి విరచితాంధ్ర కువలయానందము
శతాలంకారము సంపూర్ణము.

  

---

21. ఆయుర్దానమహోత్సవస్య వినతక్షోణీభృతాంమూర్తిమా
న్విశ్వాసోనయనోత్సవోమృగదృశాంకీర్తేః ప్రకాశః పరః।
ఆనందః కవితాకృతి స్సుమనసాం వీరశ్రియా జీవితం
ధర్మస్యైష నికేతనం విజయతే వీరః కళింగేశ్వరః॥

# రసవదలంకార ప్రకరణము.

రస, భావ, రసాభాస భావాభాస, భావశాంతులతోఁ గూర్పఁబడిన రసవత్, ప్రేయ, ఊర్జస్విత్, సమాహితము లను నాలు గలంకారములును భావోదయము, భావ సంధి, భావశబలత యను మూఁడలంకారములును ప్రత్యక్షానుమానోపమాన శబ్దార్థాపత్త్యనుపలబ్ధి సంభవైతిహ్యము లను నష్టప్రమాణాలంకారములును ఇట్లే పదియేను నలంకారములుగా వాడఁబడు చున్నవి.

అందు విభావానుభావ వ్యభిచారులచే నభివ్యక్తము రతిహాస శోకాదిరూప మగు చిత్తవృత్తివిశేషము రసము. ఆ రస మితరమున కంగముగా నున్నచోట రసవదలంకార ముండును. విభావానుభావ ములచే నభివ్యక్తము గు నిర్వేదాదిత్రయస్త్రింశద్భేదములున్ను దేవతా గురుశిష్య ద్విజపుత్రాది యందభివ్యక్త మగురతియు భావము. ఆ భావ మితరమున కంగమగుచోటఁ బ్రేయోఽలంకార ముండును. అనుచితముగఁ బ్రవృత్త మగు రసము, భావము రసాభాసము, భావాభాసము నని చెప్పఁబడును. ఆ రసాభాస భావాభాసము లితరమున కంగమైనచోట నూర్జస్వి దలంకారము. భావముయొక్క శాంతావస్థ భావశాంతి. భావశాంతి యితరమున కంగమైనచో సమాహితాలంకారము. భావము పుట్టినస్థితి భావోదయము. విరుద్ధములగు రెండుభావములకుఁ బరస్పర విరోధము లేమి భావసంధి. అనేక భావములు పూర్వ పూర్వోప మర్దముచే నుత్పన్నమగుట భావశబలత. ఇవి యితరమున కంగము లగుచో భావోదయ భావసంధి భావ శబలతాలంకారములు మూఁడు నగును. అందు రసవదలంకారమున కుదాహరణము.

ఏ ముని యొక్కమూ తాచమింప నా దేవతాస్వరూపము
లగు మత్స్యకచ్ఛపము లగపడెనో! ఆ యగస్త్య మునీం
ద్రుఁడు విజయము నొందుచున్నాఁడు.

ఇచట ముని విషయక రతిభావమున కద్భుతరస మంగము.

( భూరిశ్రవుని ఛిన్నహస్తమును జూచి వాని భార్యలు చెప్పు వాక్యమిది ). మఱియు,

[22] ఆ యీకరము ఒడ్డాణమును తీయునది, పీనస్తనముల మర్దించునది. నాభిని ఊరువులను జఘనమును స్పృశించుచు నీవిని విప్పుచుండెడిది.

ఇచట కరుణరసమునకు శృంగార రస మంగము.

ప్రేయోఽలంకారమే భావాలంకార మనఁబడును. అది యెట్లు?

[23] కాశిలో గంగాతీరమున నుండి కౌపీనధారినై శిరసా నమస్కరించుచు నోయి! గౌరీనాథా! త్రిపురహర! శంభో! త్రినయన! అనుగ్రహింపు మని యాక్రోశించుచు నిమిషమువలె దినముల నెప్పుడు గడపుదునో కదా!

ఇచట శాంతరసమున కెప్పుడను పదముచే సూచింపఁబడిన, చింతయను వ్యభిచారీ భావ మంగము. మఱియు,

---

22. అయంస రశనోత్కర్షీ పీనస్తనవిమర్దనః ।
నాభ్యూరుజఘనస్పర్శీ నీవీవిస్రంసనః కరః ॥

23. కదా వారాణస్యామమరతటినీరోధసి వస
న్వసానః కౌపీనం శిరసి నిదధానోఽంజలిపుటమ్ ।
అయే! గౌరీనాథ! త్రిపురహర! శంభో! త్రినయన!
ప్రసీదేత్యాక్రోశన్నిమిషమివ నేష్యామి దివసాన్ ॥

[24] కొండలత్యున్నతములై యంతట కనఁబడుచున్నవి. అట్లే విశాల సముద్రములును, అట్టి వీని నన్నిటిని భరించుచు నేమియు శ్రాంతవు కాలేదు. నీకు నమస్కారము! అని యాశ్చర్యముతో మాటి మాటికి భూమిని స్తుతించుచుండు నంతలో నీభూమిని భరించు నీ భుజము తలంపునకురాగా పిమ్మట నోటినుండి మాట రాలేదు.

ఇచట ప్రభువిషయక రతిభావమునకు భూవిషయక రతిభావ మంగము.

ఊర్జస్వి దలంకార మెట్లన,

[25] ఓ వీరుఁడా! నీ శత్రురాజ వనితలు భయమున నడవులఁ బోవుచుండగా వారిని దోచుకొనుట కేఁగిన కిరాతు లా యువతుల చనుగవలచేతను, లోలాపాంగములచేతను నారూఢపులకులై ప్రమాన్పడి వచ్చినపనిని మఱచిరి.

ఇచట ప్రభువిషయ రతిభావమునకు శృంగార రసాభాస మంగము.

మఱియు,

ఓ నరనాథా! నీ దర్శనము కాఁగా నా జన్మము సార్థకమయ్యెనని యుద్ధమందు శత్రుగణ మాదరముతో మనవి చేసికొనుచున్నది.

---

24. అత్యుచ్చాః పరితస్స్ఫురంతి గిరయ స్స్ఫారా స్తథాంభోధయః
తానేతానపి బిభ్రతీ కిమపి న క్రాంతాసి తుభ్యం నమః ।
ఆశ్చర్యేణ ముహుర్ముహుస్స్తుతిమితి ప్రస్తౌమి యావద్భువ
స్తావద్బిభ్ర దిమాం స్మృత స్తవభుజో వాచ స్తతో ముద్రితాః ॥

25. త్వచ్ఛత్రుప్రత్యర్థివసుంధరేశ తరుణీస్సంత్రాసతస్సత్వరం
యాంతీర్వీర ! విలుంఠితుం సరభసం యాతాః కిరాతా వనే ।
తిష్ఠంతి స్తిమితాః ప్రరూఢపులకా స్తే విస్మృతోపక్రమా
స్తాసా ముత్తరళై స్స్తనైరతితరాం లోలై రపాంగై రపి ॥

ఇచట కవియొక్క ప్రభువిషయ రతిభావమునకు ప్రభువిషయ శత్రుగత రతిరూపమగు భావాభాస మంగము. సమాహిత మెట్లన, నాయకుఁడు మిత్రునితో నాయిక వృత్తాంతము చెప్పుట.

[26] ఈమె యేమిచేయునో చూతమని ధైర్యముగ నుంటిని. ఈశఠుఁడు నన్ను పలుకరింపఁడా ? చూతునని యామెయు కోపగించి నట్లుండెను. ఇట్లొకరొకరి విస్మయాన్విత దృష్టిచేఁ జతురమగు నవస్థలో నేను నిమిత్తాంతర వ్యాజమున నవ్వితిని. ఆమెయు నా ధైర్యము నెగురఁ గొట్టు కన్నీటిబొట్టు విడిచెను.

ఇచట శృంగారమునకుఁ గోపశాంతి యంగము.

భావోదయ ప్రభృతులు. భావోదయ మెట్లన,

[27] అందువలన నిప్పుడిచ్చోటనుండి నాయెడ దయాళు వగుము. నీ వుండిన నాప్రాణములుండును. నిన్నుఁ జూచుచు నీదినము గడపఁ గోరుచున్నాను. హంసచే వ్రాసి చూపఁబడిన నాప్రియుఁ డా నలుఁడు నీ రూప ముతో సమానుఁడే.

ఇచట నలునిగూర్చి దమయంతియొక్క ఔత్సుక్యరూప భావోదయము శృంగార రసమున కంగము. భావసంధి యెట్లన,

---

26. పశ్యామః కిమియం ప్రపద్యత ఇతి స్థైర్యం మయాలంబితం
కిం మాం నాలపతీత్యయం ఖలు శఠః కోపస్తయాప్యాశ్రితః ।
ఇత్యన్యోన్యవిలక్షదృష్టి చతురే తస్మిన్నవస్థాంతరే
సవ్యాజం హసితం మయా ధృతిహరో బాష్పస్తు ముక్తస్తయా ॥

27. తదద్యవిశ్రమ్య దయాళురేధి మేదినం నినీషామి భవద్విలోకినీ
అదర్శి యా దేవవిలిఖ్య పత్రిణా తవైవరూపేణ సమస్సమత్ప్రియః ।

## సమాహితాలంకారము.

ఏరుఁడా ! యుద్ధప్రయాణమూలమున క్షణకాలములోఁ
గలుగు విరహమున కోర్వని లోలాక్షినిఁ జూచుచు
గొప్ప సంగ్రామాడంబరము నాకర్ణించుచు నీకు ఆమె
గండపాళి యొకటి వ్యక్తమగు శరపుంఖములు కల
మదనుని నిషంగమువలెను, మఱొక్కటి పులకలచే
విజయుని మంగళపాలిక వలెను నుండెను.

ఇచట రమణీప్రేమ రణౌత్సుక్యముల సంధి ప్రభువిషయ భావమున కంగము.

భావశబల మిట్లన, ఊర్వశిం గాంచిన పురూరవుని వాక్యమిది.

" చేయరాని కార్యమెక్కడ ? చంద్రవంశ మెక్కడ ?
ఆమె మరలఁ గనఁబడునా ? మనకు చదువు తప్పులు
చేయకుండుటకు గదా. ఆహా ! కోపమందును నామె
మోమెంత సుందరము ! పుణ్యాత్ము లేమందురు ? స్వప్న
మందును నామె దుర్లభ. చిత్తమ ! శాంతింపుము.
ఆమెయధరము నాస్వాదించుయువకుఁడు ధన్యుఁడుకదా!

ఇచట వితర్క, ఔత్సుక్య, మతి, స్మరణ, శంకా, దైన్య, ధృతి, చింతల శబలత్వము విప్రలంభ శృంగారమున కంగము.

---

28. ఏకాభూత్కుసుమాయుధేషుధిరివ వ్యక్తపుంఖావళి
జేతుర్మంగళపాలికేవ పులకైరన్యాః కపోలస్థలీ ।
లోలాక్ష్యాః క్షణమాత్రభావి విరహక్లేశాసహాం పశ్యతో
ద్రాగాకర్ణయతశ్చ వీర ! భవత: ప్రౌఢాహవాడంబరమ్ ॥

29. క్వాకార్యం శశలక్ష్మణః క్వచ కులం భూయోఽపి దృశ్యేత సా
దోషాణాం ప్రశమాయ నః శ్రుతమహో కోపేఽపి కాంతం ముఖం ।
కింవక్ష్యంత్యపకల్మషాః కృతధియస్స్వప్నేఽపి సా దుర్లభా
చేతస్స్వాస్థ్యముపైహి కః ఖలుయువా ధన్యోఽధరం ధాస్యతి ॥

# ప్రమాణాలంకారములు

## ప్ర త్య క్ష ము .

సంక్రాంతప్రియవదన ప్రతిబింబము సంయుక్తచూత పల్లవసుగంధము ప్రకృష్టనాదభ్రమర విశిష్టము నగు చల్లని తియ్యని మద్యమం దింద్రియవర్గము సుఖించెను.

మఱియు,

ఒక యువకుఁడు సరసున సరోజముల మధ్యమందున్న కాంతా ముఖమును దూరమునుండి చూచి పద్మమా! యని యించుక శంకించి పద్మములకు దుర్లభములగు కటాక్ష భ్రూవిక్షేపాదులచే నిది ముఖమే యని నిశ్చయించెను.

పూర్వోదాహరణమునం బ్రత్యక్షమాత్రము, నిచట విశేష దర్శనమునఁ గలిగిన సంశయోత్తర ప్రత్యక్షము అనిభేదము.

అనుమాన మెట్లన,

[30] చంచల జలదధూమ మాకాశము నావరించుట చేతను, ఖద్యోతము లగ్నికణములుగా నుండుటవలనను, దిక్కులు విద్యుజ్జ్వాలలచేఁ బచ్చనగుటంబట్టియు, మదనదావాగ్ని పథికతరుషండమునఁ బ్రవేశించె నని తలంతును. మఱియు, లహరీలోలాక్షు లీ కామిను లే యువకునందుఁ జూపు

30. యథారంధ్రం వ్యోమ్నశ్చలజలద ధూమస్స్థగయతి
స్ఫులింగానాం రూపం దధతి చ యథా కీటమణయః
యథా విద్యుజ్జ్వాలోల్లసిత పరిపింగాశ్చ కకుభ
స్తథా మన్యే లగ్నః పథికతరుషండే స్మరదవః ॥

పథికతరుషండము మదన దావాగ్ని కలది. వ్యోమవ్యాపిజలదధూమము కలది కనుక. అని యనుమానాకారము,

సారింతురో వానియందే యీవాడితూపులెప్పుడు పడుచు
నుండును. అధిజ్యధన్వుఁడు క్రోధనుఁడు నగు మదనుఁ
డాజ్ఞాకరుఁడై వీరికి ముందే పరుగెత్తుచుండును. నిజము.

మొదటి యుదాహరణము రూపకసంకీర్ణము. ఇది యతిశయోక్తి సంకీర్ణము. ఇదియే భేదము. యువతులు కింకరమదనకలు మర్మభేది బాణస్థాననేత్రక లగుటవలన నని యనుమానరచన. శుద్ధానుమాన మెట్లన.

విహగసంచారము లేకపోవుటచేతను పద్మ ముకుళనము -
చేతను మాలతి వికసించుటచేతను సూర్యుఁ డస్తమించె
నని తెలియుచున్నది.

( ఈకాలము సూర్యాస్తమయము కలది. విహంగవిశ్రాంత్యాదికము కలది కనుక అని యనుమానాకారము ). మఱియు,

31 సౌమిత్రీ! చెట్టునీడ కేఁగుదము. సూర్యతాప మధిక
మగుచున్నది. రామచంద్ర! రాత్రి సూర్యున కేమి
ప్రసక్తి? ఇదిగో చంద్రుఁ డుదయించుచున్నాఁడు.
వత్సా! చంద్రుఁడని నీవెట్లు తెలిసికొంటివి? కురంగ
మును ధరించుటవలన. హా! ప్రేయసీ! కురంగనయన
చంద్రానన! జానకీ! ఎక్కడున్నావు?

ఉపమాన మెట్లన,

ఈ జ్యోతిర్మండలమందు శకటాకారముగ నున్న నక్షత్ర

---

31. సౌమిత్రే ననుసేవ్యతాం తరుతలం చండాంశురుజ్జృంభతే
చండాంశోర్నిశి కా కథా రఘుపతే! చంద్రోయమున్మీలతి।
వత్సైతద్విదితం కథం ను భవతా ధత్తే కురంగం యతః
క్వాసి ప్రేయసి హా! కురంగనయనే! చంద్రాననే జానకి!॥

ఇతఁడు చంద్రుఁడు కురంగమును ధరించుటవలన. అని యనుమానము.

ముల కూర్పును రోహిణినిగా నెఱుంగుము. ఈరాజులలో
మన్మథునివలె సుందరుఁడు, విష్ణువువలె దివ్యతేజస్వి,
హిమవంతునివలె ధైర్యవంతుఁడు నగు రాజును వేంకట
పతినిగఁ దెలిసికొనుచున్నాను.

పూర్వోదాహరణమున నతిదేశ వాక్య ముపమానముగఁ జూపఁబడినది. ఇం దతిదేశవాక్యార్థ సాదృశ్యప్రత్యక్షరూప మగు నుపమానము కార్యమగు నుపమితితోఁ గూడఁ జూపఁబడినది. ఇది విశేషము.

వ్యాపారవ దసాధారణ కారణము కరణ మను ప్రాచీనమతమున మొదటిది, ఫలాయోగ వ్యవచ్ఛిన్న కారణము కరణ మనునవీనమతమున రెండవయుదాహరణము నని భావము. శబ్దప్రమాణ మెట్లన,

[32] వరుఁడగు హరునందు దోషము ప్రకటించు పాపివి నీవు
నీశునిగూర్చి యొక్కటి చక్కఁగాఁ జెప్పితివి. వేదములు
అజుఁ డగుబ్రహ్మకును శివుడేకారణమని చెప్పుచుండ
నతఁ డెట్లు లక్ష్యప్రభవుఁడగును ?

ఇచట శివుఁడు పరమేష్ఠికినిఁ గారణమనుటకు 'పూర్వమం దెతఁడు బ్రహ్మనుగూడ సృజించెనో' (యోబ్రహ్మాణం విదధాతిపూర్వం) అను శ్రుతిరూప మగు శబ్దప్రమాణము చెప్పఁబడినది. ఇట్లే స్మృతి, పురాణా, గమ, లౌకిక వాక్యరూపములగు శబ్దప్రమాణము లుదాహరింపఁదగినవి. అందు స్మృతి యెట్లన, ఇది నాస్తికుని వాక్యము

జనులారా ! పాపములను బలాత్కారముగఁ జేయుఁడు.
అవి మీరు చేయ నట్లే యగును. బలాత్కారముగ
నొనరించిన కార్యముల నన్నిటినిఁ జేయని వానిఁగా
మనువుచెప్పెను.

---

32. వివృణ్వతా దోషమపి చ్యుతాత్మనా త్వయైక మీశం ప్రతిసాధుభాషితం ।
యమామనంత్యాత్మభువోఽపి కారణం కథంసలక్ష్యప్రభవోభవిష్యతి ॥

పూర్వము శ్రుతి అభిమతార్థమునఁ బ్రమాణముగఁ జెప్పఁబడినది. ఇచ్చట స్మృతి యనిష్టార్థమం దభిమతార్థదూషణ పరునిచేఁ బ్రమాణముగఁ దీసికొనఁబడియెను. ఇదిభేదము.

ఆచారము ఆత్మతుష్టి అని మీమాంసకులు చెప్పిన రెండు ధర్మ ప్రమాణములు వేదశబ్దము నూహింపఁజేయునవి కావున శబ్దప్రమాణ మందంతర్భవించును. అందాచార ప్రమాణమెట్లన,

[33] గొప్పవారి యాచార సంప్రదాయమిట్టిది. సత్పురుషులు తమ నామమును జెప్పఁగూడదు. పేరుచెప్పిన నాచార హీనునిగా జనము తలంచును. అందుచేఁ బేరు చెప్పుట కుత్సహింపను.

అత్మతుష్టి ప్రమాణ మెట్లన,

[34] పవిత్రమగు నామనము శకుంతలను గోరుటచే నీమెను క్షత్రియుఁడు పెండ్లియాడనగును. సత్పురుషులకు సందిగ్ధ కార్యములందంతః కరణ ప్రవృత్తులు ప్రమాణము.

ఇచట దుష్యంతుఁ డాత్మతుష్టిచే శకుంతలా పరిగ్రహము ధర్మమని శ్రుత్యంగీకారము నూహించెను.

ఇట్లు మీమాంసోక్తమగు శ్రుతి లింగాదికముకూడ ప్రమాణముగా నిచట నుదాహరింపఁదగును.

అందు శ్రుతి యెట్లన,

---

33. కుతో జనాచార పరం చరేదృశీస్య నామ నామాదదతే నసాధవః ।
అతో ఽభిధాతుం నతదుత్సహే పునర్జనః కిలాచారముచం విగాయతి ॥

తన పేరు కులపుత్రు పేరు కృపణుని పేరు పెండ్లము పేరు పెద్దకొడుకు పేరు చెప్పఁగూడదని ప్రసిద్ధి.

34. అసంశయం క్షత్రి పరిగ్రహక్షమా యదార్యమస్యామభిలాషి మే మనః ।
సతాంహిసందేహపదేషు వస్తుషు ప్రమాణమంతః కరణప్రవృత్తయః ॥

నీవు నామముచేతనే వరదుఁడవు కావున వరముద్రను ధరింపవు. బుధుః శ్రుతి ప్రసిద్ధార్థమందు లింగమునాదరింపరు కదా !

ఇచట కరిగిరీశునకు వరదుఁడను నభిధాన శ్రుతిచే నన్ని కోరికలనిచ్చు వాఁడగుట సమర్థింపఁబడినది.

లింగ మెట్లన,

నా ప్రవృత్తులేవియు స్వార్థములు కావని మీకుఁదెలిసి నదే. అష్టమూర్తులచే నే నిట్టివాఁడ నని తెలుపఁ బడితిని కదా !

ఇచట శివునియొక్క శ్రుతిప్రసిద్ధ సర్వోపకారక పృథివ్యాద్యష్ట మూర్తి పరిగ్రహాలింగముచే శివుని ప్రవృత్తులకు లోకానుగ్రహ ప్రయోజనత్వము సమర్థింపఁబడినది. లింగము మూలమగు వేదానుమాపకమగుటచే వైదిక శబ్దప్రమాణమందే యంతర్భావము. ఇట్లు లౌకిక లింగములును లౌకిక శబ్దముల నూహింపఁ జేయున వగుటచే లౌకిక శబ్దప్రమాణమందే యంతర్భావము. అందువలన,

[35] నాయిక కనుసన్నచే సవతింటిని జూపి యక్కడనుండి వచ్చుచుంటివా ? యని యడిగెను. దానికతఁడు కాదని శిరఃకంపము చేసెను. అప్పుడామె యాతని వృత్తాంత

---

35. లోలభ్రూలతయా విపక్షదిగుపన్యాసే విధూతంశిర
స్తద్వృత్తాంతనిరీక్షణేకృత నమస్కారో విలక్షస్థితః ।
ఈషత్తామ్రకపోల కాంతిని ముఖేదృష్ట్యానతఃపాదయో
రుత్సృష్టో గురుసన్నిధావపి విధిర్ద్వాభ్యాం నకాలోచితః ॥

దక్షిణ నాయకుఁడు ఖండితయగు స్వీయను గురుసన్నిధియందుఁ జూడ నామె వెంటనే యాతని తప్పును సంజ్ఞతోఁ బ్రకటించుచు, నిరూపించి కోపింప నతఁడు సంజ్ఞతో సమాధాన మిచ్చిన సందర్భము.

మెఱసింగిన సఖిని జూడఁగా నతఁడు 'మనోవికాసముతో
విస్మయాన్వితుఁడై యుండెను. అంతనామె మోమెత్తి
వారగా నతఁడు చూపుతో నామె పాదములఁబడెను.
ఇట్లాదంపతులు గురుసన్నిధియందును గాలోచిత విధిని
వీడలేదు.

ఇత్యాది చేష్టారూపమగు దానిం బ్రమాణాంతరముగాఁ జెప్పనవ
సరములేదు. ఒకచో శబ్దప్రమాణ కల్పనచేఁ జమత్కార మెట్లన,

ఓ జడుఁడా! ప్రాణములుపోఁగా దమయంతి మనము
నాయందు లీనమగు నని తలఁచు చుంటివా? అట్లుతలం
పకు. స్మరవిబుధుఁడు ప్రాణ ప్రయాణకాల మనఃప్రవేశ
ప్రయోజకమగు శ్రుతిని నలముఖేందు పరముగ నాకుఁ
జెప్పెను నిజము.

ఇచట మృతినొందినవారి మనము చంద్రునొందు ననునర్థము కల
శ్రుతికి నలముఖ చంద్రవిషయత్వము కల్పితము. కాఁగా నట్లు వ్యాఖ్యాన
మొనరించిన మదనుని వాక్యము ప్రమాణముగఁ జెప్పఁబడినది.

అర్థాపత్తి

ఓ నితంబిని! నీకు నడు మున్నదని నిర్ణయింప వీ లగును.
నడుము లేనిచో నీ పయోధరభార మెట్లు నిలుచును?
మఱియు,

[36] శాస్త్రప్రమాణముకంటె హేతువు ప్రబలమని నిశ్చయిం

36. వ్యక్తంబలీయాన్యది హేతురాగమాదపూరయత్సా జలధిం న జాహ్నవీ।
గంగాఘనిఘ్నస్మృత శంభుకంధరా సవర్ణ ... ధనుస్యధాస్యాత్ ।
అగస్త్యుడంబుధి నాచమింప భగీరథు డాసముద్రమును గంగచే పూరించెనని
ఖారకారణ్య సర్వమున కథ కను బడుచున్నది ఇది శాబ్ద ప్రమాణము.

పఁబడినపు డా సముద్రమును యమున నింపెను గాని గంగనింపలేదు. అట్లు కానిచో నీసముద్రజలము గంగా ఝరముచే భస్మశూన్యముగఁ జేయఁబడిన శివుని కంఠ ముతో సమానవర్ణముకలది యెట్లగును ?

## అనుపలబ్ధి

తర్కశీలమేయయ్యు లోకము నీనడుము నూహింపలేనిదై నీకు నడుము లేదని స్పష్టముగనే నిశ్చయించు చున్నది. కుచగిరి వరయుగ మాధారము లేకుండ నుండుట మన్మ థుని యింద్రజాలమని తలంచుచున్నది.

## సంభవము

పూర్వ మనుభవింపనిదియు నిఁక ననుభవింపఁబోవునదియు నా కేమున్నది ? సర్వమును సహింతును. నాకు దుఃఖ మలవాటు కాని యో శివ ! శరణాగతులకు నీయెదుట పరాభవ మర్హ్యము కాదు. మఱియు

37 నాకంటె సుప్రసిద్ధులై నాకృతిని లెక్కసేయనివారికై యీకావ్యమును రంచిపలేదు. కాలము నిరవధికము భూమి విశాలము. కనుక నావంటివాఁ డొక్కఁడున్నను, పుట్టినను నతని కీకావ్యముపయోగించుగాక. మఱియు,

38 సోదర ! పాంథ ! నీ వెక్కడనుండి ? నగరమునుండి. విశే

---

37. యేనామకేచిదిహనః ప్రథయంత్యవజ్ఞాం,
జానంతి తే కిమపి తాన్ప్రతి నైషయత్నః ।
ఉత్పత్స్యతేఽస్తి మమకోఽపి సమానధర్మా,
కాలోహ్యయం నిరవధిర్విపులాచ పృథ్వీ ॥

38. భ్రాతః పాంథ కుతో భవాన్నగరతో వార్తానవావిద్యతే
బాఢం బ్రూహి యువా పయోద సమయే త్యక్త్వాప్రియాం జీవతి ।
సత్యంజీవతి ? జీవతీతి కథితా వార్తామయాపిశ్రుతా
విస్తీర్ణాపృథివీ జనోఽపివివిధః కింకింన సంభావ్యతే ॥

మమా ? ఔను. చెప్పుము యువకుఁడు వర్షాకాల
మున ప్రేయసిని విడిచి జీవించుచున్నాఁడు. నిజముగ
జీవించుచున్నాఁడా ? జీవించు చున్నాఁడని చెప్పినవార్త
నేనును వింటిని. పృథివి విశాలమైనది జనులు ననేకవిధ
ములు. ఏది సంభవింపదు ?

ఇచట మొదటి యుదాహరణమున 'పూర్వమనుభవింపనిదియు నిఁక ననుభవింప బోవునదియు నాకేమున్నది' అని సంభవ ప్రమాణసిద్ధమగు నర్థము చూపఁబడినది. రెండవ యుదాహరణమున సంభవము నుప పాదించు కాలానంత్యాదికము చూపఁబడినది. మూఁడవ యుదాహర ణమున సంభవమె కంఠోక్తము. ఇది భేదము.

## ఐతిహ్యము

నరుఁడు జీవించియుండిన నూరేండ్లకైన నానందము
నొందును. అను కల్యాణకరమగు నీలోక వార్త నాకు
వినఁబడుచున్నది. ఎంతయాశ్చర్యము !

ఇచట నిది లోకవార్తయని పురుష విశేషనిర్దేశములేని వక్తృప్రవాద పారంపర్య రూపమగుట చూపఁబడినది. (ఇదియే ఐతిహ్యలక్షణము)

## సంసృష్టి సంకరములు

పిమ్మట నీయలంకారములొకచో రెండుగాని యెక్కువగాని కూడు టలో లౌకికభూషణముల కలయిక వలెనే చమత్కారాతిశయము కనఁ బడుచుండుటవలన నరసింహన్యాయముచే వేఱలంకారముకాఁగా నాయ లంకారనిర్ణయము చేయఁబడుచున్నది. తిలతండు లన్యాయముచే స్పష్టముగ భేదము తెలియుచున్న యలంకారములు కలిసిన సంసృష్టి. నీర క్షీరన్యాయముచే భేదముతెలియని యలంకారములు కలిసిన సంకరము నగును. ఆసంకరము అంగాంగిభావముచేతను, సమప్రాధాన్యముచేతను,

సందేహముచేతను, ఏకవాచకానుప్రవేశము చేతను, నాలుగు విధములు ఇట్లు నరసింహాకారములగు నలంకారము లెదు.

## సంసృష్టి

[39] వదన సౌరభలోభ పరిభ్రమద్భ్రమర సంభ్రమసంభృత శోభయు చలితయు నలకలోల విలోచనయు నగు నొక యువతిచే కలమేఖలా కలకలము చేయఁబడెను.

ఇచట శబ్దాలంకారము లగు ననుప్రాసయమకములకు సంసృష్టి.

తమ మంగములనలదు చున్నదా! ఆకస మంజనమును గురియుచున్నదా! యను నట్లుండుటచే దృష్టి దుర్జనసేవ వలె నిష్ఫలమయ్యెను.

ఇచట నర్థాలంకారములగు నుత్ప్రేక్షలకు నుపమకు సంసృష్టి.

[40] ఆనందమందర పురందరముక్తమాల్యము, మహిషాసుర శిరోనిక్షిప్తము, మంజుమంజీరశింజిత మనోహార మంబికా పాదాంబుజము, మనవిజయమున కగుగాక.

ఇచట శబ్దార్థాలంకారములగు ననుప్రాసోపమలకు సంసృష్టి.

## అంగాంగి భావసంకరము.

[41] అప్పుడు గాలిచే కదల్పఁబడిన చెట్లక్రింది నీడలు శశాంక

---

39. వదనసౌరభ లోభపరిభ్రమద్భ్రమర సంభ్రమ సంభృతశోభయా।
చలితయా విదధే కలమేఖలా కలకలోఽలకలోలదృశాన్యయా॥

40. ఆనందమందరపురందర ముక్తమాల్యం
మౌళౌ హఠేన నిహితం మహిషాసురస్య।
పాదాంబుజం భవతు నో విజయాయ మంజు
మంజీరశింజిత మనోహర మంబికాయాః।

41 తరళీభవేపంత మహీరుహాణాం ఛాయాస్తదామారుతకంపితానాం।
శశాంకసింహాసన భాగధానాం ఆకాశవృత్తీనామివ గాత్రఖండాః॥

సింహముచే లూనాకృతులు తమోగజముల గాత్రఖండ
ములవోలె కదలెను.

ఇచట శశాంక సింహముచే ననునది, తమోగజముల యనునదియు రూపకము.

యద్యపి ఇచట శశాంకుఁడను సింహము తమము లనుగజములు అని మయూర వ్యంసకాది సమాసము నాశ్రయించుటచే రూపకము వలెనే శశాంకుఁడు సింహము వంటివాఁడు తమములు గజములవంటివి, అను నుపమిత సమాసము నాశ్రయించిన, నుపమయుఁ జెప్ప శక్యమగును గాని లూనాకృతులను విశేషణ మూలమున రూపకమే సిద్ధించును. ఆ విశేష మునకు ప్రధానముతో నన్వయ మర్హము కాని యప్రధానముతో నన్వయ మర్హముకాదు కదా! గుణములు ప్రధానముతో నన్వయించు నవి కావున సమములు, సమములగుటచే పరస్పరము సంబంధము లేనివి (గుణానాంచ పరార్థత్వా దసంబంధ స్సమత్వాత్) అను న్యాయముంబట్టి ఉపమిత సమాసముంజెప్పినచో నది పూర్వ పదార్థ ప్రధానమగుటచే శశాంకునకు, తమములకుఁ బ్రాధాన్యముండును. అచట విశేషణముయొక్క ముఖ్యార్థమగు శరీరచ్ఛేదము నన్వయించుటలో స్వారస్యముండదు. లాక్షణికార్థ స్వరూపనాశరూప ఆకృతి లవన కర్తృత్వకర్మత్వములకు వానితో నన్వయము కలిగినను ముఖ్యార్థమగు శరీరచ్ఛేదము యొక్క అన్వయ స్వారస్యమే యాదరింపఁదగినది.

[43] అందుచే స్వరూపనాశమును గప్పిపుచ్చుట వలన నుత్పన్నమగు సాధ్యవసానలక్షణా మూలాతిశయోక్తిచే రూపకము సిద్ధించును. ఆ రూపక ముత్ప్రేక్షాపోషకమగుటంబట్టి యుత్ప్రేక్ష కంగము. రూపకము

43. ఇట్లయ్యు శశాంకమున నీవిశేషణమున కన్వయము లేకపోవుటచే నిట్లు రూపకము సిద్ధించుననిరం జెప్పుచున్నారు.

లేనిచో నన్ననో! నీడలు లూనగాత్ర ఖండముల వోలెఁ గదలినవి అన్నంత మాత్రమే చెప్పినచో గదలుట యను సాధర్మ్యముండుటం బట్టి యుపమాలంకారమే సిద్ధింప వలసి వచ్చును. నీడలకు అప్పుడే నరకబడిన గాత్రఖండములతో నభేద సంభావనా రూపమగు నుత్ప్రేక్ష సిద్ధింపక పోవును.

ఓయి! శశాంకునిచే ఛిన్నాకృతులగు తమముల గాత్ర ఖండములువోలె నీడలు కదిలినవి. అను నింత మాత్రము చెప్పినను అభేద సంభావన కుపయుక్తమగు లూనాకృతియను నధిక విశేషణమును స్వీకరించుటవలన నుత్ప్రేక్ష సిద్ధించును గదా! యన్నచో నది నిజమే! అట్లు చెప్పినప్పుడు ఆ కృతి లవనకార్య సమారోపమునకు నిమిత్తము లగు శశాంక తమములందు హంతృ హంతవ్య చేతనవ్యవహార సమారోప రూపమగు సమాసోక్తి నపేక్షింపవలెను. తమోగజములని చెప్పినచో రూపకమగును. ఇదియే భేదము. ఇంతకు నిచట నతిశయోక్తి రూపకోత్ప్రేక్షల కంగాంగి భావముచే సంకరమని తేలినది.

## సమప్రాధాన్య సంకరము.

[43] అతిక్రాంత తుంగపయోధర, స్ఫురితమధ్య గతారుణ
నాయకయునగు నాకాశ లక్ష్మిమరకతైకావళివోలె
(నన్న) సూర్య తురంగావళి మమ్మోమ్ము గాత.

ఇచట నంగమగు పయోధరాది శబ్దశ్లేషమూలకాతిశయోక్తిచే బరిపోషితమేయగు సూర్యతురగావళి యందాకాశలక్ష్మి మరకతైకావళ్యభేదోత్ప్రేక్ష—పయోధర శబ్దశ్లేష ముఖయోపకారక మగుటంబట్టి,

---

43 అవతువస్సవితు స్తురగావళిస్సమతిలంఘితతుంగపయోధరా।
స్ఫురితమధ్యగతారుణనాయకా మరకతైకలతేవనభశ్శ్రియః॥

గగనలక్ష్మియందు నాయికా వ్యవహారారోప రూపమగు సమాసోక్తి గర్భితముగానే పోషింపఁబడుచున్నది.

అందువలన నుత్ప్రేక్షా సమాసోక్తు లేక కాలికములు. పరస్పరా పేక్షతో చమత్కారము నొందుటయు, నుభయమునకుఁ దుల్యమే కనుక వినిగమనము లేకపోవుటచే సమప్రాధాన్య సంకర మగును. మఱియు,

చంద్రుఁ డంగుళులవంటి కిరణములచేఁ గేశపాశమువంటి
తిమిరమును బట్టుకొని ముకుళీకృత పద్మనేత్రమగు రజనీ
ముఖమును ముద్దుపెట్టు కొనుచున్నాఁడు కాఁబోలు.

ఇచట నంగుళులవంటి యను వాక్యోక్తోపమచే నుపమా బహుళ మగు సందర్భమునఁ జెప్పుట వలన, ముఖ్యార్థరూపమగు ముకుళీకరణ మను లింగము (లింగప్రామాణ్యము) న కనుగుణమగుటవలనను, నుప మిత సమానము చెప్పుటచే లబ్ధమగు సరోజలోచనమను సమాసోక్తోపమ చేతను నంగమగుదానిచేఁ బరిపోషితమేయగు చంద్రకర్తృక రజనీముఖ చుంబనోత్ప్రేక్ష—ఉపమ లుత్ప్రేక్షాసమాసోక్తులకుఁ బోషకమగుటలో భేదము లేకపోవుటంబట్టి, సమాసోక్తి విశిష్టముకానిచోఁ జుంబనోత్ప్రేక్ష నిరాధార మగుటంబట్టియు, నిశాచంద్రులందు దాంపత్యవ్యవహార సమారోపరూప సమాసోక్తివిశిష్టముగనే పోషింపఁబడుచున్నది. అందువలన నిచటను నేక కాలికములగు నుత్ప్రేక్షా సమాసోక్తులకు సమ ప్రాధాన్యము సిద్ధము.

" యద్యపి ఇచట నుపమలచే శశి నిశాగతమగునవే ధర్మములు

44. చంద్రుని చుంబనోత్ప్రేక్షయందు, దాంపత్యవ్యవహారసమారోపాత్మకసమాసోక్తి యందు నపేక్షితమగు నాయక నాయికా సామాన్యధర్మ మునుపమాద్వయమువలన లభింపక పోవుటచే నాయుపమల కుత్ప్రేక్షాసమాసోక్త్యంగత్వ మెట్లు కుదురునని శంకించు చున్నాఁడు.

సమర్థింపఁబడుచున్నవి కాని చంద్రనాయకులకు రజనీనాయికలకు సాధారణములగు ధర్మములు సమర్థింపఁబడుటలేదు. ఉత్ప్రేక్ష ప్రకృతాప్రకృత సాధారణమగు గుణక్రియల నపేక్షించుటంబట్టి, సమాసోక్తి విశేషణ సామ్యమూలకమగుటం బట్టియు సాధారణ ధర్మ సమర్పణ ముత్ప్రేక్షా సమాసోక్తుల కవసరము. అట్లయ్యు వాక్యోక్తోపమ యందున్న 'వంటి' పదము నకు కిరణములవంటి యను మఱొక యన్వయము నంగీకరించి యా యన్వయమువలన లభించునది, ప్రకృతాప్రకృత ములలో నొక్కొక్కదానికి విషయము నగు నర్థద్వయమునకు, సమాస ములోఁ జెప్పఁబడిన యుపమయందు సరోజమువంటి లోచనమను మఱొక సమాసము నంగీకరించి సమాస భేదముచే లబ్ధమగు నర్థద్వయ మునకును నభేదాధ్యవసాయముచే సాధారణ్యమును సంపాదించి యా యుపమల కుత్ప్రేక్షా సమాసోక్త్యంగత్వము సాధింప నగును.

"లేనిచో ఇచటఁ బ్రస్తుత భాగములోనున్న కిరణ తిమిర పద్మ ములకు నప్రస్తుత భాగమందున్న యంగుళి కేశపాశ నేత్రములకును తను దీర్ఘారుణత్వ, నీల నీరంధ్రత్వ, కాంతి మత్త్వాదికముచే సదృశములగు వానికి ప్రత్యేకముగ భేదమున్నట్లే అనుగతమగు సాదృశ్య ప్రయోజక రూపము ( తను దీర్ఘారుణత్వాదికము ) క నభేదమున్ను కలదు. "ఉపమ భేదాభేద ప్రధానము" అను నాలంకారిక సిద్ధాంతముంబట్టి ఆ యభేదము కూడ నిచట వివక్షితమే. ఆ భేదాభేదములందును ప్రయోజకాంశ నిష్కర్ష న్యాయముచే నభేద భాగమునే గ్రహించుటచే సాధారణ్యమును సంపాదించి యుపమ ప్రధానములగు నుత్ప్రేక్షా సమాసోక్తుల కంగమగుటను నెరవేర్పఁదగును. వెలుతురును వేడిని నిచ్చు

45. ఎట్లును తప్పని యభేదాధ్యవసాయముచేతనే యంగత్వము కుదురుచుండ నన్యయాంతర సమాసాంతరములఁ గల్పించుట గౌరవ మను భావములోఁ జెప్పుచున్నాఁడు.

సూర్యతేజము వేడినిచ్చుట (చలినిపోఁగొట్టుట) మాత్రముచే శీత బాధితుఁడగు సంధున కుపయోగించుట లేదా ? ఇట్లంగీకరింపనిచో,

> అంసార్పిత లంబహారుఁడు హారిచందన లిప్తాంగ రాగుఁడు
> నగు నప్పాండీఁడు బాలాతప రక్తసానువు నిర్ఝరోత్పత్తి
> యుతుఁడు నగు నద్రి రాజంబోలెఁ బ్రకాశించు
> చున్నాఁడు.

ఇత్యాద్యుపమయుఁ గుదురక పోవలసివచ్చును. అద్రి పక్షమున బాలాతప నిర్ఝరములు, పాండీని పక్షమున హారిచందన హారములు నని ధర్మభేదముంబట్టి, ఉపమానోపమేయములగు నద్రి రాజ పాండ్యుల కనుగత సాధారణ ధర్మము చెప్పఁబడలేదు. అందువలన నచట సదృశ ములగు బాలాతప హారిచందనములకు నిర్ఝర హారములకు నభేదాంగీ కారమే గతి యగుచున్నది.

> సముద్రుఁడు తరంగాగ్రములతో ఫేన చందనమును
> నూరుచున్నాఁడు కాఁబోలు. చంద్రుఁడు కరములతో
> దానిందీసి దిగంగనలకుఁ బూయుచున్నాఁడనితలంతును.

అనుచో నుత్ప్రేక్షలకు కాలభేదమున్నను నన్యోన్య నిరపేక్షమగు వాక్యద్వయముచే గ్రహింప బడుటంబట్టి, 'చంద్రుఁ డుకరములతో దానిందీసి' యని ఫేన చందనరూపక మాత్రమును గ్రహించుటచేఁ బూర్వమందున్న యుత్ప్రేక్ష నపేక్షింపక పోవుటవలనను సమప్రాధాన్య మున్నది. లోకసిద్ధమగు పేషణలేపన పూర్వపరీభావముల ఛాయ నను కరించిన యుత్ప్రేక్షా ద్వయమునకుఁ బూర్వ పరీభావముండుటచేఁ జమత్కారాతిశయ వికాసము వలన సంసృష్టికంటె విలక్షణమగుబంబట్టి తమ మంగముల నలదుచున్నదా! యను దానివలెనిది యుత్ప్రేక్షాద్వయ సంసృష్టియే యగు ననరాదు. అందువలన భిన్న కాలీనములగు దర్శపౌర్ణ

మాసాదియాగమువలె నేకఫలసాధనము లగుటచే నీ యుత్ప్రేక్షా ద్వయము సమప్రధానము. ఇట్లు సమప్రధాన సంకరము కూడ నుదాహరింపఁబడినది.

## సందేహసంకరము.

[45] ఇందుమతీ స్వయంవరమున సమగుణులగు నజేందుమతుల కలయికకు సంతసించిన పౌరులు రాజుల శ్రవణములకు కటువుగ ఈమె శరచ్చంద్రునొందిన కౌముది, జలధిం జెందిన జాహ్నవి, అను నేకార్థక వాక్యముల వివరించిరి.

ఇచట నీమె యను సర్వనామముచే నజుని వరించిన యిందుమతి విశిష్టరూపముతోఁ జెప్పఁబడినప్పుడు బింబ ప్రతిబింబభావాపన్న ధర్మ విశిష్టములగు సదృశముల కైక్యారోప రూపమగు నిదర్శన యగును. ఆ సర్వనామముచే నిందుమతి స్వరూపముతోడనే గ్రహింపఁబడిన మొదల బింబ మగు నజుని వరించుట యను ధర్మమన్ననో! పూర్వసందర్భము వలనను, ననుగుణములగు నజేందుమతుల కలయికకు సంతసించిన యను పౌరవిశేషణము వలనను ప్రతీయమాన మగుచున్నది. ఆ పక్షమున ప్రస్తుత ధర్మియందు ప్రస్తుత వృత్తాంతప్రతిబింబమగు నప్రస్తుత వృత్తాంతారోప రూపమగు లలితమగును. ఇట్లు నిశ్చయము లేకపోవుట వలన సందేహసంకర మగును. మఱియు,

---

48. శశినముపగతేయం కౌముదీ మేఘముక్తం
జలనిధిమనురూపం జహ్నుకన్యావతీర్ణా ।
ఇతిసమగుణయోగప్రీతయస్తత్ర పౌరాః
శ్రవణకటు నృపాణామేకవాక్యం వివవ్రుః ॥

47 చంద్రుఁడు కరిగి సాక్షా దమృత రసవాపి యైనయెడల నచట నుండు కళంకము వికసితేందీవరవన మైనయెడలను నా వాపియందు స్నానముచేసి చల్లబడిన యవయవము లతో మదనాగ్నివలనఁ గలిగిన పీడాపరిభవము నన్నటి కైన వీడుదును.

ఇచట నింతపాటి సాధనసంపత్తి కలిగినపుడు తాపము శాంతించుననను నర్థమందు కవికి తాత్పర్యమైనచో నపు డీ సాధనసంపత్తి సిద్ధించుటకై తలంపు కనుక సంభావనాలంకార మగును. ఇంత సాధనసంపత్తి యెప్పు డును సంభవింపదుకావున తాపశాంతియు గగనారవిందసదృశమే యను నర్థమందు కవితాత్పర్య మైనయెడల గ్రహింపఁబడిన యసత్యమును సాధించుట కసత్యాంతర కల్పనారూపమగు మిథ్యాధ్యవసి త్యలంకార మగును. కావున నుభయథా సంభవించుటచే సందేహసంకర మగును. ఇట్లే, 'ఓ రాజ! స్ఫటిక కుంభములందుండుటచేఁ దెల్లనగు నీటిలోఁ దడుపఁబడిన ముత్యమువలన లత పుట్టినచో దాని పుష్పములతో నీ యశము సమ మగును.'

ఇత్యాదులందును సంభావనా మిథ్యాధ్యవసితి సందేహములసంకర మగునని యెఱుంగవలెను.

పాము నోటితో విషమువిడుచుచుఁ జెట్టుమొదట నుండిన యెడల ఫలభారములో నిండిన తరువువలన లాభమేమి ?

ఇచట సర్పవృత్తాంతము వర్ణింపఁబడుచుండ రాజద్వార మందున్న నీచవృత్తాంతము కూడ తోఁచుచున్నది. అందు నిజమున కట్టి సర్ప

47. విలీయేందుస్సాక్షాదమృతరస వాపీ యదిభవే
త్కళంక స్తత్రత్యో యదిచ వికచేందీవరవనం।
తతస్స్నానక్రీడాజనితజడ భావై రవయవైః
కదాచిన్ముంచేయం మదనశిఖిపీడాపరిభవమ్ ।

వృత్తాంతమే ప్రస్తుతమైనచో నప్రస్తుత ఖల వృత్తాంతమును దోఁచఁ జేయుట కప్రస్తుత సర్వవృత్తాంత కీర్తన మన్నచో నప్రస్తుత ప్రశంస. అథవా, వర్ణ్యమానమగు సర్వవృత్తాంత కీర్తనముచే సమీప మందున్న ఖలుల మర్మము వెల్లడింపఁబడినచో రెండును బ్రస్తుతము లగుటచేఁ బ్రస్తుతాంకురము నగునుగావున సందేహసంకరము.

ఒక విషయమందే శబ్దార్థాలంకారద్వయము స్పష్టమగుచో నేక వాచకానుప్రవేశసంకర మగునని లక్షణము చెప్పి కావ్యప్రకాశికారుఁ డుదాహరించెను.

[48] విస్మట స్పష్టోచ్ఛ్వసత్కిరణ కేసర సూర్యబింబ విస్తీర్ణ కర్ణికము, శ్లిష్టాష్టదిగ్దళకలాప ముఖావతార బద్ధాంధకార మధుపావళియు, నగు దివసారవిందము సంకోచము నొందెను.

ఇచట నేక పదానుప్రవిష్టములగు రూపకానుప్రాసము లున్నవి. ఏ వాక్యమందు పదభేదముచే శబ్దార్థాలంకారములుండునో అచట నా శబ్దార్థాలంకారముల సంసృష్టియగును. ఇచట నొక పదమందే రెండు నుండుటచే సంకరమగును.

అలంకారసర్వస్వకారుఁ డన్నచో వాచకశబ్ద మర్థముల కాధార మగుటవలన నొకవాచకశబ్దమందు వాచ్యములే యగు నలంకారముల కనుప్రవేశము స్వారసికమగునని తలంచి యర్థాలంకారములకును నేక వాచకానుప్రవేశ సంకరము నుదాహరించెను.

---

48. స్పష్టోచ్ఛ్వసత్కిరణకేసర సూర్యబింబవిస్తీర్ణకర్ణిక మథో దివసారవిందం ।
శ్లిష్టాష్టదిగ్దళకలాపముఖావతార బద్ధాంధకారమధుపావళి సంచుకోచ ॥

"ఆ నగరమం దేణీలోచనలు సత్పుష్కరద్యోతి తరంగ
శోభియు నమందముగ నారబ్ధమృదంగవాద్యము నగు
నుద్యాన వాప్యుదక మందువలెనే నాట్యగృహమందును
నాడుకొనుచున్నారు.

ఇచట నాట్యగృహ వాప్యుదకములకు సత్పుష్కరేత్యాది విశేషణ మందు శబ్దసామ్య ముండుటచే శ్లేష, అమందముగ నారబ్ధేత్యాది విశేషణమం దర్థసామ్య ముండుటచే నుపమ. ఆరెండును నొక 'వలె' శబ్దమం దనుప్రవిష్టములు కావున నేక వాచకానుప్రవేశ సంకర మయ్యెనని. సత్పుష్కరేత్యాది విశేషణ మందును శ్లేషమూల కాభేదాధ్యవసాయ రూపమగు నతిశయోక్తిచే లభించిన ధర్మసామ్యమే 'యచటి' వలె శబ్దప్రతిపాద్య మగుటచే శబ్దసామ్య మావలె శబ్దప్రతిపాద్యము కాక పోవుటంబట్టి యదియు మాకభిమతముకాదు. శ్లేషమూలకాభేదాధ్యవసాయముచే ధర్మసామ్యము నంగీకరింపక పోయినచో, 'ఏమి యాశ్చర్యము! రాగవతియగు సంధ్య స్వయముగ నంబరమును వీడుచున్నది.' ఇత్యాది శ్లిష్టవిశేషణ సమాసోక్త్యుదాహరణమున విశేషణసామ్యము లేక పోవుటవలన సమాసోక్తి లేకపోవలసి వచ్చుటచేతను, శబ్దసామ్యమా 'వలె' శబ్ద ప్రతిపాద్యమైనను, ఆ శబ్దసామ్యమున కుపమావాచకత్వమే లభించుటచే శ్లేషవాచకత్వము లేకపోవుటంబట్టియు, శబ్దప్రయుక్త మగునది కాని యర్థప్రయుక్తమగునదికాని కవిసమ్మతమగు సామ్యమును జెప్పినచో నన్నివిధములను నుపమనే స్వీకరింపవలెను. అట్లు స్వీకరింపనియెడల,

---

43. సత్పుష్కరద్యోతి తరంగశోభి ష్యమంద మారబ్ధ మృదంగవాద్యే ।
ఉద్యానవాపీపయసీవ యస్యామేణీదృశో నాట్యగృహే రమంతే ॥

సత్పుష్కరద్యోతి తరంగశోభి=మంచి తామరపూవులతో ప్రకాశించు నలలతో విలసిల్లునది వాప్యుదకము, మంచి వాద్యభాండముఖములచే ప్రకాశింపఁ జేయబడిన నృత్యభూమి కలది నాట్యగృహము.

'ఏ ట్లాహ్లాదపఱచుటచేఁ జంద్రుఁ డయ్యెనో, తపింపఁ
జేయుటచే దపనుఁ డెట్లయ్యెనో అట్లే ప్రజల రంజింపఁ
జేయుటచే నా దిలీపుఁ డన్వర్థకుఁడగు రాజయ్యెను.'

అనుచోట నుపమ లేకపోవలసివచ్చును. ఇచట నన్వర్థనామ మను శబ్దసామ్యముతప్ప నర్థసామ్యమేదియుఁ గవి వివక్షితమైనది లేదుకదా!

ఆ రెండు మతములు దుష్టములే యగుటవలన నిచట నొక యర్థము ప్రతిపాద్యముకాఁగా నలంకార ద్వయ లక్షణముల సమన్వయ ముండుటచే నలంకార ద్వయ ప్రతీతి కలుగునో అచట నా రెం డలంకార ములకు నేకవాచకానుప్రవేశ ముండును. ఎట్లన,

ఆ విదర్భానగరమునఁ జంద్రకాంతమణులతోఁ గట్టఁ
బడినవి కాఁబట్టి చంద్ర కిరణములు సోకగనే కఱగిన
నీటితో నిండిన చెట్ల కుదుళ్ళచే విఫలిత జలసేక మగు
దమయంతీవనముచే నా హంస యాకర్షింపఁబడెను.

ఇచట దెలుపఁబడిన యర్థము 'సమృద్ధిమ ద్వస్తువర్ణన ముదాత్త' మను లక్షణానుసారముగ నుదాత్తాలంకార రూపము 'సంబంధము లేకున్నను సంబంధకథన మతిశయోక్తి' యను లక్షణమువలన నతిశ యోక్తిరూపమును నగును. దివ్యలోకమందున్న సంపత్సమృద్ధి వర్ణనాదు లం దతిశయోక్తి శూన్యమగు నుదాత్తము, శౌర్యౌదార్య దారిద్ర్యాది విషయాతిశయోక్తి వర్ణనము లందుదాత్తశూన్యమగు నతిశయోక్తియుఁ బరస్పర సంబంధ శూన్యములుగ సిద్ధమగుటచేత నంతటను 'నుదాత్తము సంబంధములేకున్నను సంబంధకథనరూపమగుట' నిర్ణీతమే కావున వేఱగు నలంకారద్వయముయొక్క లక్షణసమావేశము లేదనరాదు.

ఒకదానిచే మఱొకటి పోషింపఁబడక పోవుటవలన, ఒకటి స్వతంత్రము మఱొకటి పరతంత్రము నను భేదము లేకపోవుటవలనను, అర్థవశమునఁగూడిన యీ యుదాత్తాతిశయోక్తుల కిచట నంగాంగిభావము లేదు. ఏ శబ్దములచే నిచట సంబంధివస్తువు తెలుపఁబడుచున్నదో, ఆ శబ్దములచేతనే సంబంధము లేకున్నను సంబంధరూపమగు నదే వస్తువు తెలుపఁబడుటచే భిన్నప్రతిపాదక శబ్దప్రయుక్తమగు నర్థభేదము లేకపోవుటంబట్టి సమప్రాధాన్యమున్ను లేదు. ఒక యలంకారభాగమందింకొక యలంకారభాగమునకుఁ బ్రవేశము లేకపోవుటవలన సందేహసంకరమున్ను కాదు. అందువలన నిచట నుదాత్తాతిశయోక్తుల కేకవాచకానుప్రవేశరూపమగు సంకరము సిద్ధమయ్యెను.

ఒకచో సంకరములకుఁగూడ సంకరమున్నది. ఎట్లన,

50 భోజుని పండితభవనములలో రతివిహారములందు హార
ములనుండి జారి, చీపురుతో చిమ్మబడుచు, నుదయమున
ముంగిళ్ళలో నాడు ముద్దుకుఱ్ఱల కాలి లత్తుకచే నెఱ్ఱ
వారిన ముత్యములను, దానిమ్మగింజలని శంకించు నాట
చిలుక లాకర్షించు టాభోజుని దానలీలయే.

ఇచట విద్వాంసుల సంపత్సమృద్ధిని వర్ణించుట యుదాత్తాలంకారము. బాలుర కాలిలత్తుకచే నెఱ్ఱవారిన వనుచోట నుదాత్తమూలక తద్గుణాలంకారము. అచటనే చెప్పఁబోవు భ్రాంత్యుపపాదకమగు పదార్థహేతుక కావ్యలింగాలంకారమును నుండుటచే నాతద్గుణ కావ్యలింగముల కేకవచనానుప్రవేశసంకరము. ఆసంకరమూలక మగునది 'శంకించు' ననుచోట నున్న భ్రాంతిమ దలంకారము. ఆ యేకవాచకానుప్రవేశ సంకర భ్రాంతి

50. ముక్తాః కేళివిసూత్రహారగళితాస్సమ్మార్జనీభిర్హృతాః
ప్రాతః ప్రాంగణసీమ్ని మంథరచలద్బాలాంఘ్రిలాక్షారుణాః।
దూరాద్దాడిమబీజశంకితధియః కర్షంతి కేళీశుకాః
యద్విద్వద్భవనేషు భోజనృపతేస్తత్త్యాగలీలాయితమ్॥

మదలంకారములచే నుదాత్తాలంకారము చమత్కారము నొందింపఁ బడినది. కనుక ఆ సంకర భ్రాంతిమంతములకు నుదాత్తమునకును నంగాంగి భావముచే సంకరము. ఇట్లు విద్వద్గేహ వైభవ మను కార్యమునకు రాజు వితరణవిలాస మను కారణమునకు నభేదమును జెప్పుటచే హేత్వలంకారము. అదియు రాజు వితరణవిలాసముయొక్క నిరతిశయోత్కర్షను వెల్లడించుటలోఁ బర్యవసన్న మయినది. ఇంతమాత్రమందే కవి తాత్పర్యమైనచోఁ బూర్వోక్తోదాత్తాలంకారాలంకృతమగు హేత్వలంకారమునఁ బరిసమాప్తి. వర్ణనీయుఁడగు రాజుయొక్క సంపద యెట్టిదను ప్రశ్నమున కుత్తరమగుటచే నిరతిశయ సంపద్వితరణరూపమగు నప్రస్తుత కార్యముద్వారా రాజసంపదుత్కర్షను బ్రశంసించుట కవి తాత్పర్యమన్నచోఁ గార్యనిబంధనా ప్రస్తుత ప్రశంసలోఁ బర్యవసానము. కార్యమగు విద్వద్భవన వైభవముకూడ వర్ణనీయ మగుటచేఁ బ్రస్తుతమేయని కవియభిప్రాయమైనచోఁ బ్రస్తుతాంకురమందు విశ్రాంతియగును. వీనిలో నొకదానియందు నిశ్చయము లేకపోవుటచే సందేహసంకరము. ఇంతియ కాదు. విద్వద్భవనవైభవ వర్ణనమునకు సంబంధము లేకున్నను సంబంధకథనరూపమగుటచే నతిశయోక్తి కుదాత్తాలంకారముతోఁ గూడ నేకవాచకానుప్రవేశ సంకరము. నిరతిశయ వితరణోత్కర్ష పర్యవసాయి యగు హేత్వలంకారమునకును అద్భుతాసత్యోదార్యవర్ణనరూపమగు నత్యుక్త్యలంకారముతోఁగూడ నేకవాచకానుప్రవేశ సంకరము. ఆ హేత్వలంకారమూలకమగు నప్రస్తుత ప్రశంసకుఁగాని, ప్రస్తుతాంకురమునకుఁగాని [51] వాచకశబ్దము ప్రతిపాదక మాత్రపరమగుటచే వ్యంజకసాధారణమగుటవలన. రాజసంపత్సమృద్ధి వర్ణనాత్మకమగు నుదాత్తాలంకారముతోఁగూడ నేకవాచకానుప్రవేశ సంకరము.

---

51. (రాజసంపత్సమృద్ధి వ్యంగ్యమేకాని వాచ్యముకాక పోవుటచే సంపత్సమృద్ధి వర్ణనరూపోదాత్తాలంకారముతో నేకవాచకానుప్రవేశకథనమెట్లు కుదురు నన్నచోఁ జెప్పుచున్నాఁడు).

ఉదాత్తాతిశయోక్తి సంకరము, హేత్వత్యుక్తి సంకరము, వ్యంగ్యోదాత్తమునకు నప్రస్తుత ప్రశంసా ప్రస్తుతాంకు రాన్యతరమునకు నగు సంకరము, ఈమూఁడేకవాచకానుప్రవేశ సంకరములకు సమ ప్రాధాన్య సంకరము. ఉదాత్తాది మాత్రమే హేత్వలంకారాదికమునకు సౌందర్యమును సంపాదించున దగుటచే నతిశయోక్తి సంకరము నంగముగ నపేక్షింపకపోవుటంబట్టి వీనిలో నొకదాని కొకటి యంగము కాదు. ఇట్లే శ్లోకార్థమున నాలుగు సంకరములకుఁ దగిన సంకరము నూహించు కొనవలెను. ఇట్లే మఱొకస్థలమున నుదాహరణాంతరములను జెప్పుకొనఁ దగును.

కృపానిధి యగు వేంకటపతి నియోగమున సంస్కృత కువలయానందము నప్పయ్య దీక్షితుఁడు రచింప, నీ యాంధ్ర కువలయానందమును కంబముపాటి సుబ్రహ్మణ్య శాస్త్రి రచించెను.

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే,
రఘునాథాయ నాథాయ సీతాయాఃపతయే నమః.

శ్రీః శ్రీః శ్రీ

శ్రీ గురుత్రయ కరుణాకటాక్షలబ్ధ న్యాయ సాహిత్య వ్యాకరణ విద్యా
వినీత ఉభయభాషా ప్రవీణ, గోదావరీ మండలాగ్గత వైనతేయ
నదీతీర దొడ్డవరవాసి, సాహిత్యాచార్య కంబముపాట్యన్వయ
శ్రీసూర్యనారాయణశాస్త్రి వేంకమాంబ ప్రియతనూజ,
సుబ్రహ్మణ్యశాస్త్రి విరచితాంధ్ర కువలయానందము
రసవదలంకారము సర్వము సంపూర్ణము

శ్రీ శ్రీ శ్రీః



SRI VENKATESVARA ORIENTAL INSTITUTE, TIRUPATI

## Price list of Publications

*General Editor*: —PROF P. V. RAMANUJASWAMI, M A., *Director*.

| *Sri Venkatesvara Oriental Series*:— | Rs. | A |
|---|---|---|
| 1. **Sri Venkatesvara Kavya Kalapa**, (Sanskrit) Ed. by Sri D. T. Tatacharya, M.O.L. ... | 4 | 0 |
| 2. **History of Tirupati**, Volume II (English) by Dr. S. Krishnaswami Aiyangar, M.A., Ph.D. | (*Out of Stock*) | |
| 3. **A Glossary of Indian Philosophical Terms**, (Sanskrit-English) by Sri C. V. Sankara Rao, M.A. .. | 1 | 8 |
| 4. **Psychology**, (Telugu) by Dr. K. C. Varadachari, M.A., Ph.D. | (*Out of Stock*) | |
| 5. **Isavasyopanishad Bhashya**, of Venkatanatha, (Sanskrit-English) Ed. & Translated by Dr. K. C. Varadachari, M.A., Ph.D. & Sri D. T. Tatacharya, M.O.L. | (*Out of Stock*) | |
| 6. **Samurtarchanadhikarana (Atri Samhita)**, (Sanskrit) Ed. by Mr. Raghunatha Chakravarthi Bhattacharya & Sri M. Ramakrishna Kavi, M.A. | 6 | 0 |
| 7. **Suvarnasaptati Sastra**. (Sanskrit) Reconstructed from the Chinese & Ed. by Sri N. Aiyaswami Sastri ... | 3 | 0 |
| 8. **Kenopanishad Bhashya**, by Rangaramanuja (Sanskrit-English) Ed. & Translated by Dr. K. C. Varadachari, M.A., Ph.D. & Sri D. T. Tatacharya, M.O L. ... ... ... ... | 1 | 0 |
| 9. **Tirukkural-Kamattuppal**, with the commentaries of Kalingar and Paripperumal (Tamil) Ed. by Sri T. P. Palaniappa Pillai, B.O.L. ... ... | 2 | 0 |

| | | Rs. | A. |
|---|---|---|---|
| 10. | **Sri Venkatesvara Vachanamulu,** (Telugu) Edited by Sri V. Prabhakara Sastri ... ... | 1 | 8 |
| 11. | **Sringarasankirtanamulu,** Vol. IV of Tallapaka Annamacharyulu (Telugu) Ed. by Sri V. Prabhakara Sastri ... ... ... ... | 2 | 0 |
| 12. | **Kasyapa-Jnanakanda (Kasyapa Samhita),** (Sanskrit) Ed. by Sri R. Parthasarthi Bhattachar ... | 3 | 0 |
| 13. | **Andhra-Kuvalayanandamu** ,(Telugu) by Ubhayabhasha Pravina Sri K. Subrahmanya Sastri ... | 3 | 12 |
| 14. | **Tirukkural-Porutpal,** with the commentaries of Kalingar and Paripperumal (Tamil) Ed. by Sri T. P. Palaniappa Pillai, B.O.L. ... .. | 4 | 0 |
| 15. | **Kathopanishad Bhashya,** of Rangaramanuja (Sanskrit-English) Ed and Translated by Dr. K. C. Varadachari, M.A., Ph. D. and Sri D. T. Tatacharya, M.O.L. ... ... ... | 3 | 12 |
| 16. | **Sri Venkatesvara Laghu Kritulu,** (Telugu) Edited by Sri V. Prabhakara Sastri ... .. | 1 | 8 |
| 17. | **Annamacharya Charitramu,** (Telugu) Edited by Sri V. Prabhakara Sastri ... ... ... | 2 | 8 |
| 18. | **Tiruvengada Sthalapuranam,** (Tamil) with prose supplement Ed. by Sri T. P. Palaniappa Pillai, B.O.L. ... ... ... ... | 1 | 8 |
| 19. | **Alankarasangraha,** of Amritanandayogi, (Sanskrit) Edited by Sri P. Balakrishnamurti, M.A. | 3 | 4 |
| 20. | **Subhadra Kalyanamu,** (Telugu) by Tallapaka Timmakka, Ed. by Sri V. Prabhakara Sastri .. | 0 | 12 |
| 20a. | **Sankaravilasam,** (Tamil) Ed. by Sri T. P. Palaniappa Pillai, B.O.L. ... ... ... | 3 | 4 |
| 21. | **Janasrayi,** (Sanskrit) Ed. by Sri M. Ramakrishna Kavi, M.A. ... ... .. | 1 | 0 |

| | | Rs. | A. |
|---|---|---|---|
| 22. | **Adhyatmasankirtanalu,** Vol. V. of Tallapaka Annamacharyulu (Telugu) Ed. by Sri V. Prabhakara Sastri ... ... .. | 3 | 4 |
| 23. | **Tiruvengada Ula,** (Tamil) Ed. by Sri T. P. Palaniappa Pillai, B.O.L. .. ... ... | 1 | 8 |
| 24. | **Adhyatmasankirtanalu,** Vol. VI of Tallapaka Annamacharyulu (Telugu) Ed. by Sri A. V. Srinivasachari ... ... ... | 2 | 0 |
| 25. | **Prasnopanishad Bhashya,** of Rangaramanuja (Sanskrit-English) Ed. and Translated by Dr. K. C. Varadachari, M.A., Ph.D. and Sri D. T. Tatacharya, M.O.L. ... ... ... | 2 | 12 |
| 26. | **Sri Venkatesvara Stuti Ratnamala,** (Telugu) Ed. by Sri V. Prabhakara Sastri ... ... | 1 | 2 |
| 27. | **Dharmasangraha,** (Sanskrit) Ed. by Prof. P. V. Ramanujaswami, M.A. ... ... ... | 2 | 0 |
| 28. | **Nipatavyayopasargavritti,** (Sanskrit) Ed. by Vidya Pravina Sri A. Someswarasarma, P.O.L. ... | 2 | 0 |
| 29. | **Adhyatmasankirtanalu,** Vol VII of Tallapaka Annamacharyulu (Telugu) Ed. by Sri R. Anantakrishna Sarma & Sri A. V. Srinivasachari ... | 3 | 0 |
| 30. | **Bharata Kosa,** (Sanskrit) Ed. by Sri M. Ramakrishna Kavi, M.A. ... ... ... | 22 | 0 |
| 31. | **Adhyatmasankirtanalu,** Vol. VIII of Tallapaka Annamacharyulu (Tel.) Ed. by Sri R. Anantakrishna Sarma & A. V. Srinivasachari ... | 3 | 0 |
| 32. | **Raghuvamsa,** (Cantos 1 & 2), Translated into Tamil and Ed. by Sri D. T. Tatacharya, M.O.L (*Shortly*) | | |
| 33. | **Adhyatmasankirtanalu,** Vol. IX of Tallapaka Annamacharyulu (Tel.) Ed. by Sri R. Anantakrishna Sarma ... ... ... ... | 3 | 0 |
| 34. | **Sri Venkatesvara Stuti Ratnamala,** (Tel.) Vol. II Ed. by Sri K. Ramakrishniaya, M.A. .. ... | 2 | 0 |

| *Sri Venkatesvara Oriental Institute Studies:—* | Rs. | A. |
|---|---|---|
| 1. **Theory of Knowledge in the Philosophy of Sri Ramanuja** (English) by Dr. K. C. Varadachari, M.A. Ph.D. ... ... ... ... | 3 | 0 |
| 2. **Rupakaparisuddhi** (Sanskrit) by Sri D. T. Tatacharya, M.O.L. ... ... ... | 1 | 0 |
| 3. **Idea of God** (English) by Dr. K. C. Varadachari, M.A., Ph. D. .. ... ... ... | 3 | 0 |
| 4. **Sahityavimarsa** (Sanskrit) by Vidya Pravina Sri A. Someswarasarma, P.O.L. ... ... | 2 | 0 |
| 5. **The Dharmasutras & the Dharmasastras** (English) by Dewan Bahadur K. S. Ramaswami Sastri, B.A., B.L. ... ... ... .. | 0 | 12 |
| 6. **Virasaiva Literature,** (Telugu) by Sri S. Ramakrishna Sastri, M.A., B.O.L. ... ... ... | 5 | 0 |

*For copies of the above apply to*

THE DIRECTOR,

S. V. Oriental Institute, ṬIRUPATI,

(*Chittoor Dist.*) *South India.*

